

# అచలాత్మజా పరిణయము.

## ద్వ్యర్థ ప్రబంధము.

### ప్రథమాశ్వాసము.

---

ఉ. శ్రీరమణీమణీసతత ♦ జృంభితము న్వర వైజయంతికా
సారవిరాజితంబు విల ♦ సద్రుచికౌస్తుభశోభితంబు నా
భూరితకోర మింపులచు ♦ బొల్పెసఁగంగను భక్తకోటికా
ధారముసౌఖ్యదాయియగు ♦ దైవశిఖామణి శౌరిఁగొల్చెదన్

*　　*　　*　　*　　*

## షష్ఠ్యంతములు.

క. ఏతాదృశ సుగుణమణి
వ్రాతాంబుధికిం బ్రపన్న ♦ వరసేవధికిం
బీతాంకిత గీతామృత
జాతాఖిల సుజనముక్తి ♦ సౌఖ్యావధికిన్. ౧

టీ. ఏతాదృశ=ఇట్టి, సుగుణమణి = యోగ్యగుణములనెడు మాణిక్యములయొక్క, వ్రాత = సముదాయమునకు, అంబుధికిన్ = సముద్రుఁడయి.

నట్టియు, ప్రపన్న = భక్తులకు, వర = శ్రేష్ఠమయిన, సేవధికిన్ = నిధియైనట్టియు, పీత = పానము చేయఁబడిన, అమిత = హద్దులేని, గీతా = భగవద్గీత యనెడు అమృత = అమృతబిందువులయొక్క, జాత = సమూహముగల, అఖిల = ఎల్లవారైన, సుజన = సౌభాగ్య జనులయొక్క, ముక్తికి=మోక్షము చేతనయిన, సౌఖ్య = సుఖమునకు, అవధికిన్ = హద్దయినట్టివానికి,

క. శరణాగత భరణాయత
కరుణారస లసదపాంగ ♦ కమలదళౌఘా
భరణాళి వితరణాదృత
వరుణాలయ రాజసుహిత్ర ♦ వర వక్షునకున్. ౨

టీ. శరణ = రక్షణమునుగూర్చి, ఆగత = వచ్చిన వారియొక్క, భరణ = పోషించుటచేతను, ఆయత = విస్తారమైనట్టియు, కరుణారస=దయారసము చేతను, లసత్ = ప్రకాశించుచున్న, అపాంగ = క్రేఁగంటి చూపులనెడు, కమలదళ = తామరరేకులయొక్క, ఓఘ = సమూహమురూపమగు ఆభరణ = అలంకారములయొక్క, అళి = పఙ్క్తియొక్క, వితరణ=ఇచ్చుట చేతను, ఆదృత=ఆదరించఁబడిన, వరుణాలయ సుహిత్ర = లక్ష్మిచేత, వర = శ్రేష్ఠమగు, వక్షునకున్ = వక్షస్థలము గలిగినట్టివానికి.

క. గర్హణ రహితార్హణ పర
బర్హిణ హయ వర సరోజ ♦ వన హంసునకున్
బర్హి పరిబర్హ ధురీ
ణార్హదరీణ మకుటాంచ ♦ దవతంసునకున్. 3

టీ. గర్హణ = నిందతోడ, రహిత = శూన్యమైనట్టియు, అర్హణ = పూజ, పర=ప్రధానముగల, బర్హిణ = నెమిలియనెడు, వర = శ్రేష్ఠమయిన, హయ=గుఱ్ఱముగల కుమారస్వామియొక్క, సరః = సరస్సనందైన, (అనఁగా

స్వామి పుష్కరిణియందయిన) అబ్జవన = పద్మవనమునకు, హంసునకున్ = అంచయైనట్టియు, [అందు విహరించునట్టి] బర్హ = నెమలిపురి యనెడు, పరీబర్హ = రాజచిహ్నముయొక్క, ధురీణ = భారమును వహించినట్టియు, అర్హాత్ = తగిన, అరుణ = చెడిపోనట్టి, మకుట = కిరీటముచేతను, అంచత్ = ఒప్పుచున్న, అవతంసమునకున్ = శిఖగలిగినట్టివానికి

క. నందనతరు నిందన కృద
మంద నవ యశోవిశేష ♦ మహిమ జిత వృష
స్యందన చందన కుంద న
వేందునకు నజాండ పటల♦హిత తుందునకున్. ౪

టీ. నందనతరు = కల్పవృక్షములయొక్క, నిందన = ఏవగింపును, కృత్ = చేయునట్టి, ఆమంద = గొప్పదియగు, నవ = నూతనమైనదినగు, యశోవిశేష = కీర్త్యతిశయముయొక్క, మహిమ = సామర్థ్యముచేతను, జిత = జయింపఁబడిన, వృషస్యందన = ఈశ్వరుఁడును, చందన = మంచి గందమును, కుంద = మల్లెపూవును, నవ = నూతనుఁడగు, ఇందునకున్ = చంద్రుఁడు గలిగినట్టియు అజాండ = బ్రహ్మాండములయొక్క, పటల = సమూహమునకు, హిత = అనుకూలమగు, (అనఁగా నుండఁదగిన) తుందునకున్ = కడుపు గలిగినట్టివానికి,

విశేష — (నవేందుఁడని చెప్పుటచేత కళంకము లేదనియు, వృద్ధిఁ బొందువాఁడనియు స్వారస్యము)

క. శబరీ కబరీ నిబిరీ
స బరీభృత వంజులప్ర♦సవ రిరసయిహా
శబలిత నరహరివిగ్రహ
కబళిత కళ్యాణకశిపు ♦ ఘన గరిమునకున్. ౫

టీ. శబరీ = శబరస్త్రీ వేషధారిణియగు లక్ష్మియొక్క, కబరీ = కొప్పునందు, నిబిరీస = దట్టముగాను, బరీభృత = మిక్కిలి ధరింపఁబడిన, వంజుల ప్రసవ = అశోకపుష్పములయొక్క, రిరంసయిషా = ఆస్వాదించనిచ్ఛచేతను, శబలిత = చిత్రవర్ణముకలదిగా చేయఁబడిన, నరహరివిగ్రహ = నృసింహశరీరముచేతను, కబళిత = మ్రింగఁబడిన, కశ్యాణకశిపు = హిరణ్యకశిపునియొక్క, ఘన = గొప్పదియగు, గరిమునకున్ = గౌరవము గలిగినట్టివానికి,

క. వేలాతిగ లీలాతిశ
యాలాప కలా కలాప ♦ హర్షిత ధరణీ
లీలా తరుణీ లాలిత
ఖేలా పరిచరణ చరణ ♦ కిసలయ ధృతికిన్. ౬

టీ. వేలాతిగ = హద్దుమీఱిన, లీలా = విలాసములయొక్క, అతిశయ = గొప్పతనముగల, ఆలాప = పలుకులయొక్క, కలా = నేర్పులయొక్క, కలాప = సమూహముచేతను, హర్షిత = సంతోషింపఁజేయఁబడిన, ధరణీ = భూమియను, లీలాతరుణీ = విహారస్త్రీచేతను, లాలిత = ఆదరించఁబడిన, ఖేల = క్రీడయందైన, పరిచరణ = ఉపచారములుగల, చరణకిసలయ = చివుళ్ళవంటి పాదములయొక్క, ధృతికిన్ = ధరించుట గలిగినట్టివానికి

క. బంధుర దర మంధరతర
సింధుర వర చరణ చరణ ♦ శిత ముఖ మగర
స్కంధ నవోద్గంధన క్రు
ద్గంధ నమ త్పలిత భరిత ♦ తత చక్రసకున్. ౭

టీ. బంధుర = విస్తారమగు, దర = భయముచేతను, మంధరతర = మిక్కిలి మందమయిన, సింధుర = ఏనుఁగుయొక్క, వర = శ్రేష్ఠమగు, చరణ = పాదముయొక్క, చరణ = నమలుటయందు, శిత = తీక్ష్ణమగు.

ముఖ = మోముగల, మకర = మొసలి యొక్క, స్కంధ = మూపు యొక్క నవ = క్రొత్తదియగు, ఉద్గంధన = నరుకుటను, కృత్ = చేసినట్టియు, గంధ = లేశముగాను, నమత్ = వంగినట్టియు, పరిత = బురదచేత, భరిత = నిండిన, తత = విస్తారమగు, చక్రినకున్ = సుదర్శనముగలిగినట్టివానికి.

క. జల్పాక వికల్పాతిగ
తల్పాకలితునకు సుజన ♦ తా హిత కరణా
కల్పాగమకల్పాంచ ద
నల్పాభయ ముద్రికాంక ♦ హస్తాబ్జునకున్. ౮

టీ. జల్పాక = ప్రేలరుల యొక్క, వికల్ప = పలుకేతులను, అతిగ = అతిక్రమించిన (అనఁగా శబ్దశాస్త్రపు కట్టులేక పలువురు పలువెఱఁగుల శబ్దము నుచ్చరించుచుండఁగా దానికి కట్టు నేర్పరచిన వాఁడనుట అనఁగా పతంజలి, అతఁడే శేషుఁడు) శేషుఁడనెడు తల్ప = శయ్యయందు, ఆకలితునకున్ = ఒప్పుచున్నట్టియు, సుజనతా = యోగ్యజన సమూహము యొక్క హిత = ఇష్టము యొక్క, కరణ = చేయుటయందు, కల్పాగమకల్ప = కల్పవృక్షముతో సమానమయినట్టియు, అంచత్ = ఒప్పుచున్న, అనల్ప = విస్తారమగు, అభయముద్రిక = భయము లేదని యర్థమును సూచనజేయునట్టి యభినయము, అంక = చిహ్నముగాఁగల, హస్తాబ్జునకున్ = పద్మమువంటి హస్తము గలిగినట్టి వానికి.

క. విష్ణునకరిజిష్ణునకతి
ధృష్ణునకిన జావనీ చ ♦ రిష్ణునకును వ
వర్ధిష్ణునకతితృష్ణునకు భ
విష్ణునకును గృష్ణునకు న ♦ విత కృష్ణునకున్.

టీ. విష్ణునకన్ = వ్యాపక స్వభావుఁడైనట్టియు, అరిజిష్ణునకున్ = శత్రువులను జయించునట్టియు, అతిధృష్ణునకున్ = మిక్కిలి దురుసువాఁడయినట్టియు, ఇనజ = యమునానదియొక్క, అవనీ = భూమియందు, చరిష్ణునకున్ = సంచరించువాఁడయినట్టియు, వర్ధిష్ణునకున్ = వృద్ధిఁబొందు స్వభావము గలిగినట్టియు, అతితృష్ణునకున్ = ఆశ నతిక్రమించినట్టియు, (ఆశలేనివాఁడనుట) భవిష్ణునకున్ = కాఁగలవాఁడయినట్టియు, కృష్ణునకున్ = కృష్ణావతారుఁడయినట్టియు, అవిత = రక్షింపఁబడిన, కృష్ణునకున్ = ద్రౌపదీదేవి గలిగినట్టి వానికి.

క. వాచాతిగ భీ చాపల
నీచాగ్రగ మన్మనోజ ♦ నిత తాప హరా
నూచాన సుధా చారు ద
యాచాతురి నలరు వేంక ♦ టాచలపతికిన్. ౧౦

టీ. వాచా = వాక్యములను, అతిగ = అతిక్రమించిన, (అనఁగాఁ జెప్ప శక్యముగాని) భీ = భయముయొక్క, చాపల = చాంచల్యముగల, నీచ = తక్కువ వానిలో, అగ్రగ = ముందుగా నడచునట్టి, మత్ = నాయొక్క, మనః = చిత్తమునందు, జనిత = పుట్టిన, తాప = తాపముయొక్క, హర = హరించుటయందు, అనూచాన = గురువు వలన సాంగాధ్యయనము జేసిన, (అనఁగా బాగుగ నెఱిఁగినదనుట) సుధా = అమృతమువలె, చారు = మనోహరమయిన, దయా = అక్కటికముయొక్క, చాతురిన్ = నేర్పుచేతను, అలరు = ఒప్పుచున్న, వేంకటాచల పతికిన్ = తిరుమలకుఁ బ్రభువగు శ్రీవేంకటేశ్వరునికి.

వ. సమర్పితంబుగా నొనర్పఁబూనిన యచలాత్మజా పరిణయం బను శ్లేష ప్రబంధంబునకుఁ గథావిధానం బెవ్విధానంబునం బ్రవర్తిల్లెనన. ౧౧

టీ. సమర్పితంబుగా = ఈయఁ బడ్డదిగా, ఒనర్పన్ = చేయుటకు, పూనిన=ఆరంభించిన, అచలాత్మజా=పర్వతపుత్రికయగు పార్వతియొక్కయు, భూపుత్రికయగు సీతయొక్కయు, పరిణయంబు=వివాహము, (అనఁగా వారి వివాహకథ ప్రధానముగాఁ గలది) అను = అని చెప్పఁబడునట్టి, శ్లేష ప్రబంధమునకున్=రెండర్థములు గల కావ్యమునకు, కథావిధానంబు=కథా పద్ధతి, ఎవ్విధానంబునన్ = ఏతీరున, ప్రవర్తిల్లెనన = జరిగెనన.

## కథాప్రారంభము.

ఉ. వందన కృత్పురందర భ ♦ వ ప్రముఖామర బృంద మిందిరా
నంద ముకుంద కీర్తిగ ♦ కథన ప్రథ నొప్పు బాసవాల్
సుందరులం దనర్చి వర ♦ లు నవని నైమిశ మట్టి సజ్జనా
నందనమై విలాస జిత ♦ నందనమైన తపోవనంబునన్. ౧౨

టీ, వందన=నమస్కారమును, కృత్ = చేయుచున్న, పురందర = దేవేంద్రుఁడును, భవ = శివుఁడును, ప్రముఖ=మొదలుగాఁగల, అమర = దేవతలయొక్క, బృందము=సమూహముగల, నైమిశము = నైమిశమను పేరుగల, వని = అరణ్యము, ఇందిరా=లక్ష్మియొక్కయు, నంద = నందునియొక్కయు ముకుంద = కృష్ణునియొక్కయు, కీర్తి = కీర్తులయొక్క, కథన = కథల యొక్క, గ్రథన=కూర్పువలన, ప్రథన్ = ప్రసిద్ధిచేత, ఒప్పు = తగియున్న, బాసవాల్ = మునులయొక్క, సుందరులన్ = స్త్రీలచేత, తనర్చి = ఒప్పి నదై, వరలున్=ప్రకాశించును. అట్టి=అప్రకారమైన, సజ్జన=యోగ్యజనులకు, ఆనందము = ఆనందింపఁజేయునది, ఐ = అయి, విలాస = శోభచేతను, జిత= జయించఁబడిన, నందనమైన, స్వర్గోద్యానముకలది యైనట్టి, తపోవనంబున్ = తపస్సునకనుకూలమగు వనమందు, ముందుపద్యముతో నన్వయము.

చ. సరసిజపత్రనేత్ర వర ♦ సామజ వల్లభ శృంఖలాయిత
స్వ రచిత భక్తిమానితుఁడు ♦ శౌనకమౌని మనోవినోద కృ
త్సరళ కథాభిధాన దవ ♦ ధాన విధాతను సూతజు న్మనో
హర మచలాత్మజాపరిణ ♦ యంబు నయంబున దెల్ప వేయనన్.

టీ. సరసిజపత్రనేత్ర=విష్ణువనెడు, వర = శ్రేష్ఠుఁడయిన, సామజ వల్లభ = గజరాజునకు, శృంఖలాయిత = సంకెలవలె నాచరించుచున్న, స్వ= తనచేత, రచిత = చేయఁబడిన, భక్తి = భక్తిచేతను, మానితుఁడు = పూజింపఁబడిన, శౌనకమౌని=శౌనకుఁడను ఋషి, మనోవినోద=మనస్సంతోషమును, కృత్ = చేయునట్టి సరళ = మృదువులగు, కథా=కథలయొక్క, అభిధా= చెప్పుటయందు, సత్ = యోగ్యమయిన, అవధాన = జాగరూకతకు, విధాతను=చేయునట్టి, లేదా జాగరూకతయందు బ్రహ్మయగునట్టి, సూతజున్ = సూతపుత్త్రుని, మనోహరము=మదినానందింపఁజేయునట్టి, అచలాత్మజాపరిణయంబున్=అచలాత్మజావివాహమును, నయంబునన్ = నీతిచేత, చెప్పవే = చెప్పుమా, అనన్= అనగా, పయిపద్యముతో నన్వయము.

ఉ. సంతస మంత గొంత మది ♦ సంధిల సూతసుతుండు బల్కె నో
శాంతి నిశాంత సద్వచన ♦ చాతురిచే నచలాత్మజా మహో
దంతము దెల్పు మంటి వది ♦ యంబిక పెండ్లియొ, సీతపెండ్లియో
వింతగ రెండునొక్కపరి ♦ వెల్వడఁజెప్పెద నంచు హృష్టుఁడై.

టీ. అంత=అంతట, కొంత సంతసము=కొంచెము సంతోషము, మదిన్= మనస్సునందు, సంధిలన్ = కూడుకొనఁగా, సూతసుతుండు = రోమహర్షణుని కొడుకు, ఉగ్రశ్రవుఁడు. ఓశాంతినిశాంత = శాంతికి గృహమైన శౌనకుఁడా! సత్=యోగ్యములగు, వచన=వాక్యములయొక్క, చాతురిచేన్ = నేర్పుచేతను, అచలాత్మజా=అచలాత్మజయొక్క, మహాత్=గొప్పదియగు లేక,

మహోత్సవము యొక్క, ఉదంతమున్ = వార్తను, తెల్పుచుంటివి = చెప్పు చుంటివి, అది = నీవు జెప్పుచున్నది అంబిక పెండ్లియో = పార్వతీవివాహమో? సీత పెండ్లియో = జానకీవివాహమో? వింతగా = ఆశ్చర్యముగా, రంతున్ = రెంటికథలును, ఒక్కపరి = ఒక్కపర్యాయము, వెల్వడన్ = బయలుదేరునట్లుగా, చెప్పెదన్ = చెప్పెదను, అంచు = అనుచు, హృష్టుఁడై = సంతోషించినవాఁడై, పల్కెన్ = చెప్పెను.

క. అనుగత సదర్థ పరమహి
మ నగరి సకలభవనాగ్ర ♦ మహిత గజౌఘం
బునఁదనరు సదాగతి కృత
ఘన సంగతి మిథిల యనఁగ ♦ గరిమాస్పదమై. ౧౫

పార్వతీపరము—అనుగత సదర్థ పరమ–అనుగత = అనుసరించిన, సత్ = సౌఖ్యమును. అర్థ = వస్తువులచేతను, పరమ = ఉత్కృష్టము యినదియును, హిమ నగరి = హిమవత్పురము, సకలభవనాగ్రమహితగజౌఘంబునన్— సకలభ = ఏనుఁగు పిల్లలతోఁగూడిన, వనాగ్ర = వనాగ్రములయందు, మహిత = పూజ్యము లైన, గజ = ఏనుగులయొక్క, ఓఘంబునన్ = సమూహముచేతను, సదా గతి...మిథిల, సదాగతి – వాయువుచేతను, కృత = చేయఁబడిన, ఘన = మేఘములయొక్క, సంగతి = కలయికయొక్క, మిథి = మథనమును, ల = పొందినది, అనఁగన్ = అనునట్లుగా. (అనఁగా ఏనుఁగుగుంపుఁగా నీ మేఘములేలయని గాలి మేఘముల నెగరగొట్టినదనుట) గరిమ = గొప్పతనమునకు, [అనఁగా నౌన్నత్యమునకు] ఆస్పదమై = స్థానమై, తనరున్ = ఒప్పును.

సీతాపరము—అనుగత...మహిమ, అనుగతసదర్థ = అనుసరించిన మంచి వస్తువులచే, పర = ఉత్కృష్టము యిన, మహిమ = సామర్థ్యముగల, సదాగతి...సంగతి. సత్ = యోగ్యులయొక్క, ఆగతి = వచ్చుటచేతను, కృత = చేయబడిన, ఘన = గొప్పవారియొక్క, సంగతి = కలయికగల,

మిథిలయనఁగ = మిథిలయను పేరుగల, నగరి = పట్టణము, గరిమ = గౌర వమునకు, ఆస్పదమై = స్థానమై, సకల...ఓఘంబునఁ, సకల = సమస్తము లయిన, భవన = గృహములయొక్క, అగ్ర = ఎదుటను, మహిత = పూజ్య ములయిన, గజ = ఏనుఁగులయొక్క, ఓఘంబునఁ = సమూహముచేత, గరిమాస్పదమై తనరుఁ = ఒప్పును.

సీ. పంకలగ్నతలేని ♦ పద్మినుల్ప్రియుని న
ర్ధాంగీకృతినిఁజేయ ♦ నట్టి సతులు
మధుపానమత్తరూ ♦ పధృతి నందని కొమ్మ
లమలినత్వమున నిం ♦ పగు సురమణు
లకృత పల్లవ రాగ ♦ లగు లతకూనలు
ద్విస్వభావత లేక ♦ వెలయు కన్య
లినుని తేజము గ్రుంగ ♦ నీయని యనసూయ
లే కళంకిని గూడ ♦ కెనయు చాన

గీ. లెంచ విటపాళి సంగతి ♦ యించుకయును
లేని కలకంఠులు సురాగ ♦ మానుమత్త
భావమున లేని భామ ల ♦ప్పట్టణమున
శీలవతు లుందురు గుణాను ♦ కూలమతులు. ౧౩

టీ. అప్పట్టణమునఁ = ఆ పురమునందు, శీలవతులు = సౌశీల్య స్వభావము కలిగినట్టియు, గుణానుకూలమతులు = గుణమునకు ననుకూల మగు బుద్ధికలవారును, అగు, ఇది ముందువచ్చు పద్మినుల్ మొదలగు నన్ని శబ్దములకు విశేషణము, పంకలగ్నతలేని = పాపముయొక్క తగులుటలేని, పద్మినుల్ = పద్మినీజాతి స్త్రీలు, పద్మినుల్ = పద్మలతలైతే, పంకలగ్నత =

బురదయొక్క తగులుటకలవి, ప్రియునిన్ = పెనిమిటిని, అర్ధాంగీకృతునిన్ = సగమంగీకరించఁబడ్డ వానినిగా, చేయునట్టి = చేయని, సతులు = పతివ్రతలు, సతి = సతీదేవియొక్క యవతారాంతరమగు పార్వతి. ప్రియుని, అర్ధాంగీకృతునిన్ = సగము శరీరముగల వానినిఁగాఁ జేయఁబడ్డ వానినిఁ జేసెను. మధుపా...ధృతిన్ = మధుపాన = మద్యపానముచేతను, మత్త = మదించిన, రూప = స్వరూపముయొక్క, ధృతిన్ = ధరించుటచేతను, అందని = పొందనట్టి, కొమ్మలు = స్త్రీలు, కొమ్మలు = వృక్షశాఖలయితే, మధుపా... ధృతిన్ - మధుప = తుమ్మెదలచేతను, ఆనమత్ = వంగుచున్న, తరు = వృక్షములచేతనయిన, ఉపధృతిన్ = ధరించుటను బొందినవి, అమలినత్వమునన్ = మాలిన్యములేకపోవుటచేత, ఇంపగు = ఆహ్లాదకరులగు, సు= సౌభాగ్యలయిన, రమణులు = స్త్రీలు, సురమణులు = ఇంద్రనీలములయితే, మలినత్వము = నలుపునుపొందినవి, ఆకృత = చేయఁబడని. పల్లవ = విటులయందలి, రాగలు = అనురక్తికలవారు, అగు = అయిన, లతకూనలు = స్త్రీలు, లతకూనలు = చిన్నతీవలయితే, కృతపల్లవరాగలు = చేయఁబడిన చిగుళ్ళయొక్క యెరుపుగలవి, ద్విస్వభావత= సౌమ్యాసౌమ్య స్వభావములు గలుగుట, లేక వెలయు=లేకయొప్పుచున్న, కన్యలు = స్త్రీలు, కన్య = కన్యారాసియైతే, ద్విస్వభావతన్ = చరస్థిరస్వభావములు గలుగుటచేతనొప్పును, ఇనునితేజమున్ = పెనిమిటియొక్క తేజస్సును, త్రుంగనీయని = తగ్గనీయనట్టి. అనసూయలు = కోపములేని వారలు, అనసూయ = అత్రిమహాముని భార్యయయితే, ఇనుని = సూర్యునియొక్క, తేజము = కాంతిని, త్రుంగఁజేసినది = సూర్యోదయము కాకుండఁ జేసినదనుట, ఏకలంకినిన్ = ఎట్టిమాలిన్యముగలవానిని, కూడక = కలియక, ఎసయు = ప్రసిద్ధిబొందిన, చామలు = స్త్రీలు, చామ=ఇదిశ్యామాశబ్దతద్భవము, శ్యామాశబ్దమువలెనే, రాత్రియర్థముకలది. రాత్రియైతే, కళంకిని = కళంకముగల చంద్రునిఁగూడినది. ఎంచన్ = విచారించఁగా, విట = విటులయొక్క, పాళి = పఙ్క్తియొక్క, సంగతి=కలయిక, యించుకయునన్ = కొంచెమయినను, లేని = లేనట్టి, కలకంఠులు = అవ్యక్తమధురధ్వనులుగల

స్త్రీలు, కలకంఠులు= ఆడుకోయిల లయితే, విటపాళిసంగతి, విటప = చెట్టు కొమ్మలయొక్క, ఆళి = పంక్తియొక్క, సంగతి=స్నేహముకలవి, సురాగమానుషక్తి. సురా = మద్యముయొక్క, ఆగమ = రప్పించుటయొక్క, అనుషక్తి = సంబంధము, భావమునన్=మనస్సునందు, లేని = లేనట్టి, భామలు = స్త్రీలు, భామ=సత్యభామయైతే, సురాగమానుషక్తి. సురాగము = పారిజాతవృక్షమందు, అనుషక్తి = ఆసక్తికలది, ఇట్టివారు, ఉందురు = ఉంచున్నారు.

శా. భవ్యార్థాగమ మంత్రతంత్రవిధులన్ ♦ భావంబుదీపింపఁగా
స్తవ్యశ్రీకరహోమయాగమహిత♦చ్ఛందస్స్ఫురద్వృత్తితో
నవ్యాజోన్నతులై సదధ్వరహిత♦వ్యాపారము ల్మీఱ వా
స్తవ్య ల్వారసతు ల్పురిం బోలుతురెం♦చన్ యజ్ఞపత్నుల్బలెన్.

టీ భవ్య...విధులన్. భవ్య = సమంగళములై, అర్థ=అర్థములుగల, ఆగమ = శాస్త్రములయందలి, మంత్ర = మంత్రములయొక్కయు, తంత్ర= క్రియలయొక్కయు, విధులన్=చేయడములచేత, అని పత్నీపరము, భవ్య = కాఁబోవునట్టి, అర్థ=ధనముయొక్క, ఆగమ=రావడముయొక్క, మంత్రి = ఆలోచనలయొక్కయు, తంత్ర=పనులయొక్కయు, విధులన్ = చేయడముల చేత, అని వేశ్యాపరము, భావంబు = అభిప్రాయము, పత్నీశృంగారభావము - దీపింపఁగా = ప్రకాశింపఁగా, స్తవ్య...వృత్తితోన్ - స్తవ్య-స్తోత్రము చేయఁదగిన, శ్రీకర = ఐశ్వర్యమును జేయునట్టి, హోమ = హోమములుగల, యాగ=యజ్ఞములయందు, మహిత=పూతములగు, ఛందః = వేదములయొక్క, స్ఫురత్=ప్రకాశించుచున్న, వృత్తితోన్ = ప్రవర్తనముతో - పత్నీపరము, స్తవ్య = స్తోత్రము - చేయఁదగిన శ్రీక=శోభగల, రహోమయ = రహస్యప్రచురమయిన, ఆగమ = శాస్త్రమునకు, మన్మథశాస్త్రమునకని యర్థము, హిత = ఇష్టమగు, ఛంద = అభిప్రాయముచేత, స్ఫురత్ =ప్రకాశించుచున్న, వృత్తితోన్=వ్యాపారముతో-వేశ్యాపరము, అవ్యాజోన్నతులై, అవి-గొప్పల

చేతను, అజ=మేకలసమూహముచేతను, ఉన్నతలు = ఔన్నత్యముకలవారు, వపాహోమమునకై = గొఱ్ఱెలును మేకలును యజ్ఞముచేయువారికి నుండవలెను. పత్నీపరము. అవ్యాజ=కపటములేనివారై ఉన్నతలు - గౌరవము కలవారు, వేశ్యాపరము, అయి - సదధ్వ...వ్యాపారముల్, సత్ - యోగ్యమయిన, అధ్వర - యజ్ఞములకు, హిత - ఇష్టములగు, వ్యాపారముల్ - పనులు, పత్ని, సత్ - యోగ్యమగు, అధ్వ - మార్గముతోడ, రహిత - శూన్యములగు, వ్యాపారముల్ - పనులు, వేశ్యా, మీఱన్ - అతిశయించఁగా, ఎంచన్ = ఆలోచింపఁగా, యజ్ఞపతుల్ బలెన్ - యజ్ఞములుచేయుసోమిదేవులవలె, వాస్తవ్య = నివసించియున్న, వారసతుల్ - వేశ్యాస్త్రీలు, పురిన్ - పట్టణమున, పొలుతురు - ఒప్పుదురు.

సీ. జడజాదికలతోడ ♦ కడు వేడుకలనుండు
ప్రమథవల్లభుని వై ♦ రాగ్యమెంత
వెలి ద్విజులెక్కరిం ♦ తలుసల్పఁదగునట్టి
జలజసంభవుని యా ♦ చారమెంత
తలవాంచికొని నాలు♦కలు త్రొక్కుపడ నిల్చు
సురగధూర్వహుని వా♦క్ప్రౌఢియెంత
పగలెపుష్పిణియైన ♦ పద్మినిఁగలసి భా
సిలు హేళి కర్మసా♦క్షిత్వమెంత

గీ. దక్షిణాశయొకప్పుడుఁ ♦ దఱుగ నట్టి
కుంభసంభవు గాంభీర్య ♦ గుణమదెంత
యనుచుఁ దమయోగ్య గుణములె ♦ జనులు బొగడఁ
బొలుతు రపట్టణంబున ♦ భూమిసురులు. ౧౮

టీ జడజారికలతోడఁ - జడ=మందబుద్ధిఁగల జారికలతోడఁ = జారస్త్రీలతోడ అని యర్థము, జడజారి. జడల కభేదమువలన, జలజారి= చంద్రుని యొక్క, కలతోడఁ = పదియాఱవభాగము తోడనని యర్థాంతరము, కడువేడుకలఁ=మిక్కిలి యానందములచేత, ఉండు = ఉండునట్టి ప్రమథవల్లభుని=శివునియొక్క, వైరాగ్యము=విరాగత్వము ఎంత=ఎంతటిది, వెలిద్విజులు=వెలిబెట్టఁబడిన బ్రాహ్మణులు, ఎక్కిరింతలు = ఆక్షేపణములు, అని యర్థము. వెలిద్విజులు = తెల్లపిట్టలు, హంసలని యర్థము. ఈ యర్థమున ద్విజులని శ్లేషగావునఁ బ్రయోగించెను. ఐనను సమ్మతముగాదు. ద్విజములని యుండఁదగును. ఎక్కిరింతలు = వాహనములు, సల్పన్ = చేయఁగానని యర్థాంతరము. తగునట్టి - తగినవాఁడయినట్టి, జలజసంభవుని - బ్రహ్మయొక్క ఆచారము - మంచినడవడి. ఎంత - ఎంతటిది. తలవాంచి - తలవంచికొని, నాలుకలు తొట్రుపడఁ - జిహ్వలు కొణుగుబోగా, అని యర్థము. పడగయెత్తునపుడు తలవంచికొనుటయు, రెండు నాలుకలగుటచే నాలుకలు తొట్రుపడుటయు పాములకు స్వభావమని యర్థాంతరము. నిల్చు - ఉండునట్టి, ఉరగభూర్వహుని - శేషునియొక్క, వాక్ప్రౌఢి - మాటల నేర్పు, ఎంత -ఎంతటిది. పుష్పిణియైన - ఋతుమతియైన, పద్మినిఁ- పద్మినీజాతి స్త్రీని, పగలె - పగటియందే, కలసి - సంయోగముచేసి, అని యర్థము ; పగలె - పగటియందే. పుష్పిణి - పువ్వులుగలది. ఐన - అయినట్టి పద్మినిన్ - పద్మలతను, కలసి - కూడుకొని, భాసిలు - ప్రకాశించునట్టి, హేళి - సూర్యునియొక్క, కర్మసాక్షిత్వము - యజ్ఞములయందలి యుపద్రష్టృత్వము అని యర్థము. పనులను జూచుటయని యర్థాంతరము. ఎంత - ఎంతటిది. దక్షిణాశ - దక్షిణ = యజమానుండిచ్చు ద్రవ్యమును, ఆశ - కోరిక, అని అర్థము. దక్షిణదిక్కని యర్థాంతరము. ఒకప్పుడుఁ - ఒక సమయమందైనను, తరుగనట్టి - తగ్గనట్టి, కుంభసంభవు - అగస్త్యునియొక్క, అగస్త్యుఁడు దక్షిణదిక్కున నుండునని ప్రసిద్ధి. గాంభీర్యగుణము - లోతుగుండె గలుగుట యను గుణము, అదెంత - అదెంతటిది. అనుచు తమ

సౌజన్యగుణములె - తమ మంచిగుణములె, జనులు - మనుష్యులు, పొగడన్ - స్తోత్రము చేయఁగా. భూమిసురులు - బ్రాహ్మణులు. అప్పట్టణంబునన్ - ఆపీటియందు, పొలుతురు - ఒప్పుదురు.

శా. పారావారతరంగ రంగ నటన ♦ ప్రారంభ సంభావిత
స్ఫారోదార సుధారస గ్రసన సం ♦ పజ్జన్య చైతన్య సం
భారోద్బంధుర మంధర క్షితిధర ♦ ప్రత్యగ్రడింభంబులోన్
నా రాజిల్లు గజంబు లప్పురములో ♦ నన్యచ్ఛశాంకచ్ఛవిన్

టీ. పారావార - సముద్రముయొక్క, తరంగ - తరంగములనెడు. రంగ - రంగస్థలమందు. నటన - నాట్యముయొక్క, తిరగడముయొక్క యని యర్థము, ప్రారంభ - ఆరంభమందు, సంభావిత - పుట్టుచున్న, స్ఫార - అతిశయించిన, ఉదార - విస్తారమగు సుధారస - అమృతరసము యొక్క, గ్రసన - తినుటయొక్క, సంపత్ - విస్తారముచేతను, జన్య - పుట్టిన, చైతన్య - ప్రాణముయొక్క, సంభార - భరించుటచేతను, ఉద్బంధుర-అతిశయములగు, మందరక్షితధర - కవ్వపుఁగొండయొక్క, ప్రత్యగ్ర-నూతనములైన, డింభంబులోనాన్ - పిల్లలే మోయనున్నట్లుగా, గజంబులు - ఏనుఁగులు , నశ్యత్ క్షీణించుచున్న, శశాంక - చంద్రునియొక్క ఛవిన్ - కాంతిచేతను, అప్పురములోన్ - ఆపట్టణములో, రాజిల్లును ప్రకాశించును క్షీణచంద్రుఁడు నిష్కళంకుఁడు గావున స్వచ్ఛుఁడుగానుండునని మున్ను చెప్పఁబడినది. ఆ పట్టణములోనివి తెల్ల యేనుఁగులని తాత్పర్యము.

సీ. జాబిల్లి చిన్నెంపు ♦ బాబా హుమారంపు
సరదారుని యుదార ♦ తర జవంబు
శతకోటి ధరు పీటి ♦ కతిధాటి జని సుధా
ఘుమ్ముఁదెచ్చిన మేటి ♦ ఘనజవంబు

వలి జక్కవల కించు ♦ విలుకాని యనిసంచు
దెలుపు వేల్పుతురంగ ♦ ముల జవంబు
బవరంబు భువివింటిఁ ♦ దవిలించి విడువ నా
టియరాతిఁ ద్రుంచు క ♦ ట్టియ జవంబు

గీ. నెంచకనె సంచరించుచు ♦ నింద్రహయము
పుట్టినట్టి తలంబెల్ల ♦ భూరిధూళిఁ
దార్చనోనా ఖురమ్ముల ♦ ధరణిఁ ద్రవ్వి
కొనుచు విలసిల్లు నప్పురి ♦ ఘోటకములు. ౨౦

టీ. జాబిల్లి - చంద్రునియొక్క, చిన్నంపు - చిహ్నమయిన లేడియనెడి, బాబా - గుఱ్ఱమును, హొంమారంపు, సవారగునట్టి, నరవాహుని - రౌతుయొక్క, వాయువుయొక్కయని యర్థము, ఉదారత - మిక్కిలి గొప్పదియగు, జవంబు - వేగమును, వలి - గుండ్రనయిన, జక్కవలకున్ - చక్రవాకపక్షులకు, ఇంచు విలుకాని - మన్మథునియొక్క, అని = యుద్ధముయొక్క, సంచు - అందమును, తెలుపు = తెలియఁజేయునట్టి, వేల్పు - దేవతలయొక్క, సూర్యుని యొక్క యని యర్థము, తురంగముల - గుఱ్ఱములయొక్క, జవంబున్ - వేగమును, బవరంపు భువిన్ - యుద్ధభూమియందు, వింటిన్ - ధనస్సును, తవిలించి - సంధానముచేసి, విడువన్ - వదలగా, అంటి - తగులుకొని, అరాతిన్ - శత్రువును, త్రుంచు - చంపునట్టి, కట్టియ - బాణముయొక్క, జవంబన్ - వేగమును, ఎంచకనె - లక్ష్యపెట్టకుండఁగనె, సంచరించుచున్ - తిరుగుచు, ఇంద్రహయము = ఉచ్చైశ్శ్రవము, పుట్టినట్టి - జన్మించినట్టి తలంబెల్లన్ - స్థలమంతయు, సముద్రమని యర్థము. భూరి - విస్తారమగు, ధూళిన్ - దుమ్ముచేత, తార్చనోనాన్ - సంధానముచేయుటకేమో యను నట్లుగా కప్పుటకేమో యని యర్థము. ఖురమ్ములన్ - గొరిజలచేత, ధరణిన్ -

భూమిని, త్రవ్వికొనుచున్ - పెద్దలఁగొట్టుచు, అప్పారిఘోటకములు - ఆ పట్టణములోని గుఱ్ఱములు, కిలకిల్లుచున్ - ప్రకాశించును.

చ. సరస పదక్రమమ్ములు బా ♦ సంగెడి సాంగ తురంగ పుంగవో
త్కరములు పద్మరాగములు ♦ దారకళం దగు పుష్యరాగ
ముల్ । పరగు నవక్ర చక్రములు ♦ వాటిలియున్న పురీ
రథాళికిం । ధరారథము తన్కులై నవతఁ ♦ గ్రుంకిన సాటి
యాసంగఁ జెల్లునే. 21

టీ. శివుఁడు త్రిపురసంహారము సేయునపుడు భూమి, రథము, వేదములు, గుఱ్ఱములు, సూర్యచంద్రులు, చక్రములు నైనవి. ఆ యర్థమునే ఈపద్యమందు వివరించుచున్నాఁడు. సరస పద క్రమమ్ములు- సరస-సారస్యముగల, పదక్రమమ్ములు - పాదవిన్యాసములు, అని యర్థము. సరస - రసముతోఁ గూడిన, పద - పదచ్ఛేదములును, క్రమమ్ములు - క్రమపాఠములును అని యర్థాంతరము. బాసంగెడి - ఒప్పునట్టి, సాంగ - సంపూర్ణావయవములుగల, తురంగపుంగవ - అశ్వశ్రేష్ఠములయొక్క, ఉత్కరములు - సమూహములు, అని యర్థము, సాంగ - శిక్షాది షడంగములతోఁగూడిన, తురంగ పుంగవోత్కరములు, ముందు భూరథమును జెప్పఁబోవుచున్నాఁడుగావున నిచట వేదములని యర్థము. పద్మరాగములు - పద్మరాగ మాణిక్యములును, ఉదార - విస్తారమయిన, కళన్ - శోభచేతను, తగు - ఒప్పుచున్న పుష్యరాగముల్ - పుష్యరాగ మాణిక్యములును, పరగు - ఒప్పునట్టి, అవక్ర - వంకరలేని, చక్రములు - రథాంగములని యర్థము, పద్మరాగము - పద్మములయందనురాగములు, దారకళన్ - భార్యా విలాసముచేతను, తగు - ఒప్పునట్టి, పుష్య - పుష్యమీనక్షత్రమందయిన, రాగముల్ - అనురాగములు, పరగు - ఒప్పునట్టి, ఈ రెండు విశేషణములును సూర్యచంద్రులను దెలుపుచున్నవి. అట్టి అవక్ర చక్రములని అర్థాంతరము. వాటిలి - అనుకూలించి - యున్నట్టి

పురీ - పట్టణమండలి, రథ - రథములయొక్క, ఆలికిన్ - పఙ్త్తికి, కురథము-భూమియనెడి రథము అని యర్థము. కుత్సితమగు రథమని యర్థాంతరము. తున్కలై, = ముక్కలై, నవతఁ = తొమ్మిదియగుటచేత, క్రుంగినన్ - అణంగిపోఁగా, అనఁగాభూమి నవఖండములైన సముద్రమున మునిఁగిపోవు చున్నదని తాత్పర్యము. సాటియనంగఁ = సమానమగుటకు, చెల్లునే = తగునా.

విశే. ఇచట "రథవద రోశ్చ" అనుసూత్రముచేత, కదాదేశము రావలసి యున్నను, శ్లేషస్థలముగావున వదలెనుగాని యుచితముగాదు.

ఉ. భల్లవి వేల్లనంబు కర♦పల్లవపాళిని మల్లివల్లరీ
వేల్లన తుల్యమై యనులఁ ♦ బెల్లుగ నెల్లెడ నుల్లసిల్లుచున్
క్షుల్లక భూమివల్లభుల♦కోటులకున్నతకోటి కోటియై
యుల్లసిలఁ సమీక పటు♦లొప్పుదు రప్పురి నుద్భటుల్ భటుల్.

టీ. భల్లవివేల్లనంబు - బల్లెముయొక్క త్రిప్పడము, కరపల్లవ = చిగురువంటి హస్తముయొక్క పాళిఁ = ప్రదేశమందు, మల్లివల్లరీ - మల్లెపూవుల గుత్తియొక్క, వేల్లన = త్రిప్పుటతోడ, తుల్యమై - సమానమై, బల్లెమును పువ్వువలె తేలికగా ద్రిప్పుచుండిరని తాత్పర్యము. అనులన్ = యుద్ధములయందు, పెల్లుగన్-విస్తారముగా, ఎల్లెడఁ = అన్నిచోటులు, ఉల్లసిల్లుచుఁ-ప్రకాశించుచు, క్షుల్లక = అల్పులయిన, భూమివల్లభుల = రాజులయొక్క, కోటులకుఁ = కోట్లకు, శతకోటి = వజ్రాయుధములయొక్క, కోటియై = కోటిసంఖ్యయై, ఉల్లసిలఁ=ప్రకాశించఁగా, వీరుత్రిప్పుబల్లెము రాజులకు కోటి వజ్రాయుధములవలెఁ గాన్పించుచున్నదని తాత్పర్యము. సమీక = యుద్ధములయందు, పటులు=సమర్థులగు, ఉద్భటుల్-గర్విష్ఠులగు, భటుల్ - జోదులు, అప్పురిన్ - ఆపట్టణమందు, ఒప్పుదురు-ప్రకాశింతురు.

సీ. పొదలపైఁబొదలు తు♦మ్మెదలసమ్మదల స
న్మృదుల గానముల సం ♦ పదల నలరి
గిరులపైవరలు పెం♦దరుల నిర్ఝరుల తుం
పురుల చల్వలపరం♦పరల నరసి
యతులపుష్పిత లస♦ల్లతల సంతతుల సం
గతుల నుబ్బు సుగంధ♦తతుల నెనసి
త్రోవల కైమవుల న♦న్నువల మేల్చవులకై
రవులకొల్పఁగ మన్మ♦థు వలపించి
గీ. చటుల పాటీర కోటర ♦ నటన ఘటన
కన దహి వధూటికా వీటి ♦ కా నికాయ
సౌరభా సారముల మీఱు ♦ మారుతములు
దనరు సతతంబు నారాజ ♦ ధానియందు. 23

టీ. పొదలపైన్ = పూఁదుప్పలపైని, పొదలు = వృద్ధిఁబొందునట్టి, తుమ్మెదల - తేంట్లయొక్క, సమ్మద - సంతోషముచేతను, లసత్ = ప్రకాశించుచున్న, మృదుల-మృదువులగు, గానముల-పాటలయొక్క, సంపదలన్ - విశేషములచేతను, అలరి-సంతోషించి, గిరులపైన్ = పర్వతములమీఁద వరలు-ప్రకాశించుచున్న, పెందరుల = పెద్దగుహలయందలి, నిర్ఝరుల = ప్రవాహములయొక్క, తుంపురుల-బిందువులయొక్క, చల్వల = శైత్యములయొక్క, పరంపరలన్ = పఙ్క్తులను, అరసి=చూచి, అతుల-సామ్యములేనట్టియు, పుష్పిత=పూచినట్టియు, లసత్=ప్రకాశించుచున్న, లతల = తీవలయొక్క, సంతతుల-సమూహములయొక్క, సంగతులన్ - కలయికలచేతను, నుబ్బు-అతిశయించుచున్న, సుగంధ=మంచివాసనలయొక్క, తతులన్ =

సమూహములను, ఎనసి=పొంది, తోవల = కలువల నెడు, క్రైవులన్-కత్తులను, అన్నువల=చిన్నచిన్న వియగు, మేల్ = మంచివి యగు, చవులకై-రుచులకై, రవులుకొల్పఁగన్=ప్రజ్వలింపఁజేయుటకు, మన్మథున్ = మరుని, వలపించి = ప్రీతిగలవానినిఁగాఁ జేసి, చటుల = చంచలములగు, పాటీర=మంచి గంధవుచెట్లయొక్క, కోటర=తొఱ్ఱలయందు, నటన - నాట్యము యొక్క, ఘటన=కలయికచేతను, కసత్ = ప్రకాశించుచున్న, అహివధూటికా-నాగకన్యలయొక్క, వీటికా=తాంబూలములయొక్క, నికాయ = సమూహము యొక్క, సౌరభ=పరిమళములయొక్క, ఆసారములన్-ధారావర్షములచేతను, విస్తారములచేతనని యర్థము. నాగకన్యకలు వాయువును, తినిపడలుటచే వాని నోళ్ళయందలి తాంబూలపు పరిమళము వాయువున కంటినదని తాత్పర్యము. మీరు=అతిశయించునట్టి, మారుతములు = వాయువులు, ఆరాజధానియందున్-ఆపట్టణమందు, సతతంబున్ = ఎల్లప్పుడును, తనరు = ఒప్పును.

లయగ్రాహి.

బంగరుల రంగలరు♦ముంగిటి యరుంగుల కు
రంగట నభంగుర ప♦తంగమణి మాలా
సంగతి నభంగమయి ♦ పొంగుచు వెలుంగు మదు
లం గళ నెసంగు నవ ♦ లుంగ లవలీ నా
రంగముల శృంగముల♦నం గులుకు రంగముల
కుం గొలని చెంగలువ♦లం గల సుగంధా
సంగమునకుం గిరిగొ♦నుం గొమరు భృంగములు
మంగళ మృదంగముల ♦ భంగిఁ బురినొప్పున్.

టీ. బంగరుల=బంగారములయొక్క, రంగు- కాంతి, అలరు=ఒప్పునట్టి, ముంగిటి = ప్రాంగణమందలి, అరుంగుల=అరుగులయొక్క, కురంగటన్-సమీ

యందు, అభంగుర = విరిగిపోనట్టి, పతంగ మణి = సూర్యకాంత మాణిక్యములయొక్క, మాలా = పఙ్త్కులయొక్క, సంగతిన్ = కలయికచేత, అభంగమయి = చెడిపోనిదై, పొంగుచున్ = అతిశయించుచు, వెలుంగు = ప్రకాశించునట్టి, మడులన్ = పాదులయందు, కళన్ = శోభచేత, ఎసంగు = ఒప్పునట్టి, నవ = క్రొత్తవియగు, లుంగ = పుల్లమావిపలపు చెట్లయొక్కయు, లవలీ = లతావిశేషములయొక్కయు, నారంగముల = నారింజచెట్లయొక్కయు, శృంగములనన్ = శిఖరములనఁగా, తులుకు = శోభించుచున్న, రంగములను = ప్రదేశములను, కొలని = సరస్సుయొక్క, చెంగలువలన్ = ఎఱ్ఱకలువలయందు, కల = ఉన్నట్టి, సుగంధ = మంచిపరిమళముయొక్క, ఆసంగమునను = సంబంధమునను, గిరికొను = చుట్టువారుకొనుచున్న, కొమరు = తేఁతవగు, భృంగములు = తుమ్మెదలు, మంగళ = శుభనిమిత్తములగు, మృదంగముల భంగిన్ = మద్దెళ్ళవలె, పురిన్ = పట్టణమందు, ఒప్పున్ = ప్రకాశించును.

క. ప్రతి నియతి గుప్తి మద నవ
రత సమరహి తాధికామ రమణీ వర ణో
ద్యత సిద్ధ కేతనములన్
క్షితి నప్పురియొప్పుఁగల శశి ఖరద్యుతులన్. 25

వా. ప్రతి......నములన్, ప్రతినియతి - ప్రత్యేక నియమముచేతను, గుప్తి - రహస్యమందు, మద - మదముచేతను, నవ - నూతనములగు, రత - సంభోగములయందు, సమరహిత - సామ్యములేని, అధికామ - పొందబడిన కామముగల, రమణి - స్త్రీలయొక్క, వరణ - వరించుటయందు, ఉద్యత - ప్రయత్నించుచున్న, సిద్ధ - దేవయోనివిశేషులయొక్క, కేతనములన్ - గృహములచేతను, కల శశిఖర ద్యుతులన్, కల - ఉన్నట్టి అనఁగా వ్యాపించునట్టి (ఇది తెలుఁగుశబ్దముగావున మిశ్రసమాసము) శశి - చంద్రుని చేతనున్ను, ఖరద్యుతులన్ - సూర్యునిచేతను, క్షితిన్ - భూమియందు అప్పురి - అయోధ్య ప్రస్థపురము, ఒప్పున్ - ప్రకాశించును.

సీ. ప్రతి...సములన్, ప్రతినియతి - ప్రత్యేకపు యేర్పాటుగల, గుప్తి-వతీ - కావలిగల, అనవరత - ఎల్లప్పుడు, సమర - యుద్ధమునకు, హిత - అనుకూలమైనట్టియు, అధిక - పొడవయినట్టియు, అమరమణీ - ఇంద్రనీల మాణిక్యములతోఁ గూడిన, వరణ - ప్రాకారమందు ఉద్యత - మీదుగా నెత్తబడినవై, సిద్ధ-సిద్ధములై యుండు, కేతనములన్ - జెండాలచేతను, కలశ శిఖరద్యుతులన్: కలశ = గోపురములయందుండెడు కుంభములతోఁగూడిన, శిఖర = శిఖరములయొక్క, ద్యుతులన్ = కాంతులచేత క్షితిసప్వారియొప్పును.

సీ. కొనగోరెదనునాటి ♦ కుసుమమియ్యవెబోటి
యావనంబునను ♦ గోరంటలేదు
కొమ్మపల్లవపాళి ♦ నమ్మవేలనెకాంచ
నమ్ములోసంగక ♦ నమ్మరాదు
సుదతియిచ్చునుగుత్తు ♦ లొదవ్రమీ నీవినీ
కిచ్చెదనెప్పుడైన ♦ నిపుడునిలువు
బాలనీవలన ర ♦ సాల సత్త్వముఁగంటి
మావిహారములందు ♦ మనసు గలదె

గీ. యనుచుఁదమతమతమి ♦ దెల్పి కొనుచువచ్చు
విటుల నిటు లలితోక్తి సం ♦ ఘటనపటిమ
నాదరింపుచుఁగులుకు ♦ టొయ్యారములను
పొలఁతులమ్మెదు రంగళ్ళఁ ♦ బువ్వులచట. 26

టీ. ఈ పద్యమునందు శ్లేషభంగిచే పువ్వులమ్ము స్త్రీలకును, విటగాండ్రకు నుక్తి ప్రత్యుక్తులు, పురుషుడు- బోటి= ఓచిన్నదానా, కొనగోరెదము= కొనుటకు కోరుకకలవాఁడనై యుంటిని, నాఁటికుసుమము = ఆరోజునఁ

దాచినపువ్వు, ఇయ్యవే = ఇమ్మనియర్థము, కొనగోరు = గోరుచివర, ఎదను = హృదయమందు, నాటి = గ్రుచ్చి, అని యర్థాంతరము, స్త్రీ- ఔన్ = బాగుగనున్నది, వనంబునన్ = పువ్వుల తోటయందు, గోరంట = గోరంట చెట్టు, లేదు = లేదు, అనియర్థము, యౌవనంబునన్ = జవ్వనముచేత, గోరు= నఖము, అంటులేదు = గ్రుచ్చుకోలేదు అనియర్థాంతరము, పు. కొమ్మ=ఓచిన్న దానా లేతకొమ్మ - శాఖయొక్క, పల్లవ = చిగుళ్ళయొక్క, పాళిన్ - వరుసను, అమ్మవేలనే - ఎందుకుచేత విక్రయించవే అనియర్థము. కొమ్మ - చిన్నదానా, పల్లవ - విటులయొక్క, పాళిన్ - పఙ్క్తిని, నమ్మవేలనె - ఎందులకు విశ్వసింపవేయని యర్థాంతరము, స్త్రీ- కాంచనమ్ములు - సంపంగి పువ్వులు, ఒసంగక - ఇయ్యక, అమ్మరాదు - విక్రయించగూడదు. అని యర్థము, కాంచనములు - బంగారములు, ఒసంగక - ఇయ్యక, నమ్మరాదు - విశ్వసింపగూడదు. పు- సుదతి - మంచిపలువరుసగల ఓచిన్నదానా, ఇచ్చను - కోరికచేత, గుత్తులు - పుష్పగుచ్ఛములు, ఒదవుమీ - యిమ్మా అని యర్థము. ఇచ్చనగుత్తులు - ఈ స్తనగుచ్ఛములు అని యర్థాంతరము, స్త్రీ- నీవి - నీసంబంధమైనవి, ఎప్పుడైనన్ - ఏకాలమందైనను, నీకిచ్చెదన్ - నీకొసంగెదను. ఇపుడు - ఈవేళ, నిలువు - ఆగు, అనియర్థము. నీవి - పోకముడి. నీకిచ్చెదన్ అని యర్థాంతరము. పు- బాల - ఓచిన్న దానా, నీవలనన్ - నీవల్ల, రసాల - తియ్యమామిడి పండ్లయొక్క, సత్త్వమున్ - స్వభావమును, కంటిన్ చూచితిని అనియర్థము. రసాలసత్త్వమున్ రస - శృంగారరసముచేతనైన, అలసత్వమున్ - మాంద్యమును; అని యర్థాంతరము స్త్రీ, మావి - మామిడిపండ్లయొక్క, హారములందున్ - భోజనములయందు, మనసుకలదె - ఇచ్ఛయున్నదా! అనియర్థము. మా విహారములందున్ - మా క్రీడలయందు అనియర్థాంతరము. అనుచున్ - ఇట్లుపలుకుచు, తనతమతమిన్ - తనయొక్క కామమును, తెల్పికొనుచున్ - ప్రకటన చేయుచు, వచ్చె - చేరనట్టి విటులన్ = విటగాండ్రను, ఇటు - ఈ ప్రకారము, లలితోక్తి...పటిమన్ లలిత - విలాసముగల, ఉక్తి - పలుకుల

యొక్క. ఘటక - కూర్చుటయందు, పటిమన్ - సామర్థ్యముచేత, ఆద రింపుచున్ - గారవించుచు, కుటుంబవ్యాపారములను, కుసుమ - శృంగా రముగల, ఓ వ్యాపారములను - విలాసములచేత, పొలతులు - స్త్రీలు, ఆవ టన్ - ఆపట్టణమున, అంగళ్ళన్ - దుకాణములయందు, పువ్వులు - పుష్ప ములు, అమ్ముదురు - విక్రయింతురు.

సీ. గుప్పుగుప్పున కప్పు ♦ లప్పళించెడు జడల్
నల్లమబ్బుల భాతి ♦ నుల్లసిల్ల
నబ్బురంబుగ నుబ్బు ♦ గబ్బిగుబ్బల గుబ్బ
పలుహారములుధార ♦ లలవి నలర
ముందుముందుగ చిందు ♦ లందుచందురుకావి
పావడల్ మణిచాప ♦ భంగినమర
ప్రత్నరత్నవిచిత్ర ♦ బహుమేఖలా ఝళా
త్కారంబు లురుముల ♦ గరిమనొప్ప
గీ. వెల్లుగలహంసకంబులు ♦ దల్లడిల్ల
చంచలలు గాక ధరణిపై ♦ సంచరించు
మించులన జంచలాక్షులు ♦ మేటిసౌధ
కోటినొప్పుచుందు ర ♦ వ్వీట నెపుడు. 27

టీ. గుప్పుగుప్పునన్ = తరుచుతరుచుగా, కప్పులు = నలుపులు, అప్ప ళించెడి = క్రమ్మునట్టి, జడల్ = జడలు, మబ్బులభాతిన్ = మేఘములవలె, ఉల్లసిల్లన్ = ప్రకాశింపగా, అబ్బురంబుగా = ఆశ్చర్యముగా, ఉబ్బు = పొంగునట్టి, గబ్బి = పెద్దవియగు, గుబ్బల = స్తనములయందు, గుబ్బ = కదలు చుండెడు, పలు = విస్తారములగు, హారములు = ముత్తెపుసరులు, ధారల లవిన్ = వర్ష ధారలవలె, అలరన్ = ఒప్పగా, ముందుముందుగన్ = యెట్టి

మెఱుఁగా, చిందులు = తూలడములను, అందు = పొందునట్టి, చందురు కావి = తెలతమెరుపుగల, పావడల్ = గాగరాలు, మణిచాపభంగిన్=ఇంద్ర ధనుస్సువలె, అమరన్ = ఒప్పగా, ప్రశస్త = ప్రశస్తములయిన, రత్న=మణుల చేత, విచిత్ర = చిత్రములగు, బహు =విస్తారములగు, మేఖలా = మొలనూళ్ళ యొక్క, ఝూలాత్కారంబులు = ఝుల్లుమను ధ్వనులు, ఊరుములగరిమన్ = గర్జితములయొక్క అతిశయముచేత, ఒప్పన్ = ప్రకాశించుచుండఁగా, పెల్లు గల - అతిశయముగల, హంసకంబులు = కాలికడియములనెడు, అంచలు = తల్లడిల్లన్ = తొట్రుపడఁగా, చంచలుఁగాక = కదలునదిగాకుండ, ధరణి పైన్ = భూమిపయిని, సంచరించు తిరుగునట్టి, మించులన్ = మెరుపులను పట్టుగా = చంచలాక్షులు = స్త్రీలు, అవ్వీటన్ = ఆ పట్టణమునందు, ఎపు డున్ = నిత్యమును, మేటి = శ్రేష్ఠమగు సౌధకోటిన్ = చాల మేడల యందు లేక మేడలచివరయందు, ఒప్పుచుందురు = ప్రకాశించుచుందురు.

క. మహీభృత్పతియేలుఁబురిన్
మహిమోన్నతి జనకుఁడాగ ♦ మ స్థగితాంచ
ద్బహులలహరిభక్తియోగా
వహిత మహాపోషి మహిమ ♦ వంతుఁడనంగన్. 28

టీ. పూర్వ-మహిమోన్నతి జనకుఁడు, మహిమ=సామర్థ్యముయొక్క, ఉన్నతి = ఔన్నత్యమునకు, జనకుఁడు = పుట్టించునట్టి, హిమవంతుఁడనం గన్ = హిమవంతుఁడనునట్టి, మహీభృత్పతి = పర్వతరాజు, అగమ...... పోషిమన్. అగమ=వృక్షసముదాయముచేత, స్థగిత = కప్పబడిన, అంచత్ = ప్రకాశించుచున్న, బహు = విస్తారములగు, లహరి = ప్రవాహములయొక్క, రక్తి=రచనలయొక్క, యోగ = సంబంధమునందు, అవహిత = జాగరూక మయిన, మహత్ = గొప్పదైన, పోషిన్ = వహించుటచేత, పురిన్ = పట్టణమును, ఏలున్ = పరిపాలించును.

సీత-మహిమోన్నతి, మహిమ = సామర్థ్యముయొక్క, ఉన్నతి = ఔన్నత్యముగల, జనకుడు = జనకుడనే పేరుగల, మహీభృత్పతి = రాజశ్రేష్ఠుడు, ఆగమ...వంతుడు, ఆగమ = శాస్త్రములచేత, స్థగిత = వ్యాప్తమయిన, అంచత్ = ఒప్పుచున్న, బహుల = విస్తారమగు, హరిభక్తి = విష్ణుసేవయందును, యోగ = అష్టాంగయోగములయందును, అవహిత = జాగరూకమయిన, మహత్ = గొప్పదియగు, ప్రౌఢి = నేర్పుయొక్క, మహిమవంతుడు = మహత్త్వముగలవాడు, అనగన్ = అనునట్టుగా, పురినేలున్.

ఉ. చల్లనివాఁడు పాదముల ♦ చాయలఁ జేరిననెల్ల వారికిన్
గొల్లలుగాఁగ నూర్మికలు ♦ గొబ్బున హంసక కంకణంబులున్
జల్లెడువాఁడు వాహినుల ♦ సంఘటనంబ్రతికూలవర్తన
క్షుల్లకభూమిభృత్కులము ♦ గ్రుంగఁగఁ జేయునతండు మేదినిన్. 29

పా॥ అతండు = ఆహిమవంతుఁడు. మేదినిన్ = భూమియందు. చల్లనివాఁడు = మంచుకొండ యగుటచే శైత్యముగలవాఁడు, పాదములచాయలన్, పాదముల = దగ్గఱనుండు చిన్న గుట్టలయొక్క, చాయలన్ = నీడలయందు, చేరినవారికిన్ = వచ్చినవారికి, కొల్లలుగాఁగన్ = సమృద్ధిగా, ఊర్మికలు = నీటియలలు, హంసకకంకణంబులున్ - హంసక = చిన్న హంసలును, కంకణంబులున్ = ఉదకబిందువులును, గొబ్బునన్ = త్వరగా, చల్లెడువాఁడు = చిమ్మువాఁడు, వాహినులసంఘటనన్. వాహినుల = నదులయొక్క సంఘటనన్ = కూర్పుచేత, ప్రతి...కులమున్, ప్రతికూల = నీటికెదురుగా, వర్తన = ఉనికిగల, క్షుల్లక = చిన్నవియగు, భూమిభృత్ = పర్వతములయొక్క కులమున్ = సమూహమును, క్రుంగఁగ జేయున్ = కూలిపోవునట్లుగాఁ జేయును.

సీత-అతండు = ఆ జనకుఁడు, చల్లనివాఁడు = సరసమైన యంతఃకరణముగలవాఁడు, పాదములచాయలన్ = కాళ్ళసమీపములయందు, చేరినన్ =

సమీపించఁగా, ఎల్లవారికిన్ = అందఱికి, కొల్లలుగాఁగన్ = సమృద్ధిగా, ఊర్మికలు = ఉంగరములు, హంసక కంకణంబులున్, హంసక = కాలి కడియములు, కంకణంబులున్ = చేతికడియములును, చల్లెడివాఁడు = విస్తారముగా నిచ్చువాఁడు, వాహినులసంఘటనన్, వాహినుల = సేనలయొక్క, సంఘటనన్, = కూర్పుచేత, ప్రతికులమున్, ప్రతికూల = ఎదిరించెడి, వర్తన = సంచారముగల, క్షుల్లకభూమిభృత్కులమునన్, = కొద్ది రాజులగుంపును, క్రుంగఁగఁజేయున్.

సీ. కుందమ్ముల సితార ♦ విందమ్ముల మృణాళ,
బృందమ్ములను పయ ♦ స్స్యందములను
రంగమ్ముల సుధాత ♦ రంగమ్ముల నభస్తు,
రంగమ్ముల సురసా ♦ రంగములను
హారమ్ముల శరద్వి ♦ హారమ్ములను గాంగ,
పూరమ్ముల ఘనక ♦ ర్పూరములను
సూనమ్ముల గళావి ♦ తానమ్ముల నుడుప్ర,
తానమ్ముల సురసం ♦ తానములను,

గీ. సొగసుమగరాల నిగరాల ♦ నిగ నిగలను
మిగుల నలరారు నెలరాల ♦ తగు వగలను
దెగడి పొగడొందు నెల్లెడ ♦ జగతి నతని
పరమహిమ హృద్య శోభాప్ర ♦ భావగతులు. 30

పా—ఆతని = ఆహిమవంతునియొక్క, పరమ...గతులు, పరమ = ఉత్కృష్టమైన, హిమ = మంచుచేత, హృద్య = మనోహరమగు, శోభ = సొగసుయొక్క, ప్రభావ = అతిశయముయొక్క, గతులు = రీతులు, కుందమ్ములన్ = మల్లిపువ్వులను, సితారవిందమ్ములన్ = తెల్లతామరలను, మృణాళ =

తామరతూండ్లయొక్క, బృందమ్ములన్ = సమూహములను, పయస్స్యంద్య ములను, పయః=పాలయొక్క, స్యందములను = ప్రవాహములను, రంగమ్ము లన్=తరగలను, సుధాతరంగమ్ములన్ = అమృతపు కెరటములను, నభస్తు రంగమ్ములన్ = ఉచ్చైశ్శ్రవములను, సురసారంగములను = ఐరావతములను, ఇచట ఉచ్చైశ్శ్రవమును నైరావతమును నొక్కటొకటియైనను బహువచన ములు చెప్పుట యొక్కొకదానినేగాక యిట్టివి యనేకములయినను వానిని నిరసించఁగలదని యతిశయోక్తి కయియని యెఱుంగవలయును. హారమ్ములన్= ముత్యములసరులను, శరద్విహారమ్ములను. శరత్ = శరదృతువుయొక్క, విహా రమ్ములను = విలాసములను, గాంగపూరమ్ములను, గాంగ = గంగాసంబంధు లగు, పూరమ్ములను=ప్రవాహములను, ఘనకర్పూరములను, గొప్ప కప్పురము లను, సూనమ్ములన్ = మల్లె మొదలగు పూవులను, కళావితానమ్ములన్ = చంద్రకళల సమూహములను, ఉడుప్రతానమ్ములన్ = నక్షత్ర సమూహము లను, సురసంతానములను, సుర = దేవతలయొక్క, సంతానములను = కల్ప వృక్షములను, సొగసు...నిగలను, సొగసు = చక్కనైన, మఁరాల నిగరాల= శ్రేష్ఠవజ్రములయొక్క, నిగనిగలను = కాంతులను, మిగుల...వఁగలను, మిగులన్ = విస్తారముగా, అలరారు=ప్రకాశించుచున్న, నెలరాల=చంద్ర కాంత మాణిక్యములయొక్క తగు=అనుకూలమగు, నగలను = విలాసములను, తెగడి = తిరస్కరించి, జగతిన్ = భూమియందు, ఎల్లెడన్ = అంతటను పొగడొందున్=స్తోత్రము చేయఁబడును.

సీత—అతని = ఆ జనకునియొక్క పర...గతులు. పర = శత్రువుల, యొక్క,మహిమ = సామర్థ్యమును, హృత్ =హరించుచున్న, యశః = కీర్తుల యొక్క, భా = కాంతులయొక్క, ప్రభావ=సామర్థ్యముయొక్క, గతులు= రీతులు, శేషము సమానము.

క. ధరణీభృత్పతి కటకం
బరుదై తగుసంగరాజి ♦ తాశ్వాసపదా

తి రుచిరమై గజసంతతి
సరసతరుల న్ప్రమేయ ♦ సౌఖ్యావహమై. 31

పా-ధరణీభృత్పతికటకంబు. ధరణీభృత్పతి=పర్వతరాజైనహిమవంతుని యొక్క, కటకంబు = నితంబప్రదేశము, సంగ .. రుచిరమై. సంగ = సంభోగముచేతను, రాజిత = ప్రకాశించుచున్న వారియొక్క, అశ్వాస=అలయిక తీర్చుటకయిన, పద = స్థానములచేత, అతిరుచిరమై = మిక్కిలి మనోహరమైనదయి, గజసంతతిన్, గజ = ఏనుగులయొక్క, సంతతిన్ = సమూహము చేత, సరసతరులకున్, సరస = బలముతోఁ గూడి, తరులకున్=చెట్లకు, అప్రమేయ సౌఖ్యావహమై, అప్రమేయ = ఎన్న శక్యముకాని, సౌఖ్య-సుఖమునకు ఆవహమై = కలుగఁజేయునదియై, ఏనుగులు చెట్లను విరచివేయుట లేదనుట అరుదైతగుణ = ఆశ్చర్యమయి యొప్పును.

సీత-ధరణీభృత్పతి కటకంబుఁ = ధరణీభృత్పతి = రాజశ్రేష్ఠుఁడయిన జనకునియొక్క, కటకంబు=పట్టణము, సంగ... రుచిరమై, సంగర = యుద్ధమందు, అజిత = జయింపఁబడని, అశ్వ = గుఱ్ఱములచేతను, ఆస=రథముల చేతను, పదాతి=కాల్బలములచేత, రుచిరమై = మనోహరమైనదై, గజసంతతి= ఏనుఁగుల యొక్క సమూహముచేత, సరసతరులకున్ = మిక్కిలి రసవంతులకు, ఐశ్వర్యము కలవారికి యని యర్థము, శేషము సమానము.

విశేష — అస ఉపవేశనే అను ధాతువుపయి నధికరణార్థమునందు ఘఞ్ చేసి దీనియందు కూర్చుందురు అని యర్థము చేయఁగా రథమని యర్థము చెప్పవచ్చును.

చ. ధవళతనూర్ధ్వపుండ్రములు ♦ దారమహోదరచక్రముద్రసా
ర్జవ భుజగాహితప్రథిమ ♦ సత్తులసీ వనమాలికల్ సదా
ప్రవిలసితంబుగాఁబ్రభుల ♦ పన్నగరామలకీరముల్ స్వవై
భవములనింపుఁదెల్పనతి ♦ భాగ్యములందగునాతఁడెప్పుడున్

పా. ధవళితన్ = తెలుపుచేత, ఊర్ధ్వపుండ్రములు = పైనుండు తెల్ల తామరలు, తారన్=కదిసియుండఁగా, మహోదరచక్రము, మహాత్ =గొప్పది యగు, దర=గుహలయొక్క, చక్రము = సమూహము, ఉదగ్రసా...ప్రథిమ, ఉదగ్రసా = ఉన్నతభూములయొక్క ఆర్జన = తిన్నదనముగల, భుజగ = పాములచేత, ఆహిత=తీసుకొనిరాఁబడిన, ప్రథిమ=అతిశయము, అనఁగా ఆ కొండయందున్నత భూములయందుఁ బాములుసాగి పొడపుగానున్నవని తాత్పర్యము. సత్తులసీవనమాలికల్, సత్ = మంచివగు, తులసీ=తులసిచెట్లయొక్క, వన=తోటలయొక్క, మాలికల్ = పఙ్క్తులు, సదా = ఎల్లపుడు, ప్రవిలసితంబుగాన్ =ప్రకాశించుచుండఁగా, పృథు...రామలకు, పృథుల=విస్తారములైన, పన్నగ = పాములయొక్క, రామలకు = స్త్రీలకు, నాగకన్యకలకనుట, ఈరముల్ = పొద, స్వవైభవములన్ = తమ యాచ్ఛాదనములచేత, ఇంపుఁదెల్పన్ = సంతోషము కలిగించఁగా, అతఁడు-ఆహిమవంతుఁడు, అతి భాగ్యములన్ = గొప్ప యదృష్టములచేత, తగున్ = ఒప్పెను,

సీత-ధవళి...పుండ్రములు, ధవళి = తెల్లనైనట్టి, ఇది యూర్ధ్వపుండ్రములకు విశేషణము. తను = శరీరమందలి, ఊర్ధ్వపుండ్రములు = నిలువుబొట్లును, ఉదా...ముద్ర, ఉదార=విస్తారముగా, మహాత్ = ప్రశస్తమగు, దర = శంఖముయొక్కయు, చక్ర = సుదర్శనచక్రముయొక్కయు, ముద్ర=ముద్రిక, సార్జవ...ప్రథిమ, సార్జవ=తిన్నఁదనముతోఁగూడిన, భుజ=బాహువుల యందు, గాహిత-ప్రవేశింపఁ జేయబడిన, ప్రథిమ = అతిశయము, సత్తు...లికల్ సత్తులసి=మంచితులసి దళములతోఁగూడిన వనమాలికల్ = ఆకులుం, బుష్పలం జేర్చిన దండలు, సదా ప్రవిలసితంబుగాన్ = యెల్లపుడుఁ బ్రకాశించునట్లుగా, పృథు...కీరముల్, పృథు = విస్తారముగా, లపత్ = పలుకుచున్న, నగర = పట్టణమందలి, కీరముల్ = చిలుకల్, స్వవైభములన్ = తమగొప్పతనములచేత, ఇంపు దెల్పన్ = శోభనియ్యఁగా, ఆతఁడు = ఆజనకుఁడు, ఎప్పుడున్ = ఎల్లపుడు, నతిభాగ్యములన్, నతి=నమస్కారములను, భాక్=పొందునట్టి యములన్ = మునులనుగూర్చి, తగున్ = అనుకూలించును.

క. ఆతడు సు మేరుజహేమ
ద్యుతిమేనను గొప్పునన్ ఘ ♦ నోన్నతిఁగమలో
న్నతి మొగమునఁదగు మగువను
గృతిపై వరియించె సత్య ♦ ధృతి నామహితన్. 33

పా.—అతఁడు = ఆహిమవంతుఁడు, సుమేరుజన్ = మేరు పర్వతపుత్రిక యైనట్టియు, హేమద్యుతిన్=బంగారమువంటి కాంతిగలిగినట్టియు, కొప్పునన్-శిరమునందు. ఘనోన్నతి, ఘన = మేఘములయొక్క, ఉన్నతి = ఔన్నత్యమును, మొగమునన్ = ముఖమునందు, కమలోన్నతి = పద్మముయొక్క యౌన్నత్యమును, తగు = ఒప్పునట్టి, సత్యధృతి = నిజమయిన ధైర్యముగలది, నాన్ = అనగా, మహితన్ = పూజ్యురాలయిన, మేనన్, = మేనయను పేరుగల, మగువను = స్త్రీని, కృతిపై = నేర్పరియై, వరియించెన్ = వివాహమాయెను.

సీత.—అతఁడు=అజనకుఁడు, మేనను = శరీరమందు, సుమేరుజహేమద్యుతి, సుమేరుజ = మేరుపర్వతమందుఁబుట్టిన, హేమ=బంగారముయొక్క ద్యుతి-కాంతి, సత్యధృతినామ హితన్ = సత్యధృతియను పేరుచేత,హితన్= ఇష్టురాలగు, శేషము సమానము.

సీ. మగరాల నిగరాల ♦ జిగిలీలఁ దగుమేలు
ధనదసౌధములొక్క ♦ దారి వెలుఁగ
పగడంబులుగడుం బొ ♦ సఁగు డంబరముగంగ
యువతిశాలలయొక ♦ యోరమీర
వెలముత్తెముల మొత్త ♦ ములపొత్తు దళుకొత్తు
గాంధర్వశాలలొ ♦ క్కటఁ జెలంగ

నును కెంపుగల కెంపు ♦ లను మీరు విద్యాధ
రాగారవారమె ♦ క్కవని నిలువ

గీ॥ నిప్పగిది సర్వసంపద ♦ లింపునింప
నతని నగరుచిర స్ఫూర్తి ♦ నభినుతింప
నలవిగాదీధరణి మోయు ♦ చిలువకైన
నలువకైనను బలుకుల ♦ చెలువకైన. 34

పా-మగరాల నిగరాల = శ్రేష్ఠవజ్రములయొక్క, జిగి=కాంతియొక్క లీలన్ = విలాసముచేత, తగు=ఒప్పునట్టి, ధనదసౌధములు = కుబేరుని మేడలు ఒక్కదారిన్ = ఒకవైపు, వెలుఁగన్ = ప్రకాశింపఁగా, పగడంబులు = పగడములు. కడున్, = మిక్కిలి, పొసఁగు=ఒప్పునట్టి, డంబరము=విజృంభణము ఉరంగని = తగునట్లుగా, యువతిశాలల - స్త్రీవిహారగృహములు, ఒకయోర మీరన్ = ఒకవైపున నతిశయింపఁగా, వెలిముత్తెముల = తెల్లముత్యముయొక్క మొత్తముల = సమూహములయొక్క, పొత్తు = స్నేహము, తళుకొత్తు = కాంతివహించుచున్న, గాంధర్వశాలలు, గాంధర్వ, = గంధర్వుల సంబంధులగు శాలలు = సాలలు, ఒక్కటను = ఒకవైపున, చెలంగన్ = ప్రకాశింపగా, నను = నున్నైన, కెంపుగల - ఎరుపుగల,. కెంపులను - పద్మరాగములచేతను, మీరు - ఒప్పుచున్న, విద్యా...వారము - విద్యాధర దేవయోనివిశేషములయొక్క, ఆగార -గృహములయొక్క, వారము -సమూహము, ఒక్కవనిన్ - ఒకభూమియందు, నిలువన్, ఉండగా, ఇప్పగిదిన్ - ఈరీతిగా సర్వసంపదలు - అన్ని యైశ్వర్యములను, ఇంపున్ - ఆనందమును, నింపన్ - నిండించగా, అతని - ఆహిమవంతునియొక్క, నగరుచిరస్ఫూర్తి - నగ - పర్వతముయొక్క, లేక వృక్షములయొక్క రుచిర - మనోహరమగు స్ఫూర్తిన్ - అతిశయమును, అభినుతింపన్ - స్తోత్రముఁ జేయుటకు, ఈ ధరణిమోయు

చిలువకైనన్ - శేషునకైనన్, నలువకైనన్ - బ్రహ్మకైనన్, పలుకుల చెలువకైనన్ - సరస్వతికైనను, అలవిగాదు - శక్యముగాదు.

సీత- ధనదసౌధములు-ధనమిచ్చువారి, మేడలు, పగడములు డంబున్ - కాంతిని, అరము - మిక్కిలి, పొసగన్ - పొందును, రంగయువతిశాలలు - నాట్యముం జేయు స్త్రీలయొక్క ఇండ్లు. గాంధర్వశాలలు, సంగీతశాలలు, విద్యాధరాగారములు - విద్యావంతులయిండ్లు, అతని - ఆ జనకుని యొక్క నగరు - పట్టణము, చిరస్ఫూర్తిన్ - చిరకాలాతిశయముచేత, శేమము సమానము.

క. ఘనమైనాకపదంబునఁ
దనరెడు మేల్కొమరుఁ గన్న ♦ తనసతి యతిపా
వన మౌనిభృతోటజసే
వనమున దనకింపు నింప ♦ బాటిలు నతఁడున్. 35

ప్ర. అతఁడున్ - ఆహిమవంతుడును, ఘనమైనాకపదంబునన్ - ఘనమైన మైనాకుడను పేరుచేత, తనరెడు - ఒప్పుచున్న, మేల్కొమరున్ - మంచికుమారుని, కన్న - కాంచినట్టి, తనసతి - తనభార్యయగు మేనక అతిపావనమౌ = మిక్కిలి పవిత్రమగు, నిభృత=నిశ్చలమగు, ఉటజ-పర్ణశాలయొక్క, సేవనమునన్ - సేవించుటచేత, ఈ మెయోగిని యాటచేతఁ బర్ణశాలల యందుండునని. అట్లు కుమారసంభవము ప్రథమసర్గలో 'మేనాం మునీనా మపిమాననీయం' అని కాళిదాసు చెప్పియున్నాడు. వ్యాఖ్యాతయు దీనిని వివరించెను. తనకు-తనకు, ఇంపునన్-సంతోషము గలిగించఁగా, పాటిలున్-ఉండును.

సీల—అతఁడున్-ఆజనకుఁడును, ఘనమై-గొప్పదియై, నాకపదంబునన్-స్వర్గమునందు, తనరెడు ఒప్పునట్టి, మేల్-మంచిదియగు, కొమరున్-మనోహరత్వమును, కన్న-పొందిన, తనసతి-తనభార్యయగు సత్యధృతి, అతి

పావన-మిక్కిలి పవిత్రులగు, మౌని-మునీశ్వరులచేతను, భృత-నిండిన, ఉటజ-గృహము యొక్క, సేవనమునన్-సేవచేత. తనరున్-తనరు, ఇంపునింప వాటికలున్-అనఁగా జనకుఁడు వేదాంతి గావున యాజ్ఞవల్క్యాది మునులు నీరయిల్లు నిండియుండఁగా జనకునిభార్య వారలకుపచారము సేయుచుండుననుట.

చ. అశిథిలగంధసారసవ ♦ నానలపారవషట్ప్రవోన్నతుల్ ।
కుశలవనప్రచారములు ♦ కోమలసామజశబ్దవారముల్ ।
భృశముదలిర్పదర్పితహ ♦ రి ప్రముఖాఖిలసత్త్వుఁడై మహా।
విశదిమచుండునాతఁడు ప ♦ వి త్రసదాత్మజ పాకసూతుఁడై.

పా—ఆతఁడు-అహిమవంతుఁడు. అశిథిల...న్నతుల్-అశిథిల-విడిపోని, గంధ—పరిమళముగల, సారస—పద్మములయొక్క, వన-పొదలయందు అనలస - మందములు కాని, అరవ-ధ్వనులుగల, షట్పద-తుమ్మెదలయొక్క, ఉన్నతుల్-ఔన్నత్యములును, కుశలవనప్రచారములు- కుశల-క్షేమముగల, వన - వనములయందైన, ప్రచారములు - మార్గములును, కోమల...వారముల్- కోమల - నూతనములగు, సామజ-ఏనుఁగులయొక్క, శబ్ద-ధ్వనులయొక్క, వారముల్-సమూహములును, భృశము = అత్యంతమును, తలిర్పన్-ఒప్పఁగా, దర్పిత...సత్త్వుఁడై- దర్పిత - మదించిన, హరిప్రముఖ - సింహములు మొదలుగాఁగల, అఖిల - సమస్తములయిన, సత్త్వుఁడై - జంతువులుగలవాఁడై, పవి...సూతుఁడై- పవి-వజ్రాయుధమువలన, త్రసత్- జడియుచున్న, ఆత్మజ - కుమారుని యొక్క, పాకసూతుఁడై - సూత్రములవంటి రెక్కలగుంపుగలవాఁడై, విశదిమన్-తెల్పుచేతను, ఉండున్-ఉండును.

సీత — ఆతఁడు-ఆజనకుఁడు, అశిథి...న్నతుల్- అశిథిల-విడిపోని, గంధసార=మంచిగంధముగల, సవన - యజ్ఞములయందైన, అనల-అగ్నిహోత్రములయొక్క, పార-స్థిరములగు, వషట్పద-వషట్కారముల యొక్క, ఉన్నతుల్-ఔన్నత్యములను, కుశలవనప్రచారములు- కుశ-దర్భలయొక్క, లవన-

కోట్యాదము యొక్క, ప్రచారములు - ప్రసక్తులును, కోమల...వారముల్ - కోమల - ఇంపయిన, సామ - సామములయందు, జ - పుట్టిన, శబ్ద - శబ్దముల యొక్క, వారముల్ - సమూహములును, భృశము - మిక్కిలి, తలిర్పన్ - ఒప్పుగా, తర్పిత...సత్త్వుఁడై - తర్పిత - తృప్తిపొందించఁబడిన, హరిప్రముఖ - ఇంద్రుఁడు మొదలుగాఁగల, అఖిల - సమస్తదేవతల యొక్క, సత్త్వుఁడై - స్వభావముగలవాఁడై, పవిత్ర...సూత్రుఁడై - పవిత్ర - పవిత్రమయిన, సత్ - సౌభాగ్యమయిన, అక్ష - శనిగపుందలి, జప - జపము యొక్క, అక్షమాలుఁడై - జపమాలికలు గలవాఁడయి, విశదిమన్ - నిర్మలవృత్తిచేతను, ఉండున్ - ఉండును.

సీ. సర్వసర్వంసహా సర్వస్వ నిర్వహణ ధూర్వహుండగు
నయ్యుర్వీధర తిలకుండొక్కనాఁడు గండమండలీసౌగంధ్య
నిష్పంద పుష్పంధయ స్తనంధయ జాలంబులు నీలంబులగు
కపోల మూలచమరవాలంబుల నీలత్వంబు వాలంబింప,
నొండొరుల మండలీకృత శుండాదండంబుల బట్టికొనుచు
నెట్టకేలకు నుట్టిపడుచు నుద్దండంబగు వేదండ షండంబు
నొక దండఁదాండవింప నఖండపుండరీకమండల పరిహిండ
నంబులు తండోపతండంబులుగా మొండార నిండారుచు
నిలుచు రాజహంస సమాజంబు లవ్యాజతేజంబున నొక
జగతిఁ దేజరిల్లఁ, బదపదమున ముదముదయముగొన రుచిర
మందు రాప రాగాభోగంబు మీఱ, సుఖలీన భావంబుగాన
నిభృతంబగు గంధర్వబృందంబు జొక్కు పెక్కు టెక్కుల
నొక్కచక్కిఁ బిక్కటిల్ల, నాగమాంతసంతత సుమనోవికాస

సమూపాదితవాసనోల్లాసంబున భాసిల్లుచు హారితత్త్వైకతా
నపక్షపాతంబున నిరంతరాభ్యస్యమాన విష్ణుపదమార్గంబగు
ద్విజవర్గంబు రసాలసాలపనసహింతప్రచారంబునం బిపాళించు
దక్షితఫలంబు లొసఁగుచు, నొక్కతట్టునొట్టుకొనఁగ నగరు
వెడలి చను సమయంబున. 37.

పా — సర్వ...ధూర్వహుండు- సర్వ-సమస్తమైన. సర్వంసహా-భూమియొక్క, సర్వస్వ-సమస్త ధనముయొక్కయు, నిర్వహణ-నిర్వహించుటయందు, ధూర్వహుండు-భారమును వహించినవాఁడు, అగు=అయినట్టి, ఇచట భూభారమును వహించువాఁడను నర్థము చెప్పుటకయి శబ్దచిత్రమునందు లాలసుండగు కవి యింత శబ్దాడంబరమును జేసెను. ఆయుర్వీధరతిలకుండు-ఆపర్వతశ్రేష్ఠుఁడు, ఒక్కనాఁడు-ఒకదినమున, గండ...జాలంబులు-గండమండలీ - గండస్థలములయందైన, సౌగంధ్య - పరిమళమునందు, నిబంధ = కదలనట్టి, పుష్పంధయ = తుమ్మెదలయొక్క, స్తనంధయ = పిల్లలయొక్క, జాలంబులు = సమూహంబులు, నీలంబులగు = నల్లనైన, కపోలమూల = గండస్థలములయొక్క మొదళ్ళయందైన, చమరవాలంబులన్ = వింజామరలయందు, నీలత్వంబున్ = నీలమణులౌటను, ఆలంబింపన్ = పొందఁగా, ఒండొరులన్ = అన్యోన్యమును, మండలు...దండంబులన్, మండలీకృత = గుండ్రములుగాఁ జేయఁబడిన, శుండాదండంబులన్ = కఱ్ఱలవంటి తొండములచేత, పట్టుకొనుచున్ = స్వీకరించుచు, ఎట్టకేలకున్ = అతిప్రయాసమున, ఉట్టిపడుచున్ - అతిశయించుచు, ఉద్దండంబగు - మదించిన వేదండ - ఏనుఁగులయొక్క, మండంబులు - సమూహములు, ఒకదండన్ - ఒకవైపున, తాండవింపన్ — నటించఁగా, అఖండ ... హిండనంబులు, అఖండ - యెడతెగని, పుండరీక - పులులయొక్క, మండల - సమూహముల యొక్క, పరిహిండనంబులు - అంతట సంచారంబులు, తండోపతండంబులు

గన్ - విస్తారముగాను, మెండారన్ - అతిశయించఁగా, నిండారుచున్ - నిండుచు, నిలుచు - ఉన్నట్టి, రాజహంస ... సమాజంబులు రాజహంస - ఎఱ్ఱనికాళ్ళు ముక్కులుగల యంచలయొక్క, సమాజంబులు - సమూహంబులు, అవ్యాజతేజంబునన్ — నిష్కపటకాంతిచేత, ఒకజగతిన్ - ఒక భూమియందు, తేజరిల్లన్ - ప్రకాశించఁగా, పదపదమునన్ - ప్రతిశబ్దమునందు, ముదము - సంతోషము, ఉదయముగాన్ - పుట్టఁగా, రుచిరమున్ - కాంతి సమృద్ధిచేత, దురాపరాగాభోగంబు, దురాప - పొందశక్యముగాని, రాగ - కర్ణాటాదిరాగములయొక్క, ఆభోగంబు - అతిశయము (పరిపూర్ణత్వము.) మీఱన్ - అతిశయించఁగా, సుఖలీనభావంబు, సుఖ - సుఖమందు, లీన - అడఁగిన, భావంబు - అభిప్రాయము గలదియు, గాననిభృతంబు, గాన - సంగీతమందు, నిభృతంబు - నిశ్చలమయినదియు, అగు - అయినట్టి, గంధర్వ బృందంబు, గంధర్వ - దేవయోని విశేషములయొక్క, బృందంబు - సమూహము, ఉరు పెక్కు - అతిశయించునట్టి, పెక్కు - విస్తారమయిన, పెక్కులన్ - ఉద్రేకములచేత, ఒక్కవక్కిన్ - ఒకవయిపున, పిక్కటిల్లన్ - నిండియుండఁగా, అగసూంత...ల్లాసంబున, అగసు-వృక్షసంబంధమయిన, అంత - చివరలయందు, సంతత - ఎల్లప్పుడును, సుమనః - పుష్పములయొక్క, వికాస - విడియుండుటచేత, సమాపాదిత - పొందఁబడిన. వాసనా - పరిమళమందు, ఉల్లాసంబునన్ - ఆనందముచేత, భాసిల్లుచున్ - ప్రకాశించుచు, హరి - పాతంబునన్, హరితత్త్వ - పచ్చఁదనమే, ఏకతాన- ముఖ్యముగల, పక్షి - పక్కులయొక్క, పాతంబునన్ - ప్రవాహముచేత, ఇచట హరితత్త్వ విశేషమువలన నీపక్షులు చిలుకలని తెలియఁదగినది. నిరంత...మార్గంబగు, నిరంతర - ఎడతెగనట్లుగా, అభ్యస్యమాన - చిమ్మఁబడుచున్న, విష్ణుపద - ఆకాశముయొక్క, మార్గంబగు - త్రోవగలదైన, ద్విజవర్గంబు - పక్షిసమూహము, రసా...చానంబునన్ రసాలసాల - తియ్యమామిడి చెట్లయందును, పనస - పనసచెట్లయందును, హిత — ఇష్టమగు,

ప్రచారంబునన్ - సంచారముచేత, పిసాళించు - ప్రకాశించు, దక్షతన్ - సామర్థ్యముచేత, ఫలంబులు - పండ్లు, ఒసంగుచున్ - రాల్చియిచ్చుచు, ఒక్కతట్టు - ఒక్కస్థలము, నెట్టుకొనంగన్ - ఆక్రమించంగా, నగరువెడలి- పట్టణము బయలుదేరి, చను, సమయంబునన్ - వెళ్లునప్పుడు.

సీత— తాండవింపన్, అనుపలుకు వర్ణము సమానము, ఉర్వీధరతిలకుండు అనుచో తుమాత్రము రాజశ్రేష్ఠుండైన జనకుండని యర్థము. అఖండ... రపిండనంబులు, అఖండ - చిరిగిపోనట్టి, పుండరీకమండల - గుండ్రనైన గొడుగులయొక్క, పర్పిండనంబులు - అంతట సంచారంబులు, తండోపతండంబులుగా మెండారనిండారుచు నిలుచు...రాజహంస సమూహంబులు, రాజహంస — రాజశ్రేష్ఠులయొక్క, సమాజంబులు — సమూహంబులు, అవ్యాజతేజంబున నొకజగతి దేజరిల్లుచు - పదపదమునన్ - ప్రతియడుగునందు, ముదముదయమగొనన్ - సంతోషము పుట్టంగా, రుచి...మీరగన్, రుచిర - పరిశుద్ధములగు, మందురా - గుఱ్ఱముల సాలలయందయిన, పరాగ- ధూళియొక్క, ఆభోగంబు - పరిపూర్ణత, మీరన్ - అతిశయించంగా, సుఖలీనభావంబు, సు = యోగ్యమైన, ఖలీనభావంబు = కళ్ళెములు కలుగుటయు, కానని = పొందనట్టి, భృతంబగు = సంపాదించంబడిన, గంధర్వబృందంబు = గుఱ్ఱములగుంపు, ఉరు బెక్కు పెక్కు బెక్కుల నొక్కచక్కి బిక్కటిల్లన్. ఆగమాంత...ల్లాసంబునన్, ఆగమాంత-ఉపనిషత్తులచేతనైన, సంతత- ఎడతెగనిసు-రోగ్యవగు, మనోవికాస-మనో నైర్మల్యముచేత, సమాపాదిత- పొందంబడిన, వాసనా - సంస్కారము యొక్క, ఉల్లాసంబునన్ - ఆనందముచేత, భాసిల్లుచున్ - ప్రకాశించుచు, హరి...పక్షపాతంబునన్. హరి - విష్ణువు యొక్క, తత్త్వ - యాథార్థ్యమందు, పక్షపాతంబునన్ - ఆసక్తిచేత, నిరంత...మార్గంబు, నిరంతర - అవకాశము లేనట్టుగ, అభ్యస్యమాన - అభ్యసించంబడుచున్న, విష్ణు - విష్ణువు యొక్క, పద - పాదముల యొక్క లేశశబ్దముల యొక్క. మార్గంబు - త్రోవకలది, విష్ణుపాదసేవగాని విష్ణు

నామస్మరణము గాని చేయుచుండెనని తాత్పర్యము, అగు - అయినట్టి, ద్విజవర్గంబు - బ్రాహ్మణ సమూహము, రసా...ప్రచారంబునన్, రస - భక్తిరసముచేతను, అలస - మందములైన, ఆలసన - వాక్యములతోడ, సహిత - కూడుకొనిన, ప్రచారంబునన్ - సంచారముచేత, పిసాళించు దక్షుతన్ ఫలంబులు - ఆముష్మికఫలంబులు, ఒసగుచున్ - ఇచ్చుచు, ఒక్కతట్టు నెట్టుకొనంగ నగరు వెడలి చనుసమయంబునన్.

శా. చంద్రప్రస్తరసౌధయూథవిహర ♦ చ్ఛ్యామాకచశ్రేణికా
సాంద్రప్రస్ఫుటకేతకీదళసమం ♦ చత్సౌరభాపార ని
స్తంద్రానందమిళిందబృందలలనా ♦ సంగీత భంగీమిళ
న్మంద్రాదిస్వరబంధుగంధవహడింభంబుల్ మెయిన్ భాసిలన్

టీ. చంద్ర...డింభంబుల్, చంద్రప్రస్తర - చంద్రకాంత మణుల యొక్క, సౌధ - మేడల యొక్క, యూథ - సమూహమునందు, విహరత్ క్రీడించుచున్న, శ్యామా - యౌవనమధ్యస్థలయిన స్త్రీల, యొక్క, కచ - వెండ్రుకల యొక్క, శ్రేణికా - పఙ్తులయందు, సాంద్ర - దట్టమయినట్టియు ప్రస్ఫుట-వికసించునట్టియు, కేతకీదళ - మొగలిరేకుల యొక్క, సమంచత్ - ఒప్పుచున్న, సౌరభ - పరిమళము యొక్క, అపార - ధారావర్షముచేతను, నిస్తంద్ర - చురుకైన, ఆనంద - సంతోషము గల, మిళింద - తుమ్మెదల యొక్క, బృంద - సమూహము యొక్క, లలనా - స్త్రీల యొక్క, సంగీత - సంగీతము యొక్క, భంగీ - రచనతోడ, మిళత్ - కూడుకొనుచున్న, మంద్రాది - మంద్రము మొదలుగాగల, స్వర - స్వరములకు, బంధు -చుట్టములయిన, అనఁగా మంద్రాది స్వరములతో కూడిన ధ్వనులను తీసుకొని వచ్చుచున్నవనుట. గంధవహ డింభంబుల్ - పిల్లగాలులు, మెయిన్ - శరీరమునను, భాసిలన్ - ప్రకాశించఁగా.

క. అది శుభ విభవ కరంబని
మదినెంచుచు నివల నవల ♦ మహీభృత్కులముల్
పదపదమున గహనశుకీ
మృదుల వచో రచనములను ♦ మేల్నుతిసేయన్. 39.

పా— మహీభృత్కులముల్ - పర్వతసమూహములు, శ్లేషను కులభము.

సీత— మహీభృత్కులముల్ - రాజసమూహములు.

చ. అటఁజని కాంచె నంబర స ♦ దంబుధిశంబరజాలబింబితో
త్కటనవరత్నగోపుర ము ♦ ఖప్రతిలంభకభర్మకుంభికా
పటలవిలోకనాకలిత ♦ భర్మసరోజకులభ్రమ భ్రమ
త్కుటిలసవిభ్రమభ్రమర ♦ కూటమునిందిరదివ్యవాటమున్

టీ. వెనుకటి వచనమునందలి యుర్విధరతిలకుండను పదమీపద్యమునందలి కాంచెన్ అనుక్రియకు కర్తగావున నదిమొదలు నింతవఱకేకాన్వయము. అటన్ - అచటికి, చని - వెళ్ళి, అంబర...కూటము, అంబర - ఆకాశము లంటు, సత్ - ఉన్నట్టి, అంబుధి-నదియొక్క, శంబర- ఉదకముయొక్క, జాల- సమూహమునందు, బింబిత - ప్రతిబింబించిన, ఉత్కట - అతిశయములగు, నవ రత్న - నవరత్నములయొక్క, గోపుర - పెద్దమేడలయొక్క, ముఖ - ద్వారములను, ప్రతిలంభక - పొందిన, భర్మ - బంగారముయొక్క, కుంభికా-కలశల యొక్క, విలోకన - చూచుటచేతను, ఆకలిత - పొందఁబడిన, భర్మసరోజ- బంగారపు పద్మములయొక్క, కుల - సమూహమువట్టి భ్రమ - భ్రాంతి చేతను. భ్రమత్ - తిరుగుచున్న, కుటిల - వంకరలగు, సవిభ్రమ - విలాసములతో కూడిన, భ్రమర - తుమ్మెదలయొక్క, కూటమున్ - సమూహముగల, ఇందిరదివ్య వాటమున్, ఇందిర - లక్ష్మియొక్క, దివ్య - ప్రశస్త

నైన, వాటయున్ తోటను. కాంచెన్ - చూచెను, ఇచట తెలుఁగు సమాసము గావున విభక్తి వికారముచే ఇందిరాశబ్దమునకు హ్రస్వము గలిగినది.

వ. కనుంగొని యంతరంగంబునం దరంగితంబగు భక్తి రస ప్రసంగంబునఁ బ్రదక్షిణంబు లాచరించి సముచిత పరిచార వార పరివృతుండయి ముంద పురందర పురస్సరబృందారక బృందంబులకు నమంద మహానందంబు సుధాస్యంద సందానం బనం దనరించుట సంఘటిల్లు నగణ్యపుణ్యనైపుణ్యంబున సకలభువన శరణ్యంబగు జలధి రాజకన్యక యరుణ చరణపల్లవమ్ముల శరణావరణంబు గావించి తదపారకృపా రస లసదపాంగ సంగంబున నత్యున్నత చిరత్న రత్నరుచిర రుచి ధురంధరంబై విల విల్లు మంథర ధరాధరంబుకంబు విడంబించు ప్రత్న రత్న రాజి రాజితంబగు గోపుర రాజంబుగల మహాద్వారంబు సొచ్చి. 40.

టీక. సా. కనుంగొని, చూచి. అంతరంగంబునన్ — మనస్సునందు, తరంగితంబగు - కరటములు వేయుచున్న, భక్తిరస ప్రసంగంబునన్, భక్తిరస - భక్తిరసముయొక్క, ప్రసంగంబునన్ - ప్రసక్తిచేతను, ప్రదక్షిణంబులు - ద క్షిణముగా తిరుగుటలను. ఆచరించి - చేసి, సముచి...తుండై, సముచిత - తగిన, పరిచార - ఉపచారకులయొక్క, వార - సమూహముచేత, పరివృ తుండై - చుట్టుకొనఁబడినవాఁడై, ముందు - ఎదుటను, పురందర...దమ్ముల కున్, పురందర పురస్సర - దేవేంద్రుఁడు మొదలుగాఁగల, బృందారక — దేవతలయొక్క, బృందమ్ములకున్ —సమూహములకు, అమంద మహానందంబు తక్కువకాని గొప్పదియగు నానందము, సుధా...నంబనన్, సుధా - అమృ తముయొక్క, స్యంద - ప్రవాహముయొక్క, సందానంబనన్ - కూర్పు అను నట్లుగా, తనరించుటన్ -చేయుటచేత, సంఘటిల్లు - సిద్ధమయిన, అగణ్య...

ణ్యంబునన్, అగణ్య — లెక్కించ శక్యము కాని, పుణ్య — సుకృతము యొక్క, నైపుణ్యంబునన్ — నేర్పుచేతను, సకలభువనశరణ్య, సకలభువన - సమస్త లోకములకు, శరణ్యా — రక్షకురాలు, అగు — అయిన, జలధి రాజకన్యక — లక్ష్మీదేవియొక్క, అరుణ — ఎఱ్ఱనగు, చరణపల్లవంబులన్ — చిగుళ్ళవంటి పాదములను. శరణవరణంబున్ - రక్షణయొక్క కోరడమును. కావించి - చేసి, తదపా.. గంబునన్, తత్ — ఆలక్ష్మియొక్క, అపార - హద్దులేని, కృపా - దయయనెడు, రస - రసముచేతను, లసత్ - ప్రకాశించుచున్న, అపాంగ - క్రేగంటిచూపులయొక్క, సంగంబునన్ — కలయికచేత, అయస త్నో...ధర్మంబై. అయత్న-యత్నము లేకుండునట్లుగ, ఉపనత - సంప్రాప్త ము లయిన, చిరత్న — ప్రాచీనములగు. రత్న - మణులయొక్క, రుచిర - సుందరములగు, రుచి — కాంతియొక్క, ధురంధరంబై - భారమును వహించి నదియై, విలసిల్లు - ప్రకాశించుచున్న, మంథరధరాధరంబు — మందరపర్వతము యొక్క, డంబున్ - శోభను, విడంబించు - అనుకరించుచున్న, ప్రత్నరత్న రాజిరాజితంబగు, ప్రత్న — ప్రశస్తములైన రత్న — మణులయొక్క. రాజి పఙ్క్తిచేత, రాజితంబగు — ప్రకాశింపఁజేయఁబడిన, గోపురరాజంబు — పెద్ద గోపురము, కల — కలిగిన, మహాద్వారంబున్ — గొప్పదేవిడీని, చొచ్చి — ప్రవేశించి.

శా. మల్లీవల్లిమతల్లి వల్లరులలో ♦ మల్లోప మల్లోపమో |
ద్యల్లీలోల్లుఠనంబునం బెనఁగుచున్ ♦ హల్లోహలోల్లోలనై |
యల్లింబెల్లిగ నుల్లసిల్లెడియళుల్ - హల్లీసకోల్లాసకృ |
ద్ఝల్లీభిల్లకగీతికల్లెడనుతుల్ ♦ బెల్లీను నప్పట్టునన్. 41

టీ. మల్లీ...రులలో, మల్లీవల్లి మతల్లి = శ్రేష్ఠమయిన మల్లెతీగల యొక్క, వల్లరులన్ - పూగుత్తులలోపల, మల్లో.. ఠనంబునన్, మల్లోప మల్ల - భట ప్రతిభటులతోడ, ఉపమ - సామ్యముగల, ఉద్యత్ - అధి

వృద్ధినొందుచున్న లీల - విలాసముచేతనైన, ఉల్లురనంబునన్ - దొంగిలించుట చేత. పెనఁగుచున్ - పెనుగులాడుచు, హల్లోహలోల్లోలము. హల్లోహలమత్తతచేత, ఉల్లోలము - మిక్కిలి చంచలించుచున్నది, అయి - ఆయి, ఝల్లింబెల్లిగన్ - పెనకువగా, ఉల్లసిల్లెడి - ప్రకాశించుచున్న, ఆళుల్ - తుమ్మెదలు, హల్లీ... గీతికిన్, హల్లీసక - కోలాటముయొక్క, ఉల్లాస - ఆనందము, కృత్ - చేయుచున్న, ఝిల్లీ - ఆడుచెంచువాండ్రయొక్కయు, ఝిల్లక - మగచెంచువాండ్రయొక్కయు, గీతికిన్ - పాటకు, ఎల్లెడను - అన్నిచోటులను, నుతుల్ - స్తోత్రములు, పెల్లు - విస్తారముగా, ఈను - పుట్టించుచున్న, అప్పట్టునన్ - ఆస్థలమందు.

క. క్రొన్నెల వెన్నెల వన్నెల
గన్నలలి న్నిలువునీరు ♦ గ్రమ్మెడి నెలరా
మిన్నల తిన్నెల చెన్నల
రున్నెల మామిడుల నడుమ ♦ రూఢిం జనుచున్. 42

టీ. క్రొన్నెల వెన్నెల వన్నెలన్, క్రొన్నెల - అప్పుడుదయించిన చంద్రునియొక్క, వెన్నెల - కౌముదియొక్క, వన్నెలన్ - కాంతులను, కన్నన్ - చూడఁగా, లలిన్ - అనుకూలముగా, నిలువు — అంతటను, నీరు - ఉదకమును, క్రమ్మెడి - వ్యాపించెడి, నెలరామిన్నల - శ్రేష్ఠములయిన చంద్రకాంతమణులయొక్క, తిన్నెల - అరుఁగులయొక్క, చెన్ను - శోభ, అలరు - ఒప్పుచున్న, ఎలమామిడుల - లేఁత మామిడులయొక్క, నడుమన్ - మధ్యమందు, రూఢిన్ - స్థిరముగ, చనుచున్ - వెళ్ళుచు.
విశే — ఈపద్యమందు, అలరు ఎలమావి అనువో సంశ్లేషమునకుఁ గారణము వ్యంగ్యము.

శా. నాళీకాళి మధూళికా పరిమళా ♦ నందన్మిళిందాంగనా
పాళీకేళి వరాళికాముఖరిత ♦ ప్రత్నద్యురత్నోపమా
శాలిచ్ఛాయ చిరత్నరత్నచిత ♦ స్వచ్ఛంద పిచ్ఛందక
వ్యాలీఢంబగు భర్మమంటపిఁగనెన్ ♦ హర్షప్రకర్షంబునన్.

టీ. నాళీ.. వ్యాలీఢంబు, నాళీక - పద్మములయొక్క, అళీ-పఙ్క్తి యందైన, మధూళికా - పుష్పాడియొక్క, పరిమళ - వాసనచేత, ఆనందత్ - సంతోషించుచున్న, మిళిందాంగనా - ఆడతుమ్మెదలయొక్క, పాళీ - పఙ్క్తియొక్క, కేళి - క్రీడయందైన, వరాళికా. వర - శ్రేష్ఠమైన, అళికా = పఙ్క్తిచేత, ముఖరిత - చప్పుడు చేయఁబడిన, ప్రత్న - ప్రశస్తము లైన, ద్యురత్న - చింతామణుల యొక్క, ఉపమా — సామ్యముతోడ, శాలి ఒప్పుచున్న, ఛాయ - కాంతిగల, చిరత్న - ప్రాచీనములగు, రత్న - మణులచేత, రచిత - చేయఁబడిన స్వచ్ఛంద - స్వేచ్ఛగల, పిచ్ఛందక - రాజగృహ రచనలచేత, వ్యాలీఢంబగు - వ్యాప్తమైన, భర్మమంటపిన్ - బంగారు మంటపమును, హర్షప్రకర్షంబునన్ - సంతోషాతిశయముచేతను, కనెన్ - చూచెను.

వ. అంత. 44.

చ. ప్రవలుచు మించుమించుమగ ♦ రానిగరాలగరాళితంబగుఁన్
ధవళ సరోజ రాజమున ♦ దప్త సువర్ణ సవర్ణ కర్ణికం
దవిలిన కెంపుగుంపులను♦దాల్చిన పీఠమునందుఁబొందు గాఁ
గవెలయునిందిరంగనియె ♦గాంచిసమంచిత భక్తియుక్తిచేన్.

టీ. ప్రవలుచున్-వృద్ధిబొందుచు, మించు-అతిశయించినట్టిమించు-కాంతిగల, మగరా నిగరాలన్-శ్రేష్ఠవజ్రములచేతను, కరాళితంబు- వర్ణాంతరమును

పొందించబడినది. అగు-అయినట్టి, ధవళ సరోజరాజమునన్-తెల్లనిపద్మశ్రేష్ఠమం దు, తప్త... కర్ణికన్, తప్త-పుటము వేయఁబడిన, సువర్ణ-బంగారముతోడ సవ ర్ణ-సమానమయిన కాంతిగల, కర్ణికన్-ముద్దె (దిమ్మ) యందు, తవిలి - కూ ర్చియున్న, కెంపుగుంపులను = రత్నసమూహములను, తాల్చిన - ధరించిన, శీతమునందున్-పీటయందు, పొందుగాన్ - అనుకూలముగా, వెలయు - ఒప్పుచున్న, ఇందిరన్-లక్ష్మిని, కనియెన్ - చూచెను. కాంచి - చూచి, సమంచిత-ఒప్పుచున్న, భక్తి-భక్తియొక్క, యుక్తిచేన్ - కూడుకొనుటచేత, ముందుపద్యముతో నన్వయము.

చ. ప్రణిపతనైకపాకయుత ♦ పాకవిరోధి మహాపతాకినీ
మణిమయమౌళిపాళినవ ♦ మాల్యమరందఝరీచరీకృతా
ర్హణచరణుండు మాధవుఁడు ♦ దారను దారనుగా వరింపనౌ
గుణగణధన్యకన్యతన ♦ కున్ గరుణింపవె వేగ మ్రొక్కెదన్.

టీ. పా— ప్రణి...ణుండు- ప్రణిపతన-నమస్కారమునందు, ఏక-ముఖ్యమయిన, పాక-పరిపాకముతోడ, యుత-కూడుకొనిన, పాకవిరోధి-దేవేంద్రునియొక్క, మహాత్ - గొప్పదియగు, పతాకినీ - సేనయొక్క, (అనఁగా దేవతలయొక్క) మణిమయ-మాణిక్యవికారములగు, మౌళి-కిరీటములయొక్క, పాళి-పఙ్క్తియొక్క, నవ-నూతనములగు, మాల్య - పువ్వులదండలయందలి, మరంద-పూదేనెలయొక్క, ఝరీ-ప్రవాహములచేత, చరీకృత-మిక్కిలియుఁ జేయఁబడిన, అర్హణ-పూజగల, చరణుండు-పాదములు కలవాఁడగు, ఉమాధవుఁడు-శివుఁడు, ఉదారను-గొప్పదియగు, దారను గాన్-భార్యనుగా, వరింపనౌ-కోరఁదగిన, గుణగణధన్యన్-గుణసమూహము చేతను ధన్యురాలగు, కన్యన్-కొమార్తెను, తనకున్-నాకు, కరుణింపవే-అనుగ్రహించుమా, దేవీ-లక్ష్మిదేవీ, మ్రొక్కెదన్-నమస్కరించెదను.

పా— మాధవుఁడు-విష్ణువు, శేషము సమానము.

చ. పలుకుపడంతి వేలుపుల ♦ బల్లిదునింతి మొగంబుగాదగుఙ్
గలుకులకబ్బవబ్బురము ♦ గాఁదగు నీయుపచారముల్ వెసన్
దెలియుమ నీకుఁ దత్సతులు ♦ దీటనువాఁడల పారిజాతప
ఙ్క్తులతులనంబు నింబమున ♦ నున్ వివరించు సరోజవాసినీ 47

టీ. సరోజవాసినీ—పద్మమునందు నివసించెడునోలక్ష్మీ! పలుకుపడంతి-సరస్వతియు, వేలుపులబల్లిదునింతి - దేవతాశ్రేష్ఠుఁడగు నింద్రునిభార్యయగు శచీదేవి, మొగంబుగాదగు-మొదలుగాఁగల, కలుకులకున్-స్త్రీలకు, తగు-అనుకూలమగు, నీయుపచారముల్-నీసేవలు, వెసన్-శీఘ్రముగా, అబ్బురముగాన్-ఆశ్చర్యముగా, అబ్బవు-దొరకవు, తెలియుమన్-ఎఱిఁగియున్న వాఁడగుచు, నీకున్-నీకు, తత్సతులు-ఆ స్త్రీలు, దీటనువాఁడు-సమానమని చెప్పువాఁడు, నింబమునకున్-వేపపువ్వునకు, అల...తులనంబున్- అల-ప్రసిద్ధమగు, పారిజాత-పారిజాతపుష్పములయొక్క, పఙ్క్తుల-వరుసలయొక్క తులనంబున్-సామ్యమును, వివరించున్-చెప్పును.

## మహాలక్ష్మీ దండకము.

జయతుజయతు, శేషశైలాధిపానందలీలా మహానంద వేలాతిగాంభోధిడోలాయమానోర్మిజాలా మిత్రోల్లాసదాలాపమాలా, సుధాలాలనీమోరుబాలామృతాంశూపమాలాస్య సంసక్తఫాలా, మహాలానమాద్యద్ఘటాలాభదాపాంగజాలాభిరామాగ్రవాళాయితాంఘ్రీ, ద్వసీలాలకా, క్షోణిశీలాసపత్నీ, ప్రవాళాధరా, సద్రసాలావళీకుంజశాలా చరద్గోపబాలావలంబా, మదంబా, శ్రీయైకల్పతాం అపిచ, సతతసురేంద్రపాళీస్ఫురద్రత్నమాళీభవద్బాలహేళీ ర్యమాణాంశుకేళీప్రఫుల్లాంఘ్రి

నాళీకవక్త్రై, జితాళీకసంబంధకాళీ కచీజాలినాళీక భాసన్ము త్తాలీవసృత్త్యై, మదాళీఘరత్నఃకరాళీ కృతక్షోణిశైలీ సరోజాత నాళీ సమంచన్మృణాళీ భవద్వైభనాళిందవక్త్యైసరీచీ సమో చాలినాచా మనాచామవాచా ప్రవాహాగోస్నాతాయై, నమ ద్రాసదాసానుదాసాధితా నల్ప సంకల్ప సంకల్ప కల్పద్రుమా కల్పాత్మనామ్నే శ్రియై తేనమః నను ఇదముఃచాత్కృపాగాజి తాసాంగ దారాళవిస్ఫూర్తిధారా ప్రశక్తప్తాత్ష్యుదారారవింకో త్పలారామ వాటీ విహారాష్ట్ర భృంగీ కిశోరాయితస్వాంత నారాయణాంకస్థలీ రాజ్యసింహాసనారాధితాయై, సుధారాశి మధ్యస్థలీ రాజమాన స్వరామామవాస్యప్సరో రాజిభిర్నిత్యసేవి రాజితాయై, తుషారాంశుతేజః పటీరాను గాహారహారాళిసహార హీరాహీ హారహారా సారాత్మ కీర్త్యై, సువర్ణాత్మమూర్త్యై, సువర్ణశ్రియై, నిస్సమాయైనమః జయజయ జగదంబ దాసో స్మ్యహం తేరమావాసకాంతే త్వమేవాఖిలస్య ప్రపంచస్యమా తేతి వాణ్యాపురాణ్యామహాత్యాపి సత్యాపితాసోహమేవం భవత్యాః కశోరోస్మిభృత్యోస్మి దాసోస్మితస్మాత్కృపాంగై రపాంగై ప్రపన్నంశిశుం మాంచశీఘ్రాద్ధకించాంబ హృద్యాన వద్యాత్మ విద్యాభిరుద్యోతయస్వే, త్వంసహస్రినివాసేన తత్త్వం పరంజ్యోతిరిత్యంబ మహ్యందయేధాభక్తిముత్పాద యేథా సుధారాశికన్యే రమే పద్మహస్తే ప్రసీద ప్రసీద ప్రసీదాంబమే.

టీ. శేషశైలా... దాలానమాలా. శేషశైలాధిప - వేంకటేశ్వరుని యొక్క, అమంద - విస్తారమగు, లీలా - విలాసములయందు, మహత్ - గొప్పదియగు, ఆనంద - ఆనందమనియెడు, వేలాలిగ - ఒడ్డును దాటిన, అంభోధి - సముద్రమందు, డోలాయమాన - ఉయ్యేలలై యాచరించుచున్న ఊర్మిజాల, ఊర్మి - తరంగముల యొక్క, జాల - సమూహము నందు, అమిత - విస్తారమగు, ఉల్లాసద - ఉల్లాసము నిచ్చునట్టి! ఆలాప - మాటల యొక్క, మాలా - పఙ్క్తులు గలిగి యున్నట్టియు, సుధా...ఘాలా. సుధా - అమృతము వలె, లాలనీయ - గారవించ దగిన, ఉరు = గొప్ప వాడగు, బాలామృత - శీతచంద్రుని యొక్క, అంశు - కిరణముల యొక్క, ఉపమ - సామ్యము యొక్క, లాస్య - నాట్యమందు, సంసక్త- తగులుకొనిన, ఘాలా — నొసళ్ళు కలిగినట్టియు, మదోద్య...చాల, పద - పదముచేత, ఉద్యత్ - ఉదయించుచున్న, మరాళాంగన - ఆడు హంసలు వంటి, చారు — సుందరమైన, హేల — విలాసము యొక్క, ప్రచాలా — ప్రచారము గలిగినట్టియు, (ఇచట రలలకభేదము) మహా...రమా, మహత్ — గొప్పదియగు, ఆలాప — కట్టుకట్టలయందు, మాద్యత్ — మదించుచున్న, ఘటా — ఏనుగు గుంపుల యొక్క, లాభద — లాభము నిచ్చు, అపాంగ — క్రీగంటి చూపుల యొక్క, జాల — సమూహముచేత, అభిరామా — మనోహరయగునట్టియు, ప్రవాళాయితాంఘ్రిః, ప్రవాళాయిత — చిగురువలె నాచరించు చున్న, అంఘ్రిః — పాదములు కలిగినట్టియు, వినీలాలకా, వినీల — నల్లనైన, అలకా — ముంగురులు కలిగినట్టియు, క్షోణీనీలాసపత్నీ — క్షోణి — భూమికిని, నీలా — నీలాదేవికిని, సపత్నీ - సవతియగు లక్ష్మి, జయతు జయతు — మిక్కిలి సర్వోత్కృష్టురాలైయుండుగాక. ప్రవాళాధరా — ప్రవాళ — చిగురువంటి, అధర— అధరోష్ఠము కలిగినట్టియు, సద్రసా... లంబా, సత్ —యోగ్యములగు, రసాల — తియ్యమామిళ్ళ యొక్క, ఆవలీ — పఙ్క్తులయొక్క, కుంజ — పొదలనియెడు, శాల— సాలలయందు, చరత్ —

తిరుగుచున్న, గోపబాల— గోపాలకృష్ణునకు, అవలంబా—ఆధారమైనట్టి, పదంబా, మత్—నాయొక్క, అంబా తల్లియగు లక్ష్మి, శ్రియై— ఐశ్వర్యము కొరకు, కల్పతాం — సమర్థురాలగుగాక, అపిచ — ఇంతియకాదు, నత...న్త్యై, నత - నమస్కరించుచున్న, సురేంద్ర-దేవతాశ్రేష్ఠుల యొక్క పాళీ — సమూహము యొక్క, స్ఫురత్ — ప్రకాశించుచున్న, రత్న - రత్నవికారము లగు, మౌళీభవత్ — కిరీటమై యాచరించుచున్న, బాల - లేఁతవగు, హేళీ — సూర్యుని యొక్క, ఈర్ష్యమాన — వ్యాపించుచున్న అంశు = కిరణముల యొక్క, కేళీ-క్రీడచేతను, ప్రఫుల్ల - వికసించిన, అంఘ్రి నాళీకన్త్యై - పద్మము వంటి పాదము కలిగినట్టియు, జితాళీ... వృత్త్యై, జిత-జయింపఁబడిన, అళీక - అసత్యము యొక్క, సంబంధ — సంపర్కముగల కాళీశ-చీజాః=వరపుత్రులచేతను నాళీకభూః = బ్రహ్మచేతను, సన్నుత= స్తోత్రము చేయఁబడిన, ఉళీ = ఉన్నతమగు, వృత్త్యై = వ్యాపారము కలిగినట్టియు, సమీచీన..........న్నతాయై, సమీచీన = మంచివియగు, మోచాపు = అరటిపండ్లయొక్క, రస = రుచియొక్క, ఆచామనా = ఆచమింపఁజేయుటచేత, చారు = సుందరమగు, వాచా= వాక్యములయొక్క ప్రచార=గమనికచేతను, ఉన్నతాయై=ఉన్నతురాలైనట్టియు, సమద్దాస... నామ్న్యై నమత్ = నమస్కరించుచున్న, దాస = భక్తులయొక్క, అనుదాస = అనుసరించిన భక్తులచేతను, అధిత = పొందఁబడిన, అనల్ప = విస్తారమగు, సంకల్ప = ఉద్దేశములకు, కల్పద్రుమ = కల్పవృక్ష రూపమయిన, ఆకల్పకల్ప = అలంకారముతో సమానమగు, ఆత్మ=తనయొక్క, నామ్న్యై= పేరుగల, శ్రియై = లక్ష్మియగు, తే = నీకు, నమః = నమస్కారము, అజహత్కృపా... రాధితాయై, అజహత్ = విడిచిపెట్టని, కృపా = దయచేతను, రాజిత = ప్రకాశింపఁజేయఁబడిన, అపాంగ = క్రేగంటి చూపులయొక్క, ధారాళి = పఙ్క్తిగల, సన్ఫూర్తిః = స్ఫురణయొక్క, ధారా=అవిచ్ఛిన్న ప్రవాహముచే, ప్రక్లప్త = రచింపఁబడిన, అత్యుదార = మిక్కిలి గొప్పది

యగు, అరవింద = పద్మములయొక్కయు, ఉత్పల = కలువల యొక్కయు, ఆరామ = తోటయొక్క, వాటీ = ప్రదేశమునందు, విహార = విహరించుట తోడ, ఆఢ్య = కూడిన, భృంగీకిశోరాయితె = తుమ్మెదపిల్లయై యాచరించు చున్న, స్వాంత = చిత్తముగల, నారాయణ = విష్ణువుయొక్క, అంకస్థలీ = తొడయందు, రాజ్యసింహాసన = రాజ్యపీఠమునందు, ఆరాధితాయై = ఆరాధింపఁబడిన లక్ష్మికొరకు, ఇదంనమః = ఈ నమస్కారము, సుధా...రాజితాయై, సుధారాశి = పాలసముద్రముయొక్క, మధ్యస్థలీ = మధ్యభాగము నందు, రాజమాన = ప్రకాశించుచున్న, స్వర్గ = స్వర్గమునందలి, ఆరామ = పువ్వులతోటయందు, వాసి = నివసించిన, అప్సరః = అప్సరస్త్రీలయొక్క, రాజిభిః = పఙ్క్తులచేతను, నిత్య = యెల్లప్పుడును, నీరాజితాయై = నివాళింపఁ బడినట్టియు, తుషారాంశు...కీర్త్యై, తుషారాంశు = చంద్రునియొక్క, తేజః= తేజస్సుయొక్కయు, పటీర = మంచిగంధము యొక్కయు, అమరాహార = అమృతముయొక్కయు, హారాళీ = ముత్యాల పేటలయొక్కయు, నీహార = మంచు యొక్కయు, హీర = వజ్రము యొక్కయు, అహిహార = శివుని యొక్కయు; అహిసార = సర్పశ్రేష్ఠుఁడగు, శేషుని యొక్కయు, ఆత్మ = స్వరూపమువంటి స్వరూపముగల, కీర్త్యై = కీర్తిఁగలిగినట్టియు, సువర్ణాత్మ మూర్త్యై, సువర్ణ = బంగారమే, ఆత్మ = తనయొక్క. మూర్త్యై= స్వరూపము గలిగినట్టియు, సువర్ణశ్రియై, సువర్ణ = బంగారమువంటి, శ్రియై = శోభ గలిగినట్టియు, నిష్సమాయై = సమానములేని లక్ష్మికొఱకు, నమః = నమస్కారము, జగదంబ = జగత్తులకు తల్లివగునోలక్ష్మీ, జయజయ = మిక్కిలి నుత్కృష్టురాలవై యుండుము, అహం = నేను, తే = నీకు, దాసః = భక్తుఁడను, అస్మి = అగుచున్నాను, హేరమావాసకాంతే = విష్ణువునకు భార్యవగు నోలక్ష్మీ, త్వమేవ = నీవే, అఖిలస్య = సమస్తమయిన, ప్రపంచస్య = ప్రపంచమునకు, మాతేతి = తల్లివని, పురాణ్యా = పూర్వురాలును, మహత్యాపి = గొప్పదియునగు, వాణ్యా = సరస్వతిచేత, సత్యాపితం = సత్యము

చేయఁబడినది. లోకానాం = ఆ సేవ, ఏవం = ఈప్రకారముగా, భవత్యాః = నీకు, తనయః = పిల్లఁడను, అస్మి = అగుచున్నాను. భృత్యః = భృత్యుఁడను, అస్మి = అగుచున్నాను, దాసః = సేవకుడను, అస్మి = అగుచున్నాను. తస్మాత్ = ఆహేతువువలన, కృపాపాంగైః = దయాయుక్తములగు, అపాంగైః = క్రేఁగంటిచూపులచేతను, ప్రసన్నం = భక్తుఁడనైనట్టియు, శిశుం = చిన్నవాఁడనైనట్టియు, మాం చ = నన్నయితే, అద్య = ఇప్పుడు, సించ = తడుపుచూ, కిం బహు = ఇంతేగాను, అంబ = ఓతల్లీ, త్వాం = నీవు, హృద్యా = విద్యాభిః, హృద్యా = మనోహరములయినట్టియు, అనవద్య = దోషము లేనట్టియు, ఆత్మవిద్యాభిః = పరమాత్మ విద్యలచేతను, శ్రీనివాసేన సహ = విష్ణుమూర్తితోఁ గూడ, తత్త్వం = పరతత్త్వమనియు, పరం - ఉత్కృష్టమగు జ్యోతిరితి = తేజస్సనియు, ఉద్ద్యోతసే = ప్రకాశింపఁజేయుచున్నావు. అంబ = తల్లీ, మహ్యాం = నాకొఱకు, దయోదయాః = అనుగ్రహించుచూ, భక్తిం = భక్తిని, ఉత్పాదయేథాః = పుట్టించుచూ, సుధారాశికన్యే = సముద్రుని కూఁతురవైనట్టియు, పద్మహస్తే = పద్మము హస్తమునందుఁ గలిగినట్టియు, మే = నాయొక్క, అంబ = తల్లివగు, రమే = ఓలక్ష్మీ, ప్రసీద ప్రసీద ప్రసీద = అనుగ్రహించుము అనుగ్రహించుము అనుగ్రహించుము.

చ. అగణితభక్తి నిట్లు నుతు ♦ లాతఁడొనర్పఁ గృపావిపాకముల్
దగ జగదంబ పాణికమ ♦ లంబున గ్రమ్మిన పుష్పరాల్పనా
సుగుణపయోధి పాధితసు ♦ శోభనలాభ నవప్రహర్షముల్
మొగమున నుల్లసిల్లఁగొని ♦ లోనగరోచితవాటికిం జనెన్. 49

తా — అప్పుడా ఆహిమవంతుఁడు, అగణితభక్తిన్, అగణిత = లెక్కపెట్టఁబడని, భక్తిన్ = భక్తిచేతను, ఇట్లు = ఈప్రకారము, నుతులు = స్తోత్రములు, ఒనర్పన్ = చేయఁగా, కృపావిపాకముల్ = దయాపరిపాకములు, తగన్ = ఒప్పునట్లుగా, జగదంబ = జగత్తులకు తల్లియగు లక్ష్మి, పాణికమ

లంబునన్ = హస్తపద్మమునందు లేక హస్తమునందలి పద్మమునందు, క్రమ్మి = వ్యాపించిన, పూవున్ = పుష్పమును, రాల్పన్ = రాలపఁగా, అనుగుణపయోధి = యోగ్యగుణములకు సముద్రుఁడగు నా హిమవంతుఁడు, సాధి... హర్షముల్ - సాధిత=సాధింపఁబడిన, సు = సౌభాగ్యమగు, శోభన = శుభము యొక్క, లాభ=పొందుటచేతనైన, నవ = క్రొత్తవియగు, ప్రహర్షముల్ = సంతోషములు, మొగమునన్ = మోమునందు, ఉల్లసిల్లన్ = ప్రకాశించఁగా, కొని = పుచ్చుకొని, లోన్ = లోపల, నగర=పట్టణమునకు, ఉచిత = తగిన, వాటికిన్ = ప్రదేశమునకు, చనెన్ = వెళ్ళెను.

సీత — అతఁడు=ఆజనకుఁడు, పయోధి = సముద్రుఁడగు జనకుఁడు.

సీ. రతివల్లభ సముల్ల ♦ సిత భల్ల పరిఫుల్ల
తత పల్లవ లసల్ల ♦ తా శతంబు
వర హల్లక సరిల్ల ♦ హరివేల్ల దలిమల్ల
కృత సల్లలిత వల్ల ♦ కీ రవంబు
విజహల్లలన షల్ల ♦ వికతల్లజ విపల్ల
సన కృల్లలిత సల్ల ♦ పన పికంబు
ప్రసరల్లఘుమరుల్ల ♦ వ సముల్లసిత ఫుల్ల
దురు వల్లరిక మల్లి ♦ కోత్కరంబు

గీ. హస్తి హస్త నిరస్త ని ♦ స్రస్త శస్త
గోస్తనీ స్తబక స్తోమ ♦ నిస్తులంబు
నైన యుద్యానమున నమ్మ ♦ హానుభావుఁ
డొంటిగ నునుంగులఁ బొసంగి ♦ యుండు నపుడు. 50

టీ. రతి... శతంబు — రతివల్లభ=మన్మథునియొక్క, సముల్లసిత=ప్రకాశించుచున్న, భల్ల=బల్లెములగు పువ్వులచేతను, పరిఫుల్ల=వికసించిన, తత=విస్తారములగు, పల్లవ=చిగుళ్ళచేతను, లసత్=ప్రకాశించుచున్న, లతా=తీగలయొక్క, శతంబు=వందలుకలదియు, వర...గమంబు, వర=శ్రేష్ఠములగు, హల్లక=ఎఱ్ఱనిగలువలుగల, సరిత్=నదులయొక్క, లహరి=ప్రవాహములయందు, వేల్లత్=చుట్టుకొనుచున్న, అలిమల్ల=గొప్పతుమ్మెదలచేతను, కృత=చేయఁబడిన, సత్=యోగ్యమగు, లలిత=సుందరమయిన, వల్లకీరవంబు, వల్లకీ—వీణలయొక్క, రవంబు=ధ్వనులుకలదియును, విజహా...పికంబు, విజహత్=విడిచిపెట్టిన (అనఁగా దూరమందున్న) లలన=స్త్రీలుగల, పల్లవిక తల్లజ=విటశ్రేష్ఠులయొక్క, విపత్=ఆపదలయొక్క, లసన=ఉద్రేకమును, కృత్=చేయుచున్న, లలిత=సుందరమగు, సత్=యోగ్యమగు, లపన=వాక్యములుగల, పికంబు=కోయిలలుగలదియును, ప్రసరల్ల...త్కారంబు, ప్రసరత్=ప్రసరించుచున్న, లఘు=తేలికయగు, మరుల్లవ=చిన్నగాలులచేతను, సముల్లసిత=ప్రకాశింపజేయఁబడిన, ఫుల్లత్=వికసించుచున్న, ఉరు=గొప్పదియగు, వల్లరిక=గుత్తులుగల, మల్లిక=మల్లిపువ్వులయొక్క, ఉత్కారంబు=సమూహముగలదియును, హస్తి... నిస్తులంబు, హస్తి=ఏనుఁగులయొక్క, హస్త=తొండములచేత, నిరస్త=తోసివేయఁబడినవి యనుకొనే, నిరస్త=జారిన, శస్త=ప్రశస్తములగు, గోస్తనీ=ద్రాక్షపండ్లయొక్క, స్తబక=గుత్తులయొక్క, స్తోమ=సమూహముచేత, నిస్తులంబు=సామ్యము లేనట్టిదియును, వన=అయినట్టి, ఉద్యానమునన్=ఉద్యానవనమందు, అమ్మహానుభావుఁడు=గొప్పసామర్థ్యముగల యాతఁడు, ఒంటిగన్=ఒక్కఁడుగా, అనుఁగులన్=ఇష్టులను, పొంగి=కూడి, ఉండునపుడు=ఉన్న సమయమున.

క. కన్నుల కింపై యమృతపు
వన్నెల పెంపై పొసంగు ♦ పాల్కడలి నెరా

చెన్నుల నింపై యొక్కట
మున్నత తేజంబు గగన ♦ మునఁ గనుపట్టెన్. 50

టీ. కన్నులకున్ = నేత్రములకు, ఇంపై = మనోహరమై. అమృతి
అమృతము యొక్క, వన్నెల = రంగుల, పెంపై = అతిశయమై, పొసం
ఒప్పుచున్న, పాల్కడలి = పాలసముద్రము యొక్క, సెరా =
శయించిన, చెన్నులన్ = సొగసుల చేతను, ఇంపై = మనోహ
ఒక్క = ఒక్కటియగు, సమున్నత = అతిశయముయిన. తేజంబు
తేజస్సు, గగనమునన్ = ఆకాశమున, కనుపట్టెన్ = కాంచెను.

ఆ. కట్టి తేజ మట్టి ♦ పడినట్టుఁ గనుపట్ట
చిత్త మద్భుతైక ♦ వృత్తి నిలువ
సందియంబుఁ జెందు ♦ సవయస్క జనులతో
నట్టి దిట్ట యిట్టు ♦ లనియె నపుడు. 51

టీ. పట్టి = ఇది కనుపట్టియను వెనుకటి పద్యాంతమున కనుకరణ
తేజము = తేజస్సు, ఊట్టిపడినట్టున్ = ఊడిపడినట్లుగా, కనుపట్టన్ =
కాన్పించగా, చిత్తము, మనస్సు, అద్భుతైకవృత్తిన్=ఆశ్చర్యప్రధాన వ్యా
రమున, నిలువన్ = నిలువఁగా, సందియంబున్ = సంశయంబును, చెందు
పొందుచున్న, సవయస్క = సమానవయస్సుగల, అనఁగా స్నేహితుల
జనులతోన్ = మనుష్యులతో, అట్టి దిట్ట = దిట్టరియగు నతఁడు, అపుడు =
అప్పుడు, ఇట్టులనియెన్ = ఈ ప్రకారముగా చెప్పెను.

ఉ. తేజమొకంటఁ గంటి మిఁది ♦ దివ్యతరంగిణినింగిఁబొంగుమేల్
తేజమొశారదాభ్రముల ♦ తేజమొపెక్కుడుచుక్కరిక్కరా
తేజమొయాజనార్దనుని ♦ తేజమొ వెల్వడకల్పభూజపుం
దేజమొచూడఁజూడఁగజ ♦ నించుముదంబుహృదంబుజంబునన్

టీ. తేజము = తేజస్సును, ఒకంటిన్ = ఒక దానిని, కంటిమి = చూచితిమి. ఇది = ఇది, దివ్యతరంగిణీ = ఆకాశగంగ, నింగిన్ = ఆకాశమునందు, పొంగు = పొంగునట్టి, మేల్ = శ్రేష్ఠమగు. తేజము = తేజస్సు, శారద = శరత్కాలమందలి, అభ్రముల = మేఘముల యొక్క, తేజము = తేజస్సు, నెక్కు = విస్తారముగా, ఈదువెక్కు = అతిశయించునట్టి, రిక్కరా = చంద్రుని యొక్క, తేజము = తేజస్సు, ఆ జనార్దనుని = ఆ విష్ణుమూర్తియొక్క, తేజము = తేజస్సు, విశే- (ఇచట విష్ణుతేజము నల్లనది కావునఁ దెల్లనిదియగు నారదుని తేజముతో నెట్లు సమమగునని శంకించవలవలదు. విష్ణువు యొక్క వర్ణము యుగభేదముచేత మారుచుండును గావున తెల్లని వర్ణమును కలదని యెఱుంగవలయును.) వెల్వడు = బయలుదేరునట్టి, కల్పభూజపుంతేజము = కల్పవృక్షముల తేజస్సు, చూడఁజూడఁగన్ = చూడఁగా జూడఁగా, హృదంబుజంబునన్ = హృదయ పద్మమునందు, ముదంబు = సంతోషము, జనించున్ = పుట్టును.

శా. హౌరా కన్నులపండువై వెలయునీ♦యవ్యాజదివ్యప్రభా
సారంబొక్కటె కాదు సంతతజను♦స్సంతాప చింతాపరీ
హారోదార ముకుందసద్గుణసుధా♦స్వాదంబమందంబుగా
నారూఢిందగుగానతానములు నిం♦పై వీనులందోఁచెడిన్.

టీ. హౌరా = ఆశ్చర్యము. కన్నులపండువై = నేత్రములకానందకరమై వెలయు = ఒప్పునట్టి. ఈ...సారంబు. ఈ = ఇట్టి, అవ్యాజ = కపటములేని, దివ్య = శ్రేష్ఠమగు, ప్రభా = కాంతి, సారంబు = సారము. ఒక్కటె = ఒక్కటియె, కాదు = కాదు. సంతత...స్వాదంబు, సంతత = ఎడతెగని, జనుః = జన్మము. సంతాప, తాపముచేతనైన, చింత = విచారముయొక్క, పరీహార = పోఁగొట్టుటయందు, ఉదార = గొప్పదియగు ముకుంద = విష్ణుమూర్తియొక్క, సద్గుణ = సౌభాగ్యగుణములనెడు, సుధా = అమృతము

యొక్క, స్యందంబు = ప్రవాహము, అమందంబుగన్ = విస్తారముగా, అరూఢిన్ = ప్రసిద్ధిగ, తగు = ఒప్పునట్టి, గానతానములు = సంగీతము యొక్క తానములును, ఇంపై = మనోహరమై, త్రోచెన్ = త్రోయుచున్.

క. మానమ్ములు వీనులకస ।
మానమ్ములు నిగమ భాస ♦ మానమ్ములు సో ।
పానమ్ములు ముక్తికి హరి ।
గానమ్ములు వినుడి దిటము ♦ గా నమ్ముడొగిన్. 54

టీ. వీనులకున్ = చెవులకు, మానమ్ములు = గౌరవములు ఐనట్టివియు, అసమానమ్ములు = సమానము లేనట్టివియు, నిగమ భాసమానమ్ములు, నిగమ = వేదములయందు, భాసమానమ్ములు = ప్రకాశించుచున్నట్టివియు, ముక్తికిన్ = మోక్షమునకు, సోపానములు = మెట్లు ఐనట్టివియు, హరి గానమ్ములు = విష్ణువు గానములు, దిటముగా = బాగుగా, వినుడు = ఆలకింపుడు, ఒగిన్ = క్రమము గా, నమ్ముడు = విశ్వసింపుడు.

చ. బటువుగ మీరు మేరు ప్రణ ♦ వంబుగ దక్కిన యక్కరంబులొ ।
క్కటి పదియు న్గరంగు పటి ♦ కమ్ములు వ్రేలు జపాక్షమాల వి ।
స్ఫుటతర వాసుదేవమను ♦ చొప్పున నొప్పు లనుప్పతిల్ల ను ।
త్కటగుణశాలి నారదుడు ♦ గన్పడె నద్భుత దివ్య తేజుడై 55

టీ. బటువుగన్ = గుండ్రగ. మీరు - అతిశయించుచున్న, మేరు = మేరువ పూస, ప్రణవంబుగన్ = ఓంకారంబుగా, తక్కిన యక్కరంబులు = మిగిలిన యక్షరములు, ఒక్కటి పదియుగన్ = పదునొకండుగా, రంగు పటికమ్ములు = కాంతిగల పటికపూసలు, వ్రేలు = వ్రేలబడుచున్న = జపాక్షమాల = జపమాలిక, విస్ఫుటతర...చొప్పున, విస్ఫుటతర = మిక్కిలి స్ఫుటమగు, వాసుదేవ = విష్ణువుయొక్క, మనుచొప్పునన్ = మంత్రముపత్త,

(అనఁగా ఓం నమో భగవతే వాసుదేవాయ అను మంత్రమువలె) ఒప్పాలన్ = శోభలచేయను, ఉప్పతిల్లన్ = అతిశయించఁగా, ఉత్కృష్టగుణశాలి = గొప్పగుణములతోఁ గూడిన, నారదుఁడు = నారదముని, అద్భుతదివ్యతేజుఁడై = ఆశ్చర్యకరమగు ప్రశస్తమగు తేజస్సుగలవాఁడై, కన్పడెన్ = కనుపించెను.

వ. ఇట్లు నిర్ణయించు సమయంబున. 56

సీ. సొగసుగాఁ దనరు ప ♦ న్నగశాయి గీతంబు,
నగశాయి గీతంబు ♦ నగవుపఱుపఁ ।
గర విపంచీ తంత్రి ♦ కల రవోల్లాసంబు,
కలరవోల్లాసంబు ♦ గానిపించ ।
బంగరు నెమ్మేయిఁ గ్రమ్ము ♦ బసుమంపు రుచికదం,
బసుమంపు రుచికదం ♦ బములఁ బెనఁగ ।
పద పదంబున నొప్పు ♦ మృదు పరాగమ్ములు,
మృదు పరాగమ్ముల ♦ మొలఁగి వెలుఁగ ।
గీ. ఫాలమున నూర్ధ్వపుండ్రంబు ♦ బరిఢవిల్లఁ ।
జిత్తము మురారిచింతనా ♦ యత్తముగను ।
నిల్వ గాంధర్వ సర్వస్వ ♦ నిధి కళావి ।
శారదుం డచ్చటికివచ్చె ♦ నారదుండు. 57

టీ. సొగసుగాన్ - అందముగా, తనరు - ఒప్పుచున్న, పన్నగశాయి - విష్ణువుయొక్క, గీతంబు - గానము, నగశాయి - పర్వతమునం దుండెడు గంధర్వాదులయొక్క, గీతంబున్ - గానమును, అగవుపఱుపన్ - నిందయొనర్పఁగా, కర—ల్లాసంబు, కర - హస్తమందలి, విపంచీ - వీణయొక్క, తంత్రికల - తీగెలయొక్క, రవ - ధ్వనియొక్క, ఉల్లాసంబు -

ప్రకాశము, కలన వోల్లాసంబున్, కలరవ - పావురములయొక్క, ఉల్లాసంబున్ - ప్రకాశమును, గారవించన్ - గౌరవముసేయుచుండగా, బడుగు నెమ్మెయిన్, బడుగు - చిక్కిన, నెమ్మెయిన్ - శరీరమునందు, క్రమ్ము - వ్యాపించి, బహుసంపు - విభూతియొక్క, రుచి - కాంతి, కదంబ సుమంపు - కడిమి పువ్వులయొక్క రుచి - కాంతియొక్క, కదంబములన్ - సమూహములను, పెనఁగన్ - పెనఁగులాడఁగా, పదపదంబునన్ - ప్రతి పదమందు, ఒప్పు - ఒప్పుచున్న, వృత్ - సక్తియొక్క, ఉపరాగమ్ములు - ఆవేశాలు, మృదుపరాగమ్ములన్, మృదు - మృదువులగు, పరాగమ్ములన్ - ధూళులను, మెఱసి — కలిసి, వెలుఁగన్ — ప్రకాశించఁగా. ఫాలమునన్ = నొసటియందు, ఊర్ధ్వపుండ్రము = నిలువుబొట్టు, పరిఢవిల్లన్ = అతిశయించఁగా, చిత్తము = మనస్సు, మురారిచింతన=విష్ణుచింతను, ఆయత్తమున=ఆధీనమగునట్లుగా, నిల్వ=నిలవఁగా, గాంధర్వ... గానవిద్యయనెడు, సర్వస్వ=సర్వధనమునకు, నిధి=స్థానమగు, కళావిశారదుండు- కళా = శాస్త్రములయందు, విశారదుండు = నేర్పరియగు, నారదుండు=నారదుఁడు, అచ్చటికిన్=ఆస్థలమునకు, వచ్చెన్ = వచ్చెను.

క. అచ్చపు తెలివిం దగు మహి
భృచ్చూడామణి యతఁడు ♦ ఋషివల్లభునిం
దచ్చన నెదుర్కొని వడిఁ
దచ్చరణాబ్జముల కెరఁగి ♦ దత్తాదరుఁడై. 58.

పా— అచ్చపు తెలివిన్ = నిర్మలమగు జ్ఞానముచేత, తగు = ఒప్పుచున్న, అతఁడు = ఆ, మహీభృచ్చూడామణి = పర్వతశ్రేష్ఠుఁడగు, హిమవంతుఁడు ఋషివల్లభునిన్ - మునిశ్రేష్ఠుఁడగు నారదుని తచ్చనన్ - శీఘ్రముగా, ఎదుర్కొని - ఎదురైనవాఁడై, వడిన్ - త్వరగా, తచ్చరణాబ్జము

లకుఁ - ఆనారదుని పాదపద్మములకు, ఎఱఁగి - నమస్కరించి, దత్తాద రుఁడై - ఇయ్యఁబడిన యాదరముగలవాఁడై.

సీ. మహీభృచ్చూడామణి - రాజశ్రేష్ఠుఁడగు జనకుఁడు.

క. ధరణీభృత్పతి సుజనా
చరణీయస్ఫూర్తిఁ బాద్య ♦ జల మొసఁగెను ద
చ్చరణములకుఁ బావన సం
చరణములకు సురకృతోప ♦ చరణములకున్. 59

టీ. ధరణీభృత్పతి - పర్వత శ్రేష్ఠుఁడగు, హిమవంతుఁడు, పావన సంచరణములకుఁ, పావన - పవిత్రమగు, సంచరణములకుఁ-సంచారముకలి గినట్టియు, సుర——లకుఁ, సుర - దేవతలచేతను, కృత - చేయఁబడిన, ఉప చరణములకున్-ఉపచారముగల, తచ్చరణములకుఁ- తత్-ఆ నారదుని యొక్క, చరణములకుఁ - పాదములకు, సుజనా...స్ఫూర్తిన్, సుజన- యోగ్యజనులకు, ఆచరణీయ-చేయఁదగిన, స్ఫూర్తిన్-స్ఫురణముచేత, పాద్య జలము-కాళ్ళకొరకైన యుదకము, ఒసంగును-ఇచ్చెను.

సీ— ధరణీభృత్పతి-జనకుఁడు.

క. అర్ఘ్యన కతనికి సుమనో
దీర్ఘ్యంబులతో నతండు ♦ దృఢ వినయ మనో
దైర్ఘ్యంబున విధి విహితం
బర్ఘ్యంబు నుపార్ఘ్యమిచ్చి ♦ యర్చ యొనర్చెన్. 60

టీ. అతండు-అతఁడు, అర్ఘ్యనకున్ - పూజించఁదగిన, అతనికిన్ - ఆ నారదునకు, సుమనో...లతోన్, సుమనోదీర్ఘి-గంగయందలి, అంబుల తోన్ - ఉదకములతోను, దృఢ...బునన్, దృఢ-దృఢమగు, వినయ-విన

యముగల, మనః = మనస్సుయొక్క, దైర్ఘ్యంబునన్ = పొడవుచేత, విధి విహితంబు = శాస్త్రము చేత చేయఁబడినదియగు, అర్ఘ్యంబును = పూజావిధానమును, ఉపార్ఘ్యతం = పయిపూజయు, ఇచ్చి, అర్చ మొనర్చెన్ = పూజించెను.

క. నానా విధ సూనాదుల
తో నాతఁడొనర్చు నర్చ ♦ తుష్టి ఘటింపం
గా నాతత మానాన్వితుఁ
డా నారదుఁ డనియె నచట ♦ నాసీనుఁడై. 61

టీ. నానా...లతోన్, నానావిధ=అనేక విధములగు, సూనాదులతోన్ = పువ్వులు మొదలగువానితో, ఆతఁడు=అతఁడు, ఒనర్చు=చేయుచున్నట్టి, అర్చ= పూజ, తుష్టిన్ సంతోషమును, ఘటింపఁగాన్ =కూర్పఁగా, ఆతత మానాన్వితుఁడు, ఆతత=విస్తారమగు, మాన = గౌరవముతో, అన్వితుఁడు=కూడుకొనినవాఁడగు, ఆ నారదుఁడు = ఆ నారదముని, అచటన్ = అక్కడ, ఆసీనుఁడై = కూర్చుండినవాఁడయి, అనియెన్ = చెప్పెను.

సీ. ఎరపట్టు తెరబట్టు ♦ నొరపట్టు చిరుచట్టు
పల జక్కదొర నెక్కు ♦ ప్రభుఁడు వాఁడు।
అల కుందముల బృంద ♦ ముల యందములనంద,
నరుకొంవ్వగల నవ్వు ♦ బరగువాఁడు।
పెను మచ్చికను హెచ్చి ♦ తను మెచ్చుకొను లచ్చి,
కొర వుచ్చి యెదమించు ♦ గురుతువాఁడు।
అల నీలముల జాల ♦ ముల లీలల నిరాళ।
మై రంగలరు నంగ ♦ మమరు వాఁడు।

గీ. సకల చిద చిచ్ఛరీరుండు ♦ సర్వగతుఁడు ।
జగముల సృజింపఁ బాలింప ♦ సంహరింపఁ ।
దగు పటిమగల్గు జాళువా ♦ జగము నేలు
మేలుదొర నిన్నుఁ గరుణతో ♦ నేలుఁగాత. 62

టీ. ఎరపట్టు-ఎరపట్టుయొక్క, తెర - జవనికయొక్క, గిట్టుట - అతిశయమును, ఒరపట్టు - ఆక్రమించునట్టి, చిరు - చిన్నవియగు, చెట్టుపల = రెక్కలుగల, జక్కిదొరన్ - మేలిగుఱ్ఱమును, ఎక్కి - అధిష్ఠించి, ప్రబలు వాఁడు - అతిశయించునట్టివాఁడు, అలకుందముల - ప్రసిద్ధములైన మల్లెపువ్వుల యొక్క, బృందముల - సమూహముల యొక్క, అందములన్ - శోభలోయనునట్టుల, తనరు - ఒప్పుచున్న, క్రొవ్విగల - క్రొత్తవిలాసములుగల, నవ్వు - హాసము, పరగువాఁడు - ఒప్పునట్టివాఁడు, పెనుమచ్చికను-మిక్కిలి స్నేహముచేతను, హెచ్చి = అతిశయించి, తనన్ - తన్ను, మెచ్చుకొను - ప్రోత్సాహముఁ జేయునట్టి, ఇచ్చి-లక్ష్మి, కొర-లోటును, పుచ్చి-పోఁగొట్టి, ఎదన్-హృదయమందు మించు అతిశయించునట్టి గురుతువాఁడు - చిహ్నము వాఁడు, అలనీలముల = ప్రసిద్ధములగు నీలములయొక్క, జాలముల = సమూహముల యొక్క, లీలలన్ = విలాసములచేత, నిరాళమై = నిశ్శంకమై, రంగలరు = ప్రకాశించుచున్న, అంగము = శరీరము, అమరువాఁడు - ఒప్పుచున్నవాఁడు సకల...శరీరుండు, సకల - సమస్తములగు, చిత్ - జ్ఞానము గల జంతువుల యొక్కయు, అచిత్ - జ్ఞానములేని జంతువులయొక్కయు, శరీరుండు - శరీరము కలవాఁడు, సర్వగతుఁడు - సమస్తమును బొందినవాఁడు, జగములన్ లోకములను, సృజింపన్ - నిర్మించుటకును, పాలింపన్-ఏలుటకును, సంహరింపన్ - మాపుటకును, తగు - తగిన, పటిమ - సామర్థ్యము, కలుగు - కలుగునట్టి, జాళువా గజమున్ - బంగారపుభూమిని, (అనఁగా వైకుంఠమును) ఏలు - పరిపాలించునట్టి, మేలుదొర - గొప్పయధికారి, నిన్నున్ -

నిన్ను, కరుణతోన్ = దయతో, ఏలుగాక - రక్షించుఁగాక.

శా. భూమీభృత్కులచంద్ర సారసవనాభోగంబులన్ సద్విజ
స్తోమం బెల్లెడ నుల్లసిల్లఁ దగు నీ శుద్ధాశయప్రాభవం
బామోదించు నెమించు నేవిభవముల్ హార్దోన్నతిం గాంచు నే
సామస్త్యంబున సామజంబులు హరుల్ సౌఖ్యావహోద్యానముల్. 63

టీ-భూమీభృత్కులచంద్ర, హిమవంతుడా, సారసవనాభోగంబులన్, సారస-పద్మముల యొక్క, వన - వనముల యొక్క ఆభోగంబులన్ - అతిశయములయందు, సద్విజస్తోమంబు, సత్ - సౌభాగ్యములగు, ద్విజ-హంసాదిపక్షులయొక్క, స్తోమంబు సమూహము, ఎల్లెడన్-అన్నిచోటుల, ఉల్లసిల్లన్ ప్రకాశించఁగా, తగు - ఒప్పుచున్న - నీ - నీసంబంధమైన, శుద్ధా...వంబు, శుద్ధ - పరిశుద్ధములగు, ఆశయ-స్థానముల యొక్క ప్రాభవంబు-అతిశయము, ఆమోదించునె - పరిమళించునుగదా, విభవముల్. ని - పక్షులయొక్క, భవముల్ - పుట్టుకలు, మించునే - అతిశయించునా, సామజంబులు - ఏనుఁగులును, హరుల్ - సింహములు, సౌఖ్యావహోద్యానముల్, సౌఖ్య - సౌఖ్యమును, ఆవహ-కలిగించెడు, ఉద్యానముల్-ఉద్యానవనములును, సామస్త్యంబునన్- సమస్తత్వముచేత, హార్దోన్నతిన్-సంతోషాతిశయమును, కాంచునే-పొందునా.

సీత —భూమీభృత్కులచంద్ర-రాజశ్రేష్ఠుఁడైన జనకుడా, సారసవనాభోగంబులన్, సార-శ్రేష్ఠములగు, సవన- యజ్ఞములయొక్క, ఆభోగంబులన్-అతిశయములచేత, సద్విజస్తోమంబు - శ్రేష్ఠులైన బ్రాహ్మణులయొక్క సముదాయము, ఎల్లెడన్, ఉల్లసిల్లన్-తగు, నీ...వంబు, నీ-నీయొక్క, శుద్ధ-పరిశుద్ధమగు, ఆశయ-అభిప్రాయముయొక్క, ప్రాభవము-అతిశయము, ఆమోదించునె-సంతోషించునా, విభవముల్ - ఐశ్వర్యములు, సామజంబుల్ -

వేమఁగులుగు. హయముల్ - గుఱ్ఱములును, సౌభాగ్య...యానముల్, సౌభాగ్యవహ- సౌభాగ్యవహములగు, ఉత్ - ఉన్నతములగు, యానముల్ - వాహనములు. శేషము సమము.

చ. సరస తరుల్ భవత్ప్రచిత ♦ సంతత జీవన లబ్ధ వృద్ధులై
పరగుచుఁ బావనానుగతి ♦ బర్విన యాత్మరజంబు దీఱిపో
నిరుపమ పర్వ సత్త్వగతి ♦ నిర్మల వృత్తి వహింప నొప్పు నీ
ధర నుపపన్నగోరు సమ ♦ దావలయానల సత్త్వ మొప్పునే.

పా— సరసతరుల్ - దట్టములగు వృక్షములు, భవ...వృద్ధులై, భవత్ - నీచేత, రచిత - చేయఁబడిన, సంతత - ఎడతెగని, జీవన - ఉదకముచేత, లబ్ధ - పొందఁబడిన, వృద్ధులై - వృద్ధికలవియయి, పరగుచున్ - ఒప్పుచును, పావనానుగతిన్, పావన - వాయుసంబంధమగు, అనుగతిన్ - సంపర్కముచేత, పర్విన - వ్యాపించిన ఆత్మ - తమసంబంధమగు రజంబు - పరాగము, తీఱిపోన్ - నిశ్శేషముగా పోవఁగా, నిరు...గతిన్, నిరుపమ - సామ్యములేని. పర్వ - కనుపుల సత్త్వ - బలము యొక్క గతిన్ - పొందికచేతను, నిర్మలవృత్తిన్ - నిర్మలమగు వ్యాపారమును. వహింపన్ - పూనఁగా, ఒప్పు - ఒప్పునట్టి, నీ ధరన్ - నీభూమియందు, ఉప...సత్త్వము, ఉపపన్నగ - పాములయొక్క సమీపమందలి, ఉరు = గొప్పదియగు, సమ - సమానమగు, దావ - అడవియందలి, లయ - లీనతగల, అనల - అగ్నులయొక్క, సత్త్వము - ఉనికి * (అనఁగా లక్షణచే పాములతోఁగూడిన యరణ్యమందు, వహ్నులబాధ యణఁగిపోవుటయను నర్థము క్లిష్టముగా సంపాదింపవలయును.) ఒప్పునే - తగియుండునా ?

* ఈ పాఠమును బుస్తకాంతరములయందు విమర్శింపవలయును.

సీత— సరసతరుల్ - మిక్కిలి సరసులగువారు, భవ...వృద్ధులై, భవత్ - నీచేత, రచిత - చేయఁబడిన, సంతత - ఎడతెగని, జీవన - వృత్తులచేతను, లబ్ధ - పొందఁబడిన, వృద్ధులై = వృద్ధిగలవారై, పావనానుగతిన్, పావన - పవిత్ర

లగువారియొక్క, అనుగతిన్-అనుసరించుటచేత, ఆత్మరజంబు అంతఃకరణా యందలి రజోగుణము, నిరు...గతిన్, నిరుపమ-ఉపమానము లేని, పర్వ-పండు వులయొక్క, సత్వ-ఉనికియొక్క, గతిన్-రీతిచేత, ఉపపన్న-...సత్వము, ఉపపత్-ఉపపత్తితోఁ గూడిన, నగ-చెట్లయొక్కయు, (ఇదిమధ్యమపదలోపి సమాసము) ఉరు = గొప్పదియగు, సమదావల = ఏనుఁగులతోఁ గూడిన, యా న = వాహనములయొక్క, లసత్వము-ప్రకాశించుట. ఒప్పునే = తగియుం డునా ! అనగా తోటలు, ఏనుఁగులు, వాహనములు బాగుగనున్నవి గదా అని యర్థము. ఇది తెక్కిన రాజ్యాంగాదుల క్షేమమున కుపలక్షణము.

క. అనవిని వినయము నయముం ।
బెనఁగొన నిటులనియె భూమి ♦ భృత్పతి కమలా ।
సన లలనా కరనళినాం ।
కన కనక శుకానులాప ♦ ఘనతర ఫణితిన్. 65.

టీ. అనన్ = అనఁగా, భూమిభృత్పతి - భూధరశ్రేష్ఠుఁడు. విని - విని, వినయమున్ - నమ్రతయు, నయమున్ - నీతియు, పెనగొనన్ - పెన వేసికొనఁగా, కమలా...ఫణితిన్, కమలాసన - బ్రహ్మయొక్క, లలనా - స్త్రీయగు సరస్వతియొక్క, కరనళిన - హస్తపద్మమునకు, అంకన - అలం కారమగు, కనక - బంగారు వికారమగు, శుక - చిలుకయొక్క, అనులాప వాక్యములయొక్క, ఘనతర - మిక్కిలి గొప్పదియగు, ఫణితిన్-రీతిచేతను, ఇటులు - ఈ ప్రకారము, అనియెన్ - చెప్పెను.

శా. స్వామీమీరలపారచారుకరుణా♦సారంబునన్ మామకా।
రామక్షోణిఁ బదాబ్జముద్రికలొన♦ర్పన్ నేఁడుగా సంపదల్।
సామస్త్యంబునమాకుఁ జేకురునుదోషంబుల్ కథాశేషముల్
గామాసెన్ వెలసెన్ మహాసరసులన్♦గాంభీర్యసంభారముల్

టీ. స్వామీ - ఓదేవరా, మీరలు - మీరు, అపా... మునన్, అపార పద్మలేవి, చారు - సుందరమగు, కరుణా - దయయొక్క, సారంబునన్ - సారముచేత, మామ... క్షోణిన్. మామక - నాసంబంధమగు, ఆరామ = ఉద్యానవనముయొక్క, క్షోణిన్ - భూమియందు, పద్మాబ్జ ముద్రికలు, పద్మాబ్జ - శ్రీపద్మములయొక్క, ముద్రికలు - ముద్రణలు, ఒనర్పన్ - చేయఁగా, నేడుగా - ఈదినమునందు, సంపదల్ - ఐశ్వర్యములు, సామస్త్యంబునన్ - సమస్తమునుగూర్చి, మాకున్ - మాకు, చేకురును - లభించును, దోషంబుల్ - పాపములు, కథాశేషముల్ గాన్ = కథలే మిగులుకలుగునట్లుగా, మాసెన్ - నశించెను. మహోత్సవములన్ - గొప్పసంతసములయందు, గాంభీర్య సంభారముల్ - గాంభీర్యాతిశయములు. వెలసెన్ - ఒప్పెను.

క. సుమన స్సముదయ మెల్లను ।
భ్రమరహిత మహాసవాను ♦ భవ విభవముచే ।
నమరుచు ఫలమీఁదొడఁగెను ।
గమలాప్త సమాన నీదు ♦ గరుణ ప్రసంగన్. 67

పా—కమలాప్తసమాన, సూర్యునితో సమానుఁడవగునో నారదుఁడా నీదు = నీసంబంధమగు, కరుణ - దయ, ప్రసంగన్ - అనుకూలించుటచేత. సుమన స్సముదయ మెల్లను, సుమనః - పుష్పములయొక్క, సముదయ మెల్లన్ సముదాయమంతయు, భ్రమ.....విభవముచేన్, భ్రమర - తుమ్మెదలకు, హిత - ఇష్టమగు, మహత్ - గొప్పదియగు, ఆసవ - మకరందముయొక్క, అనుభవ - పొందుటయొక్క, విభవముచేన్ - విభవముచేత. అమరుచున్ - ఒప్పుచు, ఫలము - పండ్లజాతిని, ఈఁదొడఁగెను - ఇయ్యనారంభించెను.

సీత—సుమనస్సముదయ మెల్లను - దేవతా సముదాయమంతయు, భ్రమ విభవముచేన్, భ్రమ - భ్రాంతితోటి, రహిత - శూన్యమగు, మహత్

గొప్పవి యగు, సవ - యజ్ఞములయొక్క, అనుభవ - అనుభవించుటయొక్క, విభవముచేఁ - వైభవముచేత, అనుపమ ఒప్పును, ఫలము - కోరికను, శేషము సమానము.

చ. సలలిత తేజ మీకొసఁగు ♦ సత్కృతి సత్కృతి మీకుఁ బాద్యమై
చెలఁగిన జీవనం బదియ ♦ జీవన మాదరమోద రమ్య శీ
తల భవదీయదృష్ట్యమృతధారల యోగమె యోగ మెన్నిటన్
దలఁపయి మీపదాబ్జముల ♦ ధారణ ధారణ సూరికోటికిన్.

టీ. ఈ పద్యమునందు సత్కృతి సత్కృతి, జీవనము జీవనము, యోగము యోగము, ధారణ ధారణయను శబ్దార్థములకుఁ బౌనరుక్త్యమును దాత్పర్యమునకు భేదమును లక్షణముగల లాటానుప్రాసముండుటయేగాక రెండవ శబ్దమునకు నర్థభేదముంగూడ స్ఫురించునట్టుల కవి రచియించి యున్నాఁడు. ఎట్లనిన, సలలిత తేజ, సలలిత - విలాసముతోఁ గూడిన, తేజ - తేజముగల ఓనారదా, సూరికోటికిఁ - విద్వత్సముదాయమునకు, మీకొసఁగు - మీకిచ్చునట్టి, సత్కృతి - సత్కారము, సత్కృతి - సత్ - యోగ్యమగు, కృతి - కావ్యము, మీకుఁబాద్యమై - మీకుఁబాదార్ఘ్యమై, చెలఁగిన - ఒప్పిన, జీవనంబు - ఉదకము, అదియు - అదే, జీవనము - ప్రాణము, ఆదర...యోగము, ఆదర - ఆదరముచేతను, మోద - సంతోషముచేతను, రమ్య - సుందరమును, శీతల - చల్లనిదియునగు, భవదీయ - నీసంబంధమగు, దృష్టి - చూపనెడు, అమృతధారల - అమృతవర్షములయొక్క, యోగము - సంబంధము, యోగము - ఉచ్ఛ్రాయదశ, ఎన్నిటఁ - ఎన్నివిధములచేతనైన, తలపయిఁ - శిరస్సుమీద, మీపదాబ్జముల - మీపాద పద్మములయొక్క ధారణ - ధరించుట, ధారణ - అష్టాంగయోగములలో నొకటి.

క. భాగవత తిలక మీయను
రాగము మావంటి కర్మ ♦ రక్తాత్ములపై

నే గతి ఫలియించెనో కో
భాగీరథి పిచ్చుగుంటి ♦ పయిఁబడు పగిదిన్. 69.

టీ. భాగవత, తిలక - భాగవతులలో శ్రేష్ఠుఁడా, మీ, యనురాగము - మీ ప్రేమ, మావంటి - మావంటి కర్మ, రక్త, ఆత్ములపైన్ - కర్మలయందు ఆసక్తిగలవారిపైని, ఏగతి - ఏవిధముగా, ఫలియించెనో కో - ప్రసన్నమయ్యెనో గదా, భాగీరథి - గంగ, పిచ్చుగుంటిపయిన్ బడు - గంగానది, తనయెడకు రాలేని పిచ్చుగుంటివాని కడకే వచ్చిన పగిదిన్ - రీతిగా.

క. వానిది భాగ్యము యోగ్యత
వానిది, వానిది సుజన్మ ♦ వైభవ మిల నె
వ్వానికి మీపదపంకజ
పానీయము గ్రోలఁగల్గు ♦ భావజ్ఞ నిధీ. 70

టీ. భావజ్ఞ నిధీ - ఓ నారదమునీంద్రా! ఇలన్ - భూమియందు, ఎవ్వానికి - ఎవనికి, మీపద పంకజ పానీయము - మీయొక్క, పాదపద్మములు గడిగిన జలము, గ్రోలన్ - త్రాగుటకు, కల్గున్ - లభించునో వానిది, భాగ్యము యోగ్యత సుజన్మ వైభవము - మంచిజన్మయొక్క విభవము.

క. ఎచ్చటికిఁ బోవుదును మీ
రిచ్చటికే తెంచి పూర్వ ♦ కృత సుకృతమ్ముల్
తచ్చన ఫలింపఁ జేసితి
రచ్చెరువుగఁ దెల్పవే ద ♦ యారస జలధీ. 71.

టీ. దయారసజలధీ-కరుణాసముద్రుడవగు నో నారదా, ఎచ్చటికిఁ బోవుచు-ఏప్రాంతమునకుఁబోవుచు, మీరిచ్చటికే తెంచి - మాగృహమునకు వచ్చి, పూర్వకృతసుకృతమ్ముల్-పూర్వజన్మమున మే మొనర్చిన పుణ్యకర్మము

లను, తచ్చన-శీఘ్రముగా, ఫలింపఁ జేసితిరి-ఫలప్రదములుగా నొనర్చినారు గదా, అచ్చెరువుగ-ఆశ్చర్యము గదా, తెల్పవే-అనుగ్రహింపుమా.

చ. అనవుఁడు మౌని పల్కె విను ♦ మాయను మానము లేక లోకరం
జన జనకా పురందరుని ♦ సన్నిధికిం జని యుంటి నచ్చటం
గనదచిరత్న రత్న పరి ♦ కర్మిత నిర్మలిత ప్రభఁ సభఁ
దనరు సుధాశనేంద్రులను ♦ దట్టితి ముప్పదిమూఁడుకోటులఁ

టీ— అనవుఁడు - అనఁగా, మౌని - నారదుఁడు పల్కెఁ - చెప్పెను, లోక... జనకా, లోకరంజన - ప్రజారంజనమును, జనకా, పుట్టించెడు నో హిమవంతుఁడా, అనుమానములేక - సంశయములేకుండ, వినుమా - ఆకర్ణించుమా, పురందరు సన్నిధికిఁ - ఇంద్రునిదగ్గఱకు, చని - వెళ్ళి, ఉంటిఁ - ఉంటిని, అచ్చటఁ - అక్కడ, కనద...ప్రభఁ, కనత్ - ప్రకాశించుచున్న, అచిరత్న - నూత్నములగు, రత్న - రత్నములచేతను, పరికర్మిత - అలంకరించఁబడిన, నిర్మలిత - నిర్మలమై చేయఁబడిన, ప్రభఁ - కాంతిగల, సభఁ - సభయందు, తనరు - ఒప్పుచున్న, ముప్పదిమూఁడు కోటులఁ - ముప్పదిమూడుకోట్ల సంఖ్యగల, సుధాశనేంద్రులను - దేవతా శ్రేష్ఠులను, తట్టితిఁ - సమీపించితిని.

సీత— లోకరంజన - లోకమును రంజింపజేయువాఁడా, జనకా - జనకమహారాజా.

చ. వసుమతిలోన యజ్ఞకృతి ♦ వర్తిలఁ బూర్వము మీరలందఱా
రసితన శేమతం గొనఁగ ♦ రాజిలి రావణుఁ డంత దక్షుఁ డుం
బ్రసభ మునీశపూజ గరి ♦ మం దనరింప నిజప్రియార్హణం
బెసఁగమిఁ సూనవృత్తియగు ♦ నేసతిపీడ్వ డె జీవనంబునన్.

ఈపద్యము రెండర్థములయందు బృహస్పతి దేవతలకుఁ జెప్పువాక్యము.

టీ. వసుమతిలోనఁ - భూమిలోపలను, పూర్వము - పూర్వమందు.

యజ్ఞకృతిన్ - యజ్ఞముయొక్క, చేయుటవలను. వర్తిలన్ - ప్రవర్తించఁగా మీఱలంపదు - మీఱంగఁజూచు, ఆరసితన్ - ఆ - ఆ యజ్ఞ సంబంధమయిన, రసితన్ - రసము కలుగుటను, అశేషతన్ - శేషము లేకపోవుటచేత. కొనగన్ - పుచ్చుకొనఁగా రాజిని - ప్రకాశించి, రావణుఁడు, గాంభీర్యముచే - సౌద్ధత్యనితో మాటలాడునట్టి దక్షుఁడు - దక్షప్రజాపతి, అంత - అంతట, ప్రసభమున్ - బలాత్కారముగా, ఈశపూజ - ఈశ - గొప్పవారియొక్క, పూజ - పూజ, గరిమన్ - గొప్పతనముచేత, తనరింపన్ - చేయఁగా, నిజ, ...ణంబు, నిజ - తనసంబంధియగు, ప్రియ - ప్రియుఁడైన శివునియొక్క, అర్ఘ్యాణంబు - పూజను, ఎసగమిన్ - చేయకపోవుటచేత, మానవృత్తియగు, మాన - మిక్కిలి తఱ్ఱవయగు, వృత్తియగు - వ్యాపారముగల. ఏసతి - - ఏసతిదేవి, జీవనమునన్ - ప్రాణముతోడ, వీడ్వడెన్ - వీడెనో !

విశే — ఇచట విచారించగా రసశబ్దముపై ఇని ప్రత్యయమున కపవాదముగా 'రసాదిభ్యశ్చ' అను సూత్రముచే మతుప్ విధించఁబడినది, కావున ఇని ప్రత్యయమువచ్చుట న్యాయముకాదు. అయినను శ్లేషస్థలమగుటచేఁ గష్టసృష్టిచే సంపాదించి యీశబ్దము నిట్లుఁ బ్రయోగించినట్లు దోఁచుచున్నది. సుధీమణులు బుద్ధిమంతులు విచారింతురు గాక !

సీత — వసుమతిలోన్ - భూమిలో, నయజ్ఞకృతిన్ నయజ్ఞ - నీతి తెలిసినవారియొక్క, కృతిన్ - వ్యాపారముచేత, వర్తిలన్, పూర్వము, మీఱలంపదు అరసి - చూచి, తనశేషతన్ - తనభృత్యత్వమును, కొనఁగన్ రాజిలి, దక్షుఁడు - సమర్థుఁడగు, రావణుఁడు - రావణాసురుఁడు, దీనికి వీడ్వడెన్ అను క్రియతో సంబంధము, అంతన్ - అంతట, ప్రసభ మునీశ పూజ, ప్రసభ - బలాత్కారముగా, మునీశ - మునీశ్వరునియొక్క, పూజ పూజ, గరిమన్, తనరింపన్, నిజప్రియార్ఘ్యాణంబు, నిజ - తనసంబంధమగు ప్రియ - ఇష్టమగు, అర్ఘ్యాణంబు - పూజను, ఎసఁగమిన్ - చేయకపోవుట చేత, [అనఁగా వేదవతి రావణుని మునియను మోహముచేఁ. బూజించి యతని

కిష్టమగు మనోరథము దీర్చెదఁడుటచేతనని యర్థము.] సూనృతప్రియగు, వక్ష వ్యాపారము గల (అనఁగాఁ దన్నుజంపుటకయి జనించిన) వి సతిన్ - యోష త్రివతను, జీవనంబునన్ - ఉదకమందు పీడ్వడెన్ - వదలెనో, వైపద్యము తో నన్వయము. . . .

క. భాసిలు నీ సర్వంసహా
నా సతి యా మేన గర్భ ♦ మందని గురుఁడు
ల్లాస వికాసంబున నా
వాసవునకుఁ దెలుప వింటి ♦ వర సుగుణనిధీ. 74.

టీక. అర్థము—పూర్వ — ఆ సతి - ఆసతీదేవి, యీసర్వంసహన్ యీభూమియందు, ఆ మేనగర్భమందు - ఆ మేనకాదేవి గర్భమందు (ఇది తెలుగు షష్ఠీసమాసము( భాసిలున్ ప్రకాశించును. అని, గురుఁడు - బృహస్పతి, ఉల్లాస వికాసంబునన్ - ఉత్సాహము చేతనైన, ముఖప్రసన్నతచేత ఆ వాసవునకున్ - ఆయింద్రునకు, తెలుపన్ - చెప్పగా, వరసుగుణనిధీ - శ్రేష్ఠములగు మంచిగుణములకు స్థానమైన ఓహిమవంతుఁడా, వింటిన్ వింటిని.

పీఠ— ఆసతి - ఆస్త్రీ, ఆమేనన్ - అశరీరముతో, సర్వంసహన్ - భూమియందు, గర్భమందున్ - లోనిభాగమందు, భాసిలున్ - ప్రకాశించును. శేషము సమానము.

గీ. కాన నవమాన నీపుత్త్రి ♦ యా నిజంబు
సర్వమంగళ జగదేక ♦ జనని యైన
యట్టిసతి నీదు పట్టియై ♦ పుట్టినంత
సకల సౌభాగ్యములు నీకు ♦ సంఘటిల్లు. 75.

టీక. పా. కాఁన్ - కనుక, ఆచాన - ఆ స్త్రీ నీపుత్త్రియౌన్ - నీ కొమార్తె యగును. నిజంబు - సత్యము, జగదేక జననియైన - జగత్తులకు ఒక్కతె యగు తల్లియయిన అట్టిపతివ్రతయైన - సర్వమంగళ - పార్వతీదేవి నీదుపట్టియై - నీకొమార్తెయు, పుట్టినంతనె - పుట్టగానే, సకలసౌభాగ్యములు - అన్ని యదృష్టములు, నీకు సంఘటిల్లును - నీకు కలుగును.

సీతా—సర్వమంగళ = సమస్తశుభములు గల, జగదేకజననియైనట్టి = జగత్తులకు తల్లియైన ఆ పతివ్రత, శేషము సమానము.

సీ. సర్వ సర్వంసహా ♦ సర్వస్వ నిర్వాహ
ధూర్వహుం డేవింట ♦ మౌర్వి యయ్యె
నంభోధిరాడ్రత్న ♦ డింభ సంభృత హార
హారి యేవింట ల ♦ కోరి యయ్యె
బృందారకానంద ♦ మందిరంబగు కాంచ
నాద్రి యేవింట సా ♦ రాంశ మయ్యె
నంబరైకాలంబ ♦ మై యాడు మూఁడు పు
రమ్ము లేవింట శ ♦ రవ్యమయ్యె
గీ. నహరహము నర్హణీయమై ♦ యజగవాఖ్య
నలరు నావిల్లు చేపట్టి ♦ నట్టి దిట్ట
కనమ సౌభాగ్యములు మీఱ ♦ నోసఁగు మట్టి
కన్యక ననన్య సామాన్య ♦ మాన్య మతిని. 76

టీ. పా—సర్వ...ధూర్వహుండు, సర్వ = సమస్తమైన, సర్వంసహా = భూమి యొక్క, సర్వస్వ = సమస్త ధరణియొక్కయు ననగా సమస్తభార

ములతో గూడిన భూమి యొక్క యని యర్థము, నిర్వాహే = నిర్వహించుట యందు, భూర్వహుండు = భారమును వహించిన శేషుఁడు, ఏవింటన్ = ఏధనస్సునందు, మౌర్వియయ్యెన్ = అల్లెత్రాడాయెనో, అంభోధి...హారి, అంభోధిరాట్ = క్షీరసముద్రము యొక్క, రత్నడింభ = పిల్లవాని వంటి రత్నముచేతను (కౌస్తుభమణిచేత ననుట) సంభృత = కూర్పఁబడిన, హార హారముచేత, హారి = మనోహరుఁడగు విష్ణువు, ఏవింటన్ = ఏ ధనస్సునందు, లకోరియయ్యెన్ = బాణమయ్యెనో, బృందార ...మందిరంబు, బృందారక = దేవతలయొక్క, అమంద-గొప్పదియగు, మందిరంబు -గృహము అగు - అయినట్టి, కాంచనాద్రి - మేరుపర్వతము, ఏవింటన్ - ఏధనస్సు నందు, హరాంశమయ్యెన్ - ముఖ్య భాగమయ్యెనో. అనగా వింటిబద్దయైన దనుట, అంబరైకాలంబము, అంబర - ఆకాశమే, ఏక - ముఖ్యమైన, అలంబ ము - ఆధారము గలది, అయి, అటు - తిరుగుచుండు - మూఁడుపురములు త్రిపురములు, ఏవింటన్ - ఏధనస్సునందు. శరవ్యమయ్యెన్ - గురియయ్యెనో ఆహరహమున్ - ప్రతిదినమును, అర్హణీయమై - పూజించఁదగినదియై, అజగ వాఖ్య అజగవమను పేరుచేతను, అలరు - ఒప్పుచున్న, ఆవిల్లు - అధనస్సును చేపట్టినట్టి దిట్టకున్ - చేతబూనిన శివునికి, అనన్య...మతిని అనన్యసామాన్య ఇతరులకు సాధారణముగాని, మతిని - బుద్ధిచేతను, అట్టికన్యకన్ - అట్టి కొమార్తెను, అసమసౌభాగ్యములు - సమానములేని యదృష్టములు, మీఱన్ అతిశయించునట్టుగా, ఒసఁగుము -ఇమ్ము.

సీత—చేపట్టినట్టిదిట్టకు, చేతబూనిన బలవంతునకు, అనగా ఎక్కు బెట్టిన వానికి, శ్రీరామునకు శేషము సమానము.

క. ధారాళ సుధారాశి సు

ధారా లసమాన సూక్తి ♦ తతుల మునీంద్రుం

డీరీతి దెల్పి తద్రచి

తారాధన తృప్తుఁడై ర ♦ యంబున జనియెన్. 77

టీ. మునీంద్రుఁడు - మునిశ్రేష్ఠుఁడగు నారదుఁడు, ధారా...తతు లన్, ధారాళ - ధారారూపమగు, సుధారాశి - అమృతసముద్రమందలి సు - సౌభాగ్యమగు, ధారా - ప్రవాహములవలె, లసమాన - ప్రకాశించు చున్న, సూక్తి - మంచిమాటల యొక్క, తతులన్ - సమూహములను, ఈ రీతిన్ - ఈ ప్రకారముచేత, తెల్పి - తెలియఁజేసి, తదర్చి — తృప్తుఁడు: రతన్ - అతనిచేత, రచిత - చేయఁబడిన, ఆరాధన: -పూజచేతను, తృప్తుఁడై- తృప్తిఁబొందినవాఁడై, రయంబునన్ - వేగముచేత, చనియెన్ - వెళ్ళెను.

క. అని సూతజుండు పలుకన్
విని మది ముదముదయ మొంద ♦ విజ్ఞాన కళా
ఘనమానసుఁడగు శౌనక ।
ముని యుత్తర చరిత మడుగ♦మొనసి తివురటన్. 78

టీ. అని సూతజుండు పలుకన్ - అని సూతపుత్త్రుఁడు చెప్పఁగా విని, మదిన్ = మనస్సునందు ముద ముదయమొందన్ = సంతోషము పుట్టగా విజ్ఞా: కళా = శాస్త్రముల యొక్క, పరిణతియందు ఘన = గొప్ప మాన సుఁడగు-మనస్సుగల శౌనకముని, ఉత్తర చరితము = తరువాతి కథను అడుగన్ = అడుగుటకు, మొనసి = ప్రయత్నించి, తివురుటన్ = అటు, కోరును.

శా. లక్ష్మీశపాదతలాంకకుంకుమకృతా♦లంకారలంకారణా ।
ట్టక్ష్మాకంపన కృద్ధనుర్గుణ లతా ♦ టంకార టంకారణా ।
లక్ష్మాపన్నశరారి యుష్యవతిఖే ♦ లజ్జాలలజ్జాలసో ।
త్పక్ష్మాక్షు వ్రజ సుందరీమదన చిం ♦ తాపారతాపారతా.

టీ లక్ష్మీ......లంకార - లక్ష్మీ=లక్ష్మీదేవి యొక్క. పాదతల- పాదప్రదేశమునను, అంక - చిహ్నమగు, కుంకుమ - కుంకుమచేతను, కృత-

చేయఁబడిన, అలంకార — అలంకారముగలవాఁడా. లంకా...టంకార; లంకా - లంకాపట్టణ మండలి, రణ - యుద్ధమందైన, అట్ట - బురుజులపై యిండ్లయొక్క, క్ష్మా - భూమియొక్క, కంపన - ఖండనమును, కృత్ - చేయుచున్న, ధనుః - ధనుస్సుయొక్క, గుణలతా - తీగవంటివారియొక్క, టంకార - ధ్వని విశేషముకలవాఁడా. (అనఁగా రామావతారమం దీయన యొక్క ధనుష్టంకారము వినఁబడగానే లంకాపట్టణమండలి యుద్ధభూమి లోని అట్టళ్ళు (బద్దలువారి పోయెనని తాత్పర్యము) టంకారణాలక్ష్మాపన్న శరారి యుద్వ్యవతి ఖేఽజ్జాల......లజ్జాలసో......తాపారతా. లజ్జా - లజ్జచేతను, అలస - మందమగు, ఉత్పక్ష్మ - ఎత్తఁబడిన రెప్పలుగల, అక్ష - నేత్రములు గల, (అనఁగా నివ్వెరపోయి చూచుచున్న వారనుట) వ్రజసుందరి - గొల్ల చేడియలయొక్క, మదన - కామముయొక్క, చింతా - విచారముచేతనైన అపార - హద్దులేని, తాప - తాపమందు, అరత - ఇష్టములేనివాఁడా.

ప్రతిచరణార్ధ విపరివృత్తకందము.

మాలాలక్ష్యలలామా
సాలావిరసాపహాప ♦ సారవిలాసా
స్యాలాంగమంగళాస్య
శాలాపదసాధితాధి ♦ సాదపలాశా. 80.

టీ. మాలాలక్ష్యలలామా - మాలా - మాలికారూపముగా, లక్ష్య - చూడఁదగిన, లలామా - అలంకారము గలవాఁడా, సారా...విలాసా— సాల - (రలలకును భేదముచే సార అనియగును) శ్రేష్ఠులయిన, అవిరస - విరసులు కానివారిని. అపహ - కొట్టివేయువారియొక్క (అనఁగా సరసుల నిరాకరించు వారనుట) అపసార - త్రోసివేయుటయందు, విలాసముగలవాఁడా, స్యాలా...శాస్య. స్యాలా - బావమఱఁదియగు చంద్రుని

యొక్క, అంగ - శరీరము వలె. మంగళ - శుభమయిన, ఆస్యా - ముఖము గలవాఁడా, శ్యాలా...పలాశా, శ్యాలా - పర్ణశాలలు, పద - స్థానముగల ఋషులయొక్క, సాధిత - మనోవ్యథతోఁ గూడుకొనుటచేతను, అధఃపాదిం- పొందఁబడిన నాశనముగల, పలాశా — రాక్షసులుగలవాఁడా (అనఁగా ఋషులు మనోవ్యథలతో కూడుకొన్నవారలగుటచేత వారి మనోవ్యథ తీర్చు- టకయి విష్ణువు రాక్షసులను నశింపఁజేసెననుట.)

విశే- ఈ పద్యము వెనుకనుండి చదివినను గూడ ముందునుండి చదివినట్లే యుండును.

ముక్తపదగ్రస్త ఉత్సాహము.

సింధురాజకన్యకా వి ♦ సీమకామమంధరా
మంధరాద్రిమంథలబ్ధ ♦ మణ్యుపేతకంధరా
కంధరావళీసమాన ♦ క్రమకాంతిబంధురా
బంధురారచక్రచక్ర ♦ పాలితాగ్ర్యసింధురా. 81

టీ. సింధు...మంధరా, సింధురాజకన్యకా-లక్ష్మీదేవియందు, విసీమ- హద్దులేని, కామ - కోరికచేతను, మంథరా - మందమైనవాఁడా, మంధరాద్రి...కంధరా. మంధరాద్రి - మంధరపర్వతముచేతను, మంథ - మథించుటచేత, లబ్ధ - పొందఁబడిన, మణి - కౌస్తుభమణితోడ, ఉపేత-కూడుకొనిన, కంధర -కంఠముగలవాఁడా! కంధరా.. బంధురా, కంధర - మేఘముల యొక్క, ఆవళీ - పఙ్క్తితోడను, సమాన - తుల్యమగు, క్రమ - మనోహరమగు, కాంతి — కాంతిచేతను, బంధురా - అతిశయమయినవాఁడా, బంధురార... సింధురా, బంధుర - దట్టమగు, అర — అంచులయొక్క, చక్ర సమూహముగల, చక్ర - సుదర్శనముచేత, పాలిత — ఏలఁబడిన, అగ్ర్య — శ్రేష్ఠమగు, సింధురా — ఏనుఁగుగలవాఁడు.

ముక్తపదగ్రస్తము. పంచచామరము.

పరాపరార్థవేదిభావ ♦ భావనైకగోచరా
చరాచరాత్మభూతభూత ♦ జాతదేహభాసురా

సురాసురాధి రాజవంద్య ♦ సుందరాధరాధరా
ధరాధరాధరీక్రియాని ♦ దానధైర్యతత్పరా. 82

టీ. పరాపరా...... గోచరా, పరాపరా — వ్యక్తావ్యక్తములయిన అర్థ — వస్తువులను. వేది — తెలిసిన మునులయొక్క, భావ — భావమందలి. భావన — ధ్యానమునను, ఏక — ముఖ్యముగా, గోచరా — తెలియువాఁడా, చరాచరా.........భాసురా, చరాచరా — జంగమస్థావరములను, ఆత్మ భూత — ఆత్మయగు, భూత — భూతములయొక్క, జాత — సమూహమును యెడు, దేహ — దేహముచేతను, భాసురా — ప్రకాశించుచున్నవాఁడా. సురాసురా—వంద్య. సురాసుర - దేవతలయొక్కయు రాక్షసులయొక్కయు అధిరాజ — అధిపతులను, వంద్య — నమస్కరించఁదగినవాఁడా, సుందరా — సుందరుఁడా ధరాధరా - భూమిని ధరించినవాఁడా, ధరాధరా — పర్వతము యొక్క, అధరీక్రియ — క్రిందుగాఁ జేయుటను, నిదాన — ఆదికారణమగు, ధైర్య — ధైర్యముచేత, తత్పరా — ప్రసిద్ధుఁడగువాఁడా.

గద్య.

ఇది సర్వతంత్రస్వతంత్ర సకలభాషావిశేష కవితాధరంధుర ప్రతిదిన
ప్రబంధ పరమేశ్వర శ్లేషయమక చక్రవర్తి బిరుదాంక తిరుమల
బుక్కపట్టణ శ్రీనివాసతాతాచార్యతనయ, శ్రీరంగనాయ
చార్యదీక్షితసుత, పితృవ్య శ్రీనివాసార్యకృపాకటాక్ష
లబ్ధ సకలపాండిత్య తర్కాలంకార వాగీశ్వర బిరు
దాంక వేంకటాచార్య ప్రణీతంబయిన
యచలాత్మజాపరిణయం బను
శ్లేషప్రబంధంబు నందుఁ
బ్రథమాశ్వాసము.

---



# అచలాత్మజా పరిణయము.

## ద్వ్యర్థి ప్రబంధము.

### ద్వితీయాశ్వాసము.

---

క. కాసార మహీ సార ని
వా సాది మునీంద్ర హృదయ ♦ వారిజ రచిత
శ్రీ సారసవాసా పరి
హాసాది విలాస వేంక ♦ టాచలవాసా. 1

టీ. కాసార — శ్రీ, కాసార - సరస్సులయొక్క, మహీ- భూముల యందు, సార - శ్రేష్ఠమగు, నివాస - ఉనికిగల, ఆది - మొదటివారగు, మునీంద్ర - మునిశ్రేష్ఠులయొక్క, హృదయవారిజ - మనఃపద్మములచేతను, రచిత - చేయఁబడిన; శ్రీ-శోభగలవాఁడా. సారసవాసా - విలాసా, సార సవాసా - లక్ష్మీదేవియొక్క, పరిహాసాది - పరిహాసము మొదలుగాఁగల విలాస - విలాసములు గలవాఁడా, వెంకటాచలవాసా - తిరుమలయందు నివాసముగలవాఁడా.

ఆ. అవధరింపవయ్య ♦ యఖిల కథాభిధా
నా తత నయుఁ డంత ♦ సూత తనయుఁ

డనియె శౌనకునకు ♦ నరవింద బృంద స
న్మధు రసోపమాన ♦ మధుర సూక్తి. ౨

టీ. అవధరింపవయ్య - చిత్తగించవయ్యా, అంత - అంతట. అఖిల... నయుఁడు. అఖిలకథా - సమస్త చరిత్రల యొక్కయు, అభిధాన - చెప్పుట చేత, ఆతత - విస్తారముగు, నయుఁడు - నీతిగల, సూత తనయుఁడు - సూతుని కుమారుఁడగు నుగ్రశ్రవుఁడు, శౌనకునకున్ - శౌనకమునికి, అర వింద...సూక్తిన్. అరవింద - పద్మముల యొక్క, బృంద - సమూహము యొక్క, సత్ - సౌగంధ్యముగు, మధుర - మకరందరసము, ఉపమాన - సామ్యము గల, మధుర - తియ్యనగు, సూక్తిన్ - మంచిమాటలచేతను అనియెన్ - చెప్పెను.

క. సురమహిమాఢ్యుఁ డతండటు
సురముని నంపించి యంత ♦ సుదృగావళితో
సరసి యుపవనమునం దా
సరస వన విహారమునకు ♦ సంకల్పించెన్. ౩

పా—సురమహిమాఢ్యుఁడు. సురమ - మంచిశోభగల, హిమ - మంచుతోడ, ఆఢ్యుఁడు - కూడుకొన్న, ఆతండు - ఆహిమవంతుఁడు, అటు - ఆ ప్రకారము, సురమునిన్ - నారదమహామునిని, అంపించి - పంపించి, అంత - అంతట, సుదృగావళితోన్. సుదృక్ - స్త్రీలయొక్క, ఆవళితోన్ - పఙ్క్తితో, అరసి - చూచి, ఉపవనమునందు - ఉద్యానవనము నందు, ఆ సరసన్ - ఆదగ్గఱ, వనవిహారమునకున్ - వనవిహారము చేయుటకు, సంకల్పించెన్ - ఉద్దేశించెను.

సీత --సురమహిమాఢ్యుఁడు - దేవతామహిమతోఁ గూడిన, ఆతండు ఆజనకుఁడు, సుదృగావళితోన్, సుదృక్ - విద్వాంసుల యొక్క, ఆవళి

శోభిల్లన్ - ప్రకాశించుచున్న, ఆసర, సవన, విహారములకున్, ఆసర - అంతటను వ్యాపించెను
సవన - యజ్ఞము యొక్క, విహారములకున్ - చేయుటకు, సంకల్పించెన్ -
సంకల్పమును జేసెను.

ఆ. సూత్రపట్టినట్లు ♦ శోభిల్లు నాభూమి
నప్సరస్సు లింత ♦ టంత టమర
నతివిహారక్లృప్తి ♦ నాయాజనులొనర్ప
నద్రీంద్రుఁడంత ♦ హర్షమొందె. 4

టీ. పా—సూత్రపట్టినట్లు - సూత్రమును పట్టినట్లుగా, శోభిల్లు - ప్రకాశించుచున్న, ఆ భూమిన్ - ఆ భూమియందు, అప్సరస్సులు - అప్సరస్త్రీలు, ఇంతటంతటన్ - ఇక్కడ నక్కడ, అమరన్ - ఒప్పునట్లుగా, అతివిహారక్లృప్తిన్, అతి విహార - అత్యంత క్రీడల యొక్క, క్లృప్తిన్ - రచనను, ఆయాజనులు - ఆయామనుష్యులు, ఒనర్పన్ - చేయఁగా, అద్రీంద్రుఁడు - ఆ పర్వతరాజు, అంతన్ - అంతట, హర్షమొందెన్ - సంతోషించెను.

పీత—అప్సరస్సులు - ఉదకసరస్సులు, అతివిహారక్లృప్తిన్. అతివిహార - అత్యంతమయిన యజ్ఞక్రియలయొక్క, క్లృప్తిన్ - రచనను, ఆ - అట్టి, యాజలు - ఋత్విక్కులు, ఒనర్పన్ - చేయఁగా, అద్రీంద్రుఁడు - ఆరాజు, శేషము సమానము.

క. ఆయన యాజ్ఞానుస్మృతిన్
డాయుచునాగరమణుల్ జ ♦ డతఁదొలఁగంగా
నాయత నవ సుధ నాగెత్తి
చాయను ఋషభమ్ములమర ♦ సవరించు తరిన్. 5

టీ. పా-ఆయన - ఆహిమవంతునియొక్క ఆజ్ఞానుస్మృతిన్ - సెలవుప్రకారము డాయుచున్ - సమీపించుచు, నాగరమణుల్ - నాగ - పర్వతముల

సంబంధిములగు, రమణుల్ - స్త్రీలు, జడత - మాంద్యము, తొలఁగంగాన్ - పోఁగా, ఆయత...సుధన్, ఆయత - విస్తారమయిన, నవ — నూతనమైన, సుధన్ - అమృతమును, అగాటి - ఆఁగట్టి, (ఇచటునింతకంటె వేఱుగనర్థము తోఁచదు. ఈ యర్థమున నీశబ్దము గ్రామ్యముగానున్నది. కవితాత్పర్యమేమో తెలియకున్నది.) చాయను - నీడచేత, ఋషభమ్ములు - ఓషధి విశేషములు, అమరన్ - ఒప్పునట్లుగా, సవరించుతఱిన్ - తీరుచున్న సమయమందు, పస్వాశ్రమముల స్త్రీలు అమృతపానముచేఁ గలిగినంత యానందమును గలిగించు నీడలుఁగలుగునట్లుగాఁ దీవపొదలు చక్కఁగా నిటునటు సవరించుచున్నారని తాత్పర్యము.

సీత— ఆయన - ఆజనకునియొక్క, యాజ్ఞానుస్మృతిన్ - యాజ్ఞ యజ్ఞసంబంధియగు, అనుస్మృతిన్ - అనుసరణముచేత, నాగరమణుల్ - పట్టణపుజనులలో శ్రేష్ఠులు, ఆయతన వసుధన్ - ఆయతన - యజ్ఞశాలయొక్క, వసుధన్ - భూమియందు, నాగేటిచాయను, నాగేటి - నాగటియొక్క, చాయను = వెంబడిని, ఋషభమ్ములు - ఎద్దులు, అమరన్ - ఒప్పునట్లు సవరించుతఱిన్ - కూర్చుసమయమున.

క. ఉన్మదనమితాస్త్రంబుల
సన్మహిమ నరుల్ భయప్ర ♦ సంగంబున మీ
రన్మేటి యతఁడు విహరిం
పన్మహిలసమాన గర్భ ♦ భాసుర యయ్యెన్. 6

టీ. పా— ఉన్మ...మహిమన్, ఉత్ = ఉన్నతములైన, మదన-మన్మథునియొక్క, మిత-పరిమితములైన, అస్త్రంబుల=ఆయుధములయొక్క, సన్మహిమన్ - గొప్పదార్ఢ్యముచేత, భయప్రసంగంబునమీరన్ - భయసంబంధముచే నొప్పఁగా, మన్మథుఁడు కొద్దిబాణములు వేసినను, (అనఁగా మన్మథుఁడు లోకమున విజృంభించియున్నాడని తాత్పర్యము) మేటి=గొప్పవాఁడగు, అతఁడు- ఆ హిమవంతుఁడు, విహరింపన్ - వనవిహారము జేయుఁగా, మహిల-ఆయన

భార్యయగు మేనక, సమానగర్భభాసురయై - తగిన గర్భముచేఁ బ్రకాశించు చున్నది, అయ్యెన్.

సీ— ఉన్మద— మహివన్. ఉన్మద - ఉద్రేకించినట్టి, సమిత - మితములేని ఇట్టి సమర్థముగల శబ్దములకు "సుప్సుపా" అను యోగవిభాగము చేత సమాసముగా వున్న వలోపములేదు. అస్త్రంబులన్ - ఆయుధములయొక్క సన్మహిమన్ గొప్ప దార్ఢ్యముచేత, అరుల్ - శత్రువులు, సహించన్ - యజ్ఞపరియత్నముఁ జేయఁగా. మహి - భూమి. లసమాన గర్భభాసురయయ్యెన్ - ప్రకాశించుచున్న గర్భముచేఁ వెలుఁగుచున్నదయ్యెను.

ఉ. కాంతారక్షితిమంజులాంగలసదు ♦ త్కర్షంబునన్ భూమిభృ
త్కాంతుండంతమహావిహారమలరం ♦ గన్యాగమాకాంక్షన
త్యంతంబాపఁగఁదోఁచె నమ్మహిళస ♦ ద్గర్భంబునన్ భృంగసం
క్రాంతాంభోజమనంగమందసముద ♦ గ్రచ్ఛాయలింపారఁగన్

టీ. పా— కాంతారక్షితిన్ - అరణ్యభూమియందు, మంజుల - త్కర్షంబునన్. మంజుల - మృదువగు, అంగ - అవయవములయొక్క, లసత్ - ప్రకాశించుచున్న, ఉత్కర్షంబునన్ - అతిశయముచేత, భూమిభృత్కాంతుండు - పర్వతరాజు, అంత - ఆసమయమందు, మహావిహారము - గొప్ప వనవిహారము, అలరన్ - ఒప్పఁగా, కన్యాగమాకాంక్షన్ - స్త్రీసంభోగమందలి కోర్కెను, అత్యంతంబాపఁగ - మిక్కిలి యూపుఁజేయఁగా, అమ్మహిళ - ఆ మేనక, సద్గర్భంబునన్ - మంచిగర్భోత్పత్తిచేత, భృంగసంక్రాంతాంభోజమనంగ - తుమ్మెదలచేత వ్యాప్తమగు పద్మమో యనునట్లు, మంద... ఛాయలు, మంద - మెల్లగా, సముదగ్ర - ఉన్నతములగుచున్న, ఛాయలు - కాంతులు, ఇంపారఁగన్ - శోభిల్లఁగా, దోఁచెన్ - కాన్పించెను.

సీత— మంజు...త్కర్షంబునన్, మంజు - తిన్ననైన, లాంగల - నాగటి యొక్క, సత్ - మంచిదియగు, ఉత్ - ఉన్నతమగు, కర్షంబునన్ - దున్న

డముచేత, భూమి భృత్కాంతుండు - రాజశ్రేష్ఠుఁడగు జనకుఁడు, మహావిహారమలరంగన్ - గొప్పయజ్ఞప్రయత్నమొప్పఁగా, యాగము - యజ్ఞము, అత్యంతంబాపఁగ = మిక్కిలి నిలుపఁగా, అమ్మహిన్ = ఆ భూమియొక్క, లసద్గర్భంబునన్ = ప్రకాశించుచున్న లోనిప్రదేశమందు, భృంగసంక్రాంతాంభోజమనునట్టుగా, మందసము = పెద్దపెట్టె, ఉదగ్రచ్ఛాయలన్=గొప్ప కాంతులు, ఇంపారఁగన్=మనోహరముగానుండఁగా, తోఁచెన్ = కాన్పించెను.

వ. అంత.

శా. కప్పుల్ వీడ్కొనభూధరేంద్రములసౌ♦కర్యంబునన్మించుచోఁ
దప్పెం గాంత పయోధరమ్ములకన♦ద్ధారావతారమ్ముపై
నుప్పొంగెం జెలువారు నిర్మలత స♦ద్వ్యోమధ్యభాగంబునం
దొప్పెన్ హంసగతుల్ ప్రియంకరశర♦ద్యోగంబు రానంతలోన్

తా— కాంత = మేనకయొక్క, పయోధరమ్ములు = స్తనములు, కప్పుల్ = నలుపులు, వీడ్కొనన్=చూడఁగా, భూధరేంద్రములు = పర్వతశ్రేష్ఠములయొక్క, సౌకర్యంబునన్ = సౌలభ్యముచేత, (అనఁగా సౌందర్యముచేత) మించుచోన్ = అతిశయించుచుండఁగా, చూచుకములు నలుపెక్కి కొండల సౌందర్యమును మీరుచుండఁగా నని తాత్పర్యము. కనద్ధారావతారమ్ము = కనత్ = ప్రకాశించుచున్న, హార = ముత్తెపు సరులయొక్క, అవతారమ్ము = ప్రదేశము, పైన్ = మీఁద, తప్పెన్ = వదలిపోయెను. గర్భిణియౌటచేత హారాద్యలంకారముల తీసివేసినదనుట, చెలువారు = శోభిల్లుచున్న, నిర్మలత = నైర్మల్యము. సద్వ్యోమధ్య భాగంబునందున్ = అప్పటి నడుమునందు, ఉప్పొంగెన్=అతిశయించెను. నడుము బలిసినదనుట. హంసగతుల్=అంచలవంటి నడకలు, ఒప్పెన్ = తగెను, నడకలు మందమైనవనుట. అంతలోన్ = ఈలాగుచున్నంతట, శరద్యోగంబు = శరదృతు సంబంధము, రాన్ = రాఁగా, పైపద్యముతో నన్వయము.

టీ. భ్రమరీ...పంకజంబు, భ్రమరీ=ఆడుతుమ్మెదలయొక్క, కదంబ=సమూహముయొక్క, సంభ్రమ = త్వరవలన, రీణ=జారిన, (అనఁగా కదలినట్టి) గరుత్=రెక్కలయొక్క, అదభ్ర = తక్కువగాని, మరీచి = కిరణములచేత, మలిన = నల్లనయిన, పంకజంబు = పద్మములు గలది. ప్రదళీ...పాండురంబు. ప్రదళీభవత్ = బ్రద్దలగుచున్న, ధర్మకదళీమహీజ = బంగారపు అనఁటిచెట్ల యొక్క, (అనఁగా గర్పూరపు టనఁటులయొక్క) సంపత్ = సమూహము యొక్క, ఆలీన=అణఁగినట్టి. కర్పూర - కప్పురముచేత, పాండురంబు - తెల్లనిది. కమలా... ఖస్థలంబు. కమలా = శోభను, కర - చేయునట్టి, ఆదర్శ - అద్దములవలె, విమలాయిత - నిర్మలములై యాచరించుచున్న, సమస్త - శేవము లేని, కమలాకర = ఉదయమునకు గనులగు మేఘములుగల, ఖస్థలంబు = ఆకాశస్థలము గలది. ధవళా...రాజికంబు. ధవళాయిత = తెల్లనై యాచరించుచున్న, మృణాళ - తామర తూండ్లయొక్క, లావనక్రియా=త్రుంచుట యందలి, ఆర్జవ = తిన్నదనమందు, లాలస = ఆసక్తములగు, మరాళ రాజికంబు = హంసపజ్క్తులుగలది. అంబర...భాసురంబు. అంబర శ్రీ = ఆకాశ లక్ష్మియొక్క, నితంబబింబ = పిరుదును, అవలంబి = పట్టుకొనిన, పాండురతర మిక్కిలి తెల్లనైన, పట్టసిచయ - పట్టుబట్టలయొక్క, శిఖండ = అంచుల యొక్క, విభ్రమ = విలాసములయొక్క, భ్రమకర = భ్రాంతిని జేయుచున్న, భ్రమత్ = తిరుగుచున్న, అఖండ=విస్తారమగు, శుభ్రజలద = తెల్లమేఘములచేత, భాసురంబు = ప్రకాశించుచున్నదియై, ఆశరద్వాసరంబు = ఆశరత్కాల దినము, ఒప్పెన్ = తగెను.

చ. పొలిచెను యజ్ఞకృద్విసర ♦ ముల్ సరముల్ నవ పుండరీక ప
జ్క్తుల గదళీవ్రజంబు మడు ♦ గుల్ మడుగుల్ హిమవాలు
కాప్తి వర్తిలె వనజాతమందుఁదన ♦ రెన్నవమాలిక లంచ
బాలికల్ । లలి సుమనస్స్థితుల్ నెలఁత ♦ లన్ లతలం దళు
కొత్తె నత్తఱిన్. 10

టీ. అత్తఱిన్ - ఆశరద్వ్యాసపువనంబు, యజ్ఞకృద్విసరముల్ యజ్ఞకృత్ జన్నములుజేసినవారియొక్క, విసరముల్ - సమూహములును, సరముల్ - పువ్వులదండలును, పుండరీక - వెల్లగొడుగులయొక్కయు, తెల్లపద్మముల యొక్కయు, పఙ్క్తులన్ = వరుసలచేత, పొలిచెన్ = ప్రకాశించెను, కదలీ సుమాంకుల్ కదలీ = కప్పూరపు అరఁటులయొక్క, ప్రజము = గుంపుయొక్క, సుమాంకుల్ = పరిశుభ్రతలును, సుమాంకుల్ = సరస్సులును. హిమవాలు కాప్తిన్. హిమవాలుకా = కర్పూరముయొక్కయు, చల్లని యిసుకయొక్క యు, ఆప్తిన్ = పొందుటచేత, వర్తిలెన్ - ప్రవర్తించెను, ఉన్నవియనుట. వనజాతమందున్ = వన - అడవులయొక్కయు, నీళ్ళయొక్కయు, జాత మందున్ - సమూహమందు. వనమాలికలు - క్రొత్తపూదండలును, అంచ బాలికల్ - హంసపిల్లలును, తనరెన్ - ఒప్పెను, లలిన్ - సొంపుగా, సుమనస్స్థితుల్ = సుమనః = మంచి మనస్సులయొక్కయు, పుష్పముల యొక్కయు, స్థితుల్ - ఉంకువలు, నెలఁతలన్ - స్త్రీలయందును, లత లన్ - తీగలయందును, తళుకొత్తెన్ - ప్రకాశించెను,

మ. నవఖండంబుల నుండు వార్షికగతిం◆దంభోళి సంభిన్న పక్షా
వనినిం బద్ధము సేయ మేల్కని సరో◆జాక్షుండు నేమింప నా
ర్జవితం ద్వష్ట ఘటింపనిం పెసఁగు పెన్◆రౌప్యాపుఁ బుత్తికల కా
ళి వతెన్ ధారుణి నచ్చు టచ్చుట మరా◆ళీపాళి వ్రాలెన్వడిన్

టీ. నవఖండంబులనుండన్ - మునుపే తొమ్మిదితుకలుఁగాఁ నుం డఁగా, వార్షికగతిన్ = వర్షాకాలసంబంధియగు నడకచేత, దంభోళిసంభిన్న పక్షులచేఁ బద్ధలైనది, ఔ - అయినట్టి. అవనిన్ = భూమిని, బద్ధము సేయున్ అతుకుటకు, సరోజాక్షుండు - విష్ణువు, మేల్కని - నిద్రనుండి లేచి, నేమిం పన్ - ఆజ్ఞాపింపఁగా, ఆర్జవితన్ - చిన్నదనముచేత, త్వష్ట - విశ్వకర్మ, ఘటింపన్ - అతుకుటకు, ఇంపెసంగు - మనోహరములగు, పెన్ - పెద్దది

యగు. రౌప్యంపు - వెండియొక్క, ఉత్కలకాళివలెన్ - ఉంకప్రపాదుల గుంపువలె, ధారుణిన్ - భూమియందు, మరాళీపాళి - ఆడుహంసలపఙ్క్తి - వడిన్ - త్వరచేత, అచ్చటచ్చటన్ - అక్కడక్కడ, వ్రాలెన్ - దిగెను.

చ. సరసులకొప్పెఁ బద్మినుల • సంగతి హస్తినులాక్రమింపఁగా
సరసతరుల్ సుగంధిక ర • జస్స్థిరధీరత రూఢిఁ బట్టిరా
సరసతముల్ కళోన్నతుల • సంగతిఁ జిత్రిణులాట తేటఁగాఁ
బరఁగెను గానఁ గానలకు • బర్వెను జాతులరీతు లత్తఱిన్.

టీ. సరసులకున్ = రసయుక్తులైనవారికి నని యర్థము, కొలఁకులకని యర్థాంతరము. పద్మినుల సంగతి = పద్మినీజాతిస్త్రీలతో స్నేహమని యర్థము. తామరపాదుల కలయికయని యర్థాంతరము. సరసుతరుల్ = మిక్కిలి సరసులని యర్థాంతరము. హస్తినుల = హస్తినీజాతిస్త్రీలని యర్థము. ఆడేనుఁగులని యర్థాంతరము. ఆక్రమింపఁగన్ = ఆవరింపఁగా, సుగంధి... ధీరతన్, సుగంధి = మంచి వాసనగల, కరజ = గోరుయొక్క, స్థిర = స్థిరమైన, ధీరతన్ = ధైర్యముచేతనని యర్థము. అనఁగా నఖక్షతముల నుంచుటచేతనైన ధైర్యమని తాత్పర్యము. సుగంధిక = మంచివాసనగల, రజః = పరాగముల చేత స్థిరా - నిబ్బరమగు ధీరతన్ - మనోహరత్వముచేత (ధియం రాతీతి ధీరః - తస్య భావః ధీరతా.) రూఢిఁ బట్టిరి = నిరూఢిని వహించిరి, (ఇచట వృత్త పదమందు మహాదర్థక (క్రియాచింత్యము) ఆ సరసతముల్ = సరసతరులకంటె మిక్కిలి సరసులని యర్థము. సరసములగు రాత్రులని భావము. కళోన్నతుల, కళా = మన్మథకళలయొక్క, ఉన్నతుల = ఔన్నత్యముల యొక్క అని యర్థము. చంద్రకళల యౌన్నత్యము యొక్క యని యర్థాంతరము. చిత్రిణులాట = చిత్రిణీజాతిస్త్రీలాటయని యర్థము. చిత్రమగు నీయాట యని యర్థాంతరము. తేటగన్ = స్పష్టముగా, పరగెను గాన = ఒప్పెను గనుక, కానలకున్ = అడవులకు, అత్తఱిన్ = ఆశరదృతువునందు,

...ల్లికాద్యాది స్త్రీజాతులయొక్క యని యర్థము. మాలతీలతలయొక్క ...ంతరము. రీతులు = పద్ధతులు, పర్వవె = వ్యాపింపవా.

...లికాపుగుబ్బెతల ♦ క న్మొరపించి బిరాన రాజసా
...విలసిల్లు పెల్లువను ♦ లందుఁ బదుం పొలంగుం గిశోరకీ
...ళి యభ్ర లక్ష్మి శర ♦ దాగన సద్రవిలక్షణాన్వితల్
...న ద్రావిడాంగనల ♦ కైవడిఁ జెండులుగొట్టిరో యనన్.

... కావలికాపుగుబ్బెతల = కాపున్న శూద్రస్త్రీలయొక్క, కన్ = ...మొరపించి = మురుగుపెట్టి, బిరానన్ = త్వరగా, రాజసాలైవిలసిల్లు = ...పేలై ప్రకాశించుచున్నట్టి, పెల్లువను లందున్ = గొప్పవనములయందు, ...వళి = పిల్లచిలుకలగుంపు, అభ్రలక్ష్మి = ఆకాశలక్ష్మియును, శరదం... శరదృతువను స్త్రీయును, సద్రవిలక్షణాన్వితల్, సత్ = యోగ్యములగు, ...ఉదలక భేదముచేత ద్రవిడులయొక్క, క్షణ = ఉత్సవముతోడ, ... = కూడినవారు అని అర్థము. సత్ = యోగ్యములగు, రవి = ...డ నెడు, ... క్షణ = చిహ్నముతో, అన్వితల్ = కూడినవారు, ... = కనుక, ద్రావిడాంగనలకైవడిన్ = ద్రవిడస్త్రీలవలె, చెండులుం ...యనన్ = బంతులుగొట్టినారో యనునట్లుగా, పదున్ = ఊరుకును, ...న్ = ఎగిరిపోవును.

...మలేందీవర కర్ణికార కదళీ ♦ కల్హార పుంజల్క పుం
...లంజిత్ర మొనర్చికూర్చుచు శర ♦ చ్చంద్రాస్య పెన్బూమిప
...ము నందు స్నభమంటు సంబర మణి ♦ లీలామణీ దీపముం
...మధుద్వేషికి నెత్తుటారతిఘటిం ♦ చె న్నిద్ర మేల్కాంచుచోన్.

...టీ. శరచ్చంద్రాస్య = శరత్కాలమను స్త్రీ, కమలేం...పుంజము... ...కమల = పద్మములయొక్కయు, ఇందీవర = కలువలయొక్కయు, కర్ణి...

కార = కొండగోగుఁబువ్వులయొక్కయు, కదళీ=అనంటిపువ్వులయొక్కయు, కల్హార = ఎఱ్ఱగలువలయొక్కయు, కింజల్క = కేసరములయొక్క, పుంజములన్=సమూహములచేత, చిత్రమొనర్చి = (ముగ్గులు బెట్టినట్లు) చిత్రవర్ణము గలదానిఁగాఁజేసి, కూర్చుచున్ = సంధానముఁజేయుచు, పెన్భూమిపళ్ళెమునందున్ = పెద్దదియగు పుడమియనెడు పాత్రయందు, నభమంటి = ఆకాశము నంటిన, అంబర...దీపము, అంబర మణీ=సూర్యుఁడనెడు, లీలా = విలాసార్థమగు, మణిదీపము = మాణిక్యదీపమును, ఉంచి=యేర్పఱచి, మధుద్వేషికిన్ = విష్ణుమూర్తికి, మేలౌంచువోలెన్ = (శరదృతువుగావున) నిద్రలేచునప్పుడు, ఎత్తుటారతి = పైకెత్తునారతి, ఘటించెన్ = కూర్చెను.

సీ. మల్లికా రమణీమ ♦ తల్లికా స్మితములు
శరదభ్రముధవాంగ ♦ చారు రుచులు
భవుక ప్రబోధమా ♦ ధవలోచన చ్ఛవుల్
కాండ నిర్మలతార్థ ♦ కతక రజము
లుద్భవిష్య త్పంక ♦ జోదార చకచకల్
బహునదీ విరహాతి ♦ పాండురుచులు
భువనమోహన రతి ♦ ధవ కీర్ణ భసితముల్
దిక్కామినీ క్షౌమ ♦ ధృతి విహృతులు
గీ. నీల నీరద నిజ యాస ♦ నిర్మలిక
రణ చణ పురందర కృతాంగ ♦ రాగ ధవళ
రంజక ద్రవక చ్ఛాయ ♦ పుంజకములు
కపురపు రజంబులు వనాళిఁ ♦ గరము నెరసె. 15

టీ మల్లి...స్మితములు = మల్లికా = మల్లెతీగలనెడు, రమణీమతల్లికా = ఉత్తమ స్త్రీలయొక్క, స్మితములు=నవ్వులైనట్టియు, శర...రుచులు,

శరత్ = శరదృతువునను, అభ్రిముభగ = ఐరావతము యొక్క, అంగ=శరీర ముయొక్క, ఛాయ = సుందరములగు, రుచులు = కాంతులయినట్టియు, శుభక...నవుల్ = శుభక = శుభకరములగు, ప్రబోధ= మెలుకువగల, మాధవ= విష్ణువుయొక్క, లోచన నేత్రములయొక్క, ఛవుల్ = కాంతులైనట్టియు, కాండ...రజములు, కాండ, ఉదకములయొక్క, నిర్మలతార్థ = నైర్మల్యము కొరకైన, కతక = చిల్లగింజలయొక్క. రజములు = గుండలైనట్టియు, ఉద్భవి చకచకల్ = ఉద్భవిష్యత్ = పుట్టంబోవుచున్న, పంకజ = పద్మములయొక్క, ఉదార=విస్తారములగు, చకచకల్ =చాకచక్యములైనట్టియు, బహు...రుచు లు, బహు = విస్తారమైన, నదీ ఏళ్ళయొక్క విరహ = వియోగముచేతనైన, అతిపాండు = మిక్కిలి తెల్లనైన, రుచులు = కాంతులైనట్టియు, భువన... భసితముల్ = భువన = లోకములకు, మోహన - మోహపెట్టుటకైన, రతి ధవ = మన్మథునిచేత, కీర్ణ = చల్లఁబడిన, భసితముల్ = భస్మములైనట్టియు, దిక్కామినీ - దిక్కులనెడు స్త్రీలయొక్క, చేల - తెల్లచీరయొక్క, ధృతి = ధరించుట చేతనైన, విహృతులు = విహారములు, నీలనీరద... పుంజక ములు, నీల = నల్లనైన, నీరద = మేఘములనెడు, నిజ - స్వకీయములగు, యాన = వాహనములయొక్క, నిర్మలీకరణచణ = శుభ్రముచేయుట నేర్చిన, పురందర = ఇంద్రునిచేత, కృత - చేయఁబడిన, అంగరాగ - మైపూత యైన, ధవళ - తెల్లనగు, రంజకద్రవక - రజింపఁజేయు ద్రావకముయొక్క, ఛాయ - కాంతులయొక్క, పుంజకములు - సమూహములైనట్టియు, కపురపు రజంబులు - కర్పూర ధూళులు, వనాళిన్ - వనపఙ్క్తియందు, కరము - మిక్కిలి నెరసెన్ - వ్యాపించెను.

చ. కల మవ నావ నార్థ హరి ♦ కల్పిత మంచ కులమ్ములందు వ
ర్తిలు చెలువల్ నెరా పస ♦ రు దేరెడు పైరులమీఁదకీరప

ఙ్క్తులముకుచాయలం దెలసి ♦ తోలినఁ దత్కణిశాలిశాలిచం
చులఁ జను చొప్పు దిక్సతుల ♦ చొక్కపు పచ్చల హెచ్చు
లొయనన్. 16

టీ. కమల—కులమ్ములందున్. కలమవన - వరిచేలయొక్క, అవ నార్థ - కాచుటకొరకు, పరికల్పిత — రచింపఁబడిన, మంచ — అరపల యొక్క, కులమ్ములందున్ - సమూహములయందు, వర్తిలు - ఉన్నట్టి చెలువల్ - స్త్రీలు, నెరా పసరు దేరెడు - మిక్కిలి పచ్చనైన, పైరులన్ - చేలను, మీరు - అతిశయించెడు కీరపఙ్క్తులన్ - చిలుకల గుంపులను, ముకు చాయలన్ - (ఎఱ్ఱని) ముక్కుకాంతులచేత, తెలసి-(వేరుగఁగుచేత) సెలిఁగి తోలినన్ - కొట్టివేయఁగా, తత్కణి... చంచులన్. తత్ -ఆవరిచేలయొక్క, కణిశ - ఎన్నులయొక్క, అలి - పఙ్క్తితోడ, శాలి - ఒప్పుచున్న, చంచూలన్ - ముక్కులతోడ, చనుచున్ - (చిలుకలు) పోవుచు, దిక్సతుల - దిక్కులను స్త్రీలయొక్క, చొక్కపు - సొగసైన, పచ్చల, (అలంకారముల యందలి) మరకతమణులయొక్క, హెచ్చులొయనన్ - అతిశయము లేమో యనునట్లుగ, ఒప్పున్ - ప్రకాశించును.

శా. నాళీకాళి మృణాళికా కబళనా ♦ నంద న్మరాళాంగనా
పాళుల్ వ్యోమతలంబునం బ్రతిఫలిం ♦ పంబోలునాఁగా నభః
పాళీ పాండు పయోదపఙ్క్తులు సరః ♦ పాళిం బిసాళింపఁగాఁ
బోలు న్నాఁగ దివిన్ భువిన్ సిత ఘన ♦ మ్ముల్ హంసలుం
బాటిలెన్. 17

టీ. నాళి...పాళుల్, నాళీక = పద్మములయొక్క, ఆళి = పఙ్క్తి యొక్క, మృణాళికా - తూఁడ్లయొక్క, కబళన - తినుటచేత, ఆనందత్ - సంతోషించుచున్న, మరాళాంగనా - హంసస్త్రీలయొక్క, పాళుల్ పఙ్క్తులు. వ్యోమతలంబునన్ = ఆకాశమందు, ప్రతిఫలింపంబోలునాఁగాన్ =

ప్రతిబింబించెనో యనునట్లుగాను, నభః...పఙ్క్తి, నభఃపాళీ - ఆకాశ ప్రదేశ మందలి పాండు = తెల్లనైన, పయోదపఙ్క్తులు = మేఘపఙ్క్తులు సరః పాళిన్ - మడుగుల వరుసయందు, పిసాళింపఁగాఁబోలున్నాఁగన్ - వ్యాపిం చఁబోలు ననునట్లుగా, దివిన్ - ఆకాశమందును, భువిన్ - భూమియందును, సితఘనమ్ముల్ = తెల్లమేఘములును, హంసలున్ = అంచలును, పాటిలెన్ = ఒప్పెను.

చ. కలశజ సంగతిన్ ఘనులు ♦ గాంచిరి శుద్ధత యీడ నింక మా
కలరదు మించుటంచుఁ గర ♦ కావళితో మణి చాప రేఖతో
నిల డిగు చంచలాళియన ♦ నింపగు జాజి సరాలు వ్రేల వ
ర్తిల లలనౌఘ ముత్తఱిం బు♦రిం గొను చందురు కావితీవులన్.

టీ. కలశజసంగతిన్ = అగస్త్యునిస్నేహముచేత, (అనఁగా నగస్త్యోద యముగుటచేత) ఘనులు - మేఘములు (గొప్పవారనియును) శుద్ధతన్ = నైర్మల్యమును గాంచిరి = పొందిరి. (ఇచట మహాదర్థము వివక్షాధీనము) ఈడన్ = ఇక్కడ, మించుట = అతిశయించుట, మాకున్ = మాకు, అలరదు = ఒప్పదు. అంచున్ = అనుచు, కరకావళితోన్ = వడఁగండ్ల వరుసతోడను, మణిచాపరేఖ తోన్ = ఇంద్రధనస్సుయొక్క రేఖతోడను, ఇలన్ = భూమియందు, డిగు = దిగినట్టి, చంచలాళియనన్ = మెఱపుపఙ్క్తులో యనునట్టి, లలనౌఘము = స్త్రీసమూహము, అత్తఱిన్ = ఆశరత్కాలమందు, జాజిసరాలు = జాజిపూవుల దండలు, వ్రేలన్ = వ్రేలుచుండఁగా, గొను = ధరించిన, చందురుకావితీవులన్, చందురుకావి = సిందూరపురంగుగల బట్టయొక్క, తీవులన్ = శోభచేత. పురిన్ = పట్టణమందు, వర్తిలున్ - సంచరించును.

మ. కతకం బొక్కటి కుంభసంభవుఁడనం ♦ గల్పించి కాదంబినీ
శత కాదంబర పంకిలాభ్ర జలధిన్ ♦ సాధు ప్రసాదంబుఁగా—

ర్చి తగెం గాలము భూమి నేకరణిమిం ♦ చెం దేటలీ స్యందినీ
తతి నా నేల నదే నదిన్ నదిని లే ♦ దా బింబ దంభంబునన్.

టీ. కాలము = సమయము. కుంభసంభవుఁడవన్ = అగస్త్యనక్షత్ర మనునట్టి, కతకంబు=చిల్లగింజ, ఒక్కటి=ఒకదానిని, కల్పించి=కూర్చి, కాదం... జలధిన్. కాదంబినీ=మేఘపఙ్క్తుల యొక్క, శోకః=వానల యొక్క, ఆడంబర ఆటోపముచేత, పంకిల=బురద గలిగిన, అభ్ర=ఆకాశమనెడు, జలధిన్=సముద్రమందు. సాంద్రప్రసాదంబునన్=మంచి నైర్మల్యముతో, కూర్చి=చేసి, తగెన్=ఒప్పెను. భూమిన్=పుడమియందు, స్యందినీతతిన్=నదీసమూహమందు, తేటలు - నైర్మల్యములు, ఏకరణిమించెన్ - ఎట్లు వ్యాపించెను. నా నేల - అననెందుకు, అదే - ఆ యాకాశనైర్మల్యమే, నదిన్ నదిని - ప్రతినదియందు, బింబదంభంబునన్ - ప్రతిబింబమిషముచేత, లేదా - ఉండదా.

శా. చక్రంబొక్కటి శింశుమారము భ్రమిం ♦ చం గ్రౌంచపున్
రాట్నమం
దాక్రీడ త్సిత వారివాహ నివహ ♦ వ్యాకీర్ణ తూలాళి ని
ర్వక్రంబై వెలయన్ శరజ్జరఠచేఁ ♦ బర్హాయ పర్యస్తమా
ప్రక్రామ్య త్సితతంతుపఙ్క్తులనఁగా ♦ న్రాలున్నభ్రాశావళుల్.

టీ. శింశుమారము - (గ్రహములకాధారమై మేరువునందు తిరుగుచున్న) శింశుమారమను పేరుగల. చక్రంబు - చక్రము, ఒక్కటి - ఒకటి, భ్రమించన్ - తిరుగఁగా, క్రౌంచపున్ రాట్నమునన్ - క్రౌంచపర్వతమను నూలు వడుకునట్టి యంత్రమందు, ఆ క్రీడ......తూలాళి ఆ క్రీడతో అంతట తిరుగుచున్న, సిత - తెల్లని, వారివాహ - మేఘముల యొక్క నివహ - సమూహమనెడి, వ్యాకీర్ణ - ఏకిన, తూల - దూదిపింజల యొక్క - ఆళి - పఙ్క్తి, నిర్వక్రంబై - వంకర లేనిదై, వెలయన్ - ఒప్పఁగా, శరజ్జరఠచేన్

శరత్కాలమను ముసలివానిచేత, పర్యాయపర్యస్తమా - క్రమముగా వడకం బడునట్టి, ప్రకాశి...పక్షులనంగాన్ - ప్రకాశిష్యత్ - ఆరంభమగుచున్న, సిత - తెల్లనైన, తంతు - దారముల యొక్క, పక్షులనంగాన్ - వరుసలో యనునట్లుగా, మరాళికలుల్ - హంసపక్షులు, వ్రాలెన్ - వ్యాపించును.

శా. మంచుల్తాపన తాప వీతికెదురం ♦ పన్లేక సప్తచ్ఛదో
దంచత్పర్ణములాశ్రయించిరని ర ♦ వ్యబ్జాళిగంధంబు పు
ష్పాంచచ్చోరులుదొంగిలించిరవియా ♦ నాకారభేదంబునం
గొంచున్మించెననన్వనింగపురముల్ ♦ ఘూర్ణిల్లెవాతాహతిన్

టీ. మంచుల్ - హిమములు, తాపనతాపవీతికిన్, తాపన - సూర్యసంబంధియగు, తాప - వేడిమియొక్క, వీతికిన్ - జిగికి, ఎదురింపన్ లేక ఎదుర్కొనలేక, సప్త పర్ణములు, సప్తచ్ఛదా - ఏడాకుల యరంటి చెట్ల యొక్క, ఉదంచత్ - ప్రకాశించుచున్న, పర్ణములు - ఆకులు, ఆశ్రయించి పొంది, రవి...గంధంబు రవి - సూర్యుని యొక్క, పక్ష్య - పక్షమందైన, అబ్జ - పద్మముల యొక్క, అళి - పఙ్క్తి యొక్క, గంధంబు - పరిమళమును, పుష్పాంచచ్చోరులు - పువ్వులనెడు ఒప్పుచున్న దొంగలు, (అరంటిపువ్వుల లో నుండు దొంగలను పేరుగల యవయవములనియు ధ్వని) దొంగిలించి, - అపహరించి, అవియాన్ - వాసనలియ్యంగా, ఆకారభేదంబునన్ - వేఱు రూపుచేత, కొంచున్ - స్వీకరించుచు, మించెననన్ - వ్యాపించెనో యనునట్లు, వన్ - వనమందు, కపురముల్ - కర్పూరములు, వాతాహతిన్ - సుడిగాలి తాకుచేత, ఘూర్ణిల్లెన్ - తిరిగెను.

వ. ఇప్పగిది నొప్పుచు నింపుసాధించు నప్పురమ యోగ్యావసథమున.

టీ. ఇప్పగిదిన్ - ఈ విధముగా ఒప్పుచున్ ఇంపు నుపాదించు - సొగసు కూర్చు అప్పరమ సౌభాగ్యకసుధమున - మిక్కిలి శుభమైన మందిరమున.

క. మందసము న్ముఖగర్భము
నందమ్ముగ నమరఁదెలిసి ♦ యల సవనల స
న్మందిరమున నిల్పిరి మే
నం దనివి దలిర్పనంత ♦ నవలా సకులున్. 22

టీ. పా—అంత - అంతలో, నవలా సకులున్. నవలా - మేనక యొక్క, సకులున్ - చెలికత్తెలును, మందసము న్ముఖగర్భమున్, మందా - మెల్లగా, సముున్ముఖ - ఉజ్జృంభించిన, గర్భమున్ - చూలాలను, అందమ్ముగన్ - సొగసుగా అమరన్ - ఒప్పుగా, తెలిసి - ఎఱిఁగి, మేనన్ - మేనకను, తనివిదలిర్పన్ = తృప్తియొసంగునట్లుగా అలసనవన - అల్లుకు తీగలుగల వన - వనమునందలి లసన్మందిరమున్ - వనమందొప్పుచున్న గృహమందు నిల్పిరి - ఉంచిరి.

సీత—అంత - అంతటలో, నవలా సకులున్ - నూతనులగు నాట్యము సేయువారు (అనగా ఆటలాడువారు) ఉత్సవములు జేయువారని యర్థము, మందసమున్ - పెట్టెను, ముఖగర్భమున్=ఎదుటి భాగమును లోనిభాగమును అందమ్ముగ నమరన్ = సొగసుగా నొప్పుఁగా, తెలిసి, ఎఱిఁగి, మేనన్ - శరీరమందు, తనివి దలిర్పన్ = తృప్తియొసఁగునట్లు, అల సవన లసన్మందిరమునన్ - ఆయజ్ఞ సంబంధమగు ప్రకాశించుచున్న యింటియందు, నిల్పిరి - ఉంచిరి.

క. మందసము దీయమానా
నందంబులు పొంగి పొరల ♦ నవలాలిత ని

స్పంద మతులును మహీభృ
త్సందేశకరుల్ బొసంగ ♦ సవరించునెడన్. 23

పా — నంద......నందంబులు, మంద = మెల్లగా, ఉదీయమాన= పుట్టుచున్న, ఆనందంబులు = సంతోషములు, పొంగి=అతిశయించి, పొరలన్=వ్యాపించఁగా, నవలాలు=స్త్రీలును, ఇత నిష్పందమతులు, ఇత = పొందబడిన, నిష్పంద=చంచలించని, మతులు = బుద్ధిగలవారును, మహీభృత్సందేశకరుల్ = హిమవంతుని వార్తాహారులును, పొసంగన్ = అనుకూలముగాఁ సవరించునెడన్=పనులుజేయుసమయమున.

సీ — ఉదీయ...నందంబులు, ఉదీయమాన=పుట్టుచున్న; ఆనందంబులు = సంతోషములు, పొంగి = అతిశయించి, పొరలన్ = వ్యాపించఁగా, నవలాలిత...మతులు, నవ = క్రొత్తగా, లాలిత = గౌరవించఁబడినట్టియు, నిష్పంద = చంచలించని, మతులు = బుద్ధులుగల, మహీభృత్సందేశకరుల్ = రాజుయొక్క వార్తాహారులు, మందసము = పెట్టె, పొసంగన్ = అనుకూలముగా, సవరించునెడన్ = సర్దుబాటుచేయునపుడు.

క. అకలుషమతి మహీభృత్పతి
ప్రకటోత్సుక భావ లబ్ధిఁ ♦ బర్వంగను మే
నక మనసు హితముగాఁగ
న్యక నొయ్యారముల కుప్ప ♦ నచటం గనియెన్. 24

పా — అకలుషమతి=నిష్కలుషబుద్ధిగల, మహీభృత్పతి=హిమవంతుని భార్యయగు, మేనక = మేనకాదేవి, ప్రకటోత్సుక భావలబ్ధిఁ బర్వంగను = అతిశయమగు వేడుక వ్యాపించఁగా, మనసు హితముగా=మదికిష్టముగా, ఒయ్యారములకుప్పన్=విలాసములప్రోవైన, కన్యకన్-పిల్లను, అచటన్ = ఆ గృహమందు, కనియెన్=కనెను.

సీ— మేనక=మేనకయనుఅప్సరస, (ఇదిఇతరాప్సరసల కుపలక్షణము) ప్రకటోత్సుకభావలబ్ధి=అతిశయమగుసంతోషముచేత, పర్వంగను=(లక్షణచే) నాట్యముచేయఁగా, అప్సరసలాడఁగాఁ నని యర్థము. మహిభృత్పత్ని=జనకుని భార్య, అచటన్ = ఆపెట్టెయందు, కనియెన్=చూచెను. శేషము సమానము.

క. తత కనక నగ ప్రభవసు
మతి గర్భమునం జనించు ♦ మాన్యము కన్యన్
క్షితిభృత్పతి గన్గొని తా
నతి కుతుక తరంగితాంత ♦ రంగతఁ బొంగెన్. 25

పా— క్షితిభృత్పతి = పర్వతశ్రేష్ఠుఁడగు హిమవంతుఁడు, కనకనగప్రభవ-మేరుపర్వతమువలనఁ బుట్టిన, సుమతి-మంచిమనసుగల మేనకయొక్క-గర్భమునన్-కడుపునందు, జనించు - పుట్టినట్టి, మాన్యన్ - పూజ్యురాలగు, కన్యన్=కన్నియను, కన్గొని-చూచి, తాన్-తాను, అతికుతుకితాంతరంగతన్-మిక్కిలి సంతోషముచేత బొంగుచున్న యంతఃకరణము గలుగుటచేత, పొంగెన్=ఉబ్బెను.

సీ— క్షితిభృత్పతి-రాజశ్రేష్ఠుఁడగు జనకుఁడు, కనకనగప్రభన్-బంగారుపర్వతమువంటి కాంతి గలిగినట్టియు, సుమతి గర్భమునన్-భూమియొక్క-గర్భమునందు, జనించు-పుట్టినట్టియు, శేషము సమానము.

సీ. జన్నంపు టన్నంపు ♦ టన్నువల్ వెదజల్లు
పారిజాత లతాంత ♦ ధార లలరె
నాధార లాధార ♦ మై ధారుణిఁ జనించు
భృంగమ్ముల రవప్రప ♦ సంగ మెసఁగె
నారవం బారూఢ ♦ గౌరవంబై మీఱ
గంధగంధవహాను ♦ బంధ మొప్పె

నాగాలిలోఁగొని ♦ నాగాలికుంతలల్
పాడుపాటలకోటి ♦ పరిఢవిల్లె

గీ. కన్యధన్య యనన్య సా ♦ మాన్య మాన్య
వర్ణ్య లావణ్య సౌవర్ణ ♦ వర్ణవర్ణ
నీయ గాత్రి ధరిత్రి జ ♦ నించినట్టి
కల్య కల్యాణ సుముహూర్త ♦ ఘటిక యందు. 26

టీ. ధన్య - ధన్యురాలైనట్టియు, అనన్య—గాత్రి- అనన్యసామాన్య-ఇతరులకు సాధారణముగాని, మాన్య - పూజింపఁదగినట్టియు, వర్ణ్య -వర్ణింపఁదగినట్టియు, లావణ్య - శరీరతాళతళ్యము చేతను, సౌవర్ణ - బంగారు సంబంధియగు, వర్ణ — కాంతిచేత. వర్ణనీయ — వర్ణింపఁదగిన, గాత్రి — శరీరముగల, కన్య - చిన్నది, ధరిత్రిన్ — భూమియందు, జనించినట్టి - పుట్టిన, కల్య... యందు, కల్య - ప్రశస్తమైన, కల్యాణ - శుభప్రదమైన, సుముహూర్త — మంచిముహూర్తముయొక్క, ఘటికయందు - గడియయందు, జన్నంపు టన్నంపు టన్నువల్ - యజ్ఞములేయన్నముగల దేవతలస్త్రీలు, వెదజల్లు - విరియఁజల్లిన. పారి...ధారలు, పారిజాతలతాంత - పారిజాత పుష్పములయొక్క, ధారలు - ధారావర్షములు, ఎసఁగెన్ - ఒప్పెను, ఆధారలు - ఆధారలే - ఆధారమై - జీవనాధారముగానుండి, ధారుణిన్ - భూమియందు, చరించు - తిరుగుచున్న, భృంగమ్ముల - తుమ్మెదలయొక్క రవప్రసంగము - ధ్వనిప్రసక్తి, ఎసఁగెన్ - ఒప్పెను, ఆరవంబు - ఆధ్వని, ఆరూఢగౌరవంబై - ప్రసిద్ధగౌరవముగలదియై, మీఱన్ - అతిశయింపఁగా, గంధ... బంధము, గంధ - పరిమళముతోఁగూడిన, గంధవహ- గాలియొక్క, అనుబంధము - సంబంధము, ఒప్పెన్ ఎసఁగెను, ఆగాలిన్- ఆవాయువును-లోఁగొని - లోఁబరచుకొని, నాగాలి కుంతలల్ - నాగకన్యలు, పాడు — గానముచేయునట్టి, పాటల - గానములయొక్క, కోటి - విస్తారము, పరిఢవిల్లెన్ - ప్రవర్తించెను.

ఉ. క్రొన్నెలదాల్పు వేల్పు జిలుగుల్ వెలుగుల్ గొన లేటిఘోటిజే
కొన్న వలంతి పిల్లగమి ♦ క్రొల్లగఁ బిల్ల మిఱెమ్ములేసె మేల్
జన్నములందు నగ్గితిగ ♦ సప్తరసజ్ఞలు తృప్తిఁ గాంచె మిం
చె న్నెరతేట తామరలు ♦ చెంగలువల్ గల యేటికోటులన్

టీ. క్రొన్నెల...జిలుగుల్, క్రొన్నెలఁదాల్పు - శ్వేతచంద్రుని ధరించిన, వేల్పు - దేవునియొక్క, (సాంబమూర్తియొక్క) జిలుగుల్ సన్నపుబట్టలైన దిక్కులు, వెలుగుల్ గొనన్ - నిర్మలత్వము నొందఁగా, లేటి... గమి - లేటిఘోటిన్ — లేడియను గుఱ్ఱమును చేకొన్న — స్వీకరించిన, వలంతి - నేర్పరి, (గాలి) యొక్క. పిల్లగమి - బాలుర సమూహము, (అనఁగా మందమారుతములు) పిల్లమిఱెమ్ములు - తలక్రిందుగా వేసెడుగంతులు ఏసెన్ - వేసెను, మేల్ జన్నములందు - మంచియజ్ఞములయందు, అగ్గితిగ - త్రేతాగ్నులయొక్క, సప్తరసజ్ఞలు - ఏడునాలుకలు, తృప్తిఁ గాంచెన్ - తృప్తిఁ జెందెను, తామరలు - పద్మములును చెంగలువల్ - ఎఱ్ఱకలువలును, కల - ఉన్నట్టి, ఏటికోటులన్ - బహునదులయందు, నెరతేట - మిక్కిలి నైర్మల్యము, మించెన్ - అతిశయించెను, ఆమెజన్మకాలమందు సమస్తమును సుఖముగానుండెనని తాత్పర్యము.

చ. జనకుఁడు ధన్యుఁ గన్యయయి ♦ చంపకపుష్ప సువర్ణ గౌరి స
ద్వనరుహపాణి బుట్టినయు ♦ దారముహూర్తమునన్ముదంబునన్
ఘనమణులంబరంబులు న ♦ గాధముగా నొసఁగంగ నేగతిన్
దినమణి యంబరంబునొగి ♦ నిల్చెనొకో యనిరార్యులత్తఱిన్.

తా— జనకుఁడు-తండ్రియగు హిమవంతుఁడు, ధన్య - ధన్యురాలైనట్టియు, చంపక...సువర్ణ, చంపకపుష్ప-సంపెంగ పువ్వులవంటి, సువర్ణ-మంచి రంగుగలిగినట్టియు, (పార్వతినల్లనిదైనను శ్లేషబలమునుబట్టి స్త్రీ సామాన్యము

నరుఁ జేసినవర్ణన జేసినాఁడు) సద్వనరుహపాణి - శ్రేష్ఠమగు, వనరుహ - పద్మమువంటి, పాణి — హస్తములు గలిగినట్టియు, గౌరి = గౌరీదేవి, కన్యయయి - కొమార్తెయయి, పుట్టిన - జనించిన, ఉదారమహూర్తమునన్ - గొప్ప ముహూర్తమందు, ఘనమణులు, గొప్పరత్నములును, అంబరంబులు - బట్టలును, అగాధముగా, మిక్కిలిగా, ఈశబ్దమునకు శ్లేషార్థమైనను లక్షణచే నీయర్థము గలిగినది, ఒసంగన్ - ఇయ్యఁగా, ఆత్తఱిన్ - ఆసమయమందు, ఆర్యులు - పెద్దలు, దినమణి - సూర్యుఁడును, మాణిక్యవిశేషమని యుఁ దోఁచుచున్నది. అంబరంబును = ఆకాశమును, వస్త్రమని యుఁ దోఁచుచున్నది. ఒగిన్ - అనుకూలముగా, ఏగతిన్ - ఏప్రకారము, నిల్చెనో - ఆగెనో, అనిరి = అని పల్కిరి.

సీ—జనకుఁడు - జనకమహారాజు, చంపక...గౌరి = చంపకపుష్ప-సంపెంగ పువ్వులవలెను, సువర్ణ - బంగారమువలెను, గౌరి - పచ్చనిదియైన, సద్వనరుహపాణి = మంచిపద్మము హస్తమందుఁగల లక్ష్మీదేవి, శేషము సమానము.

క. ఎక్కువగఁ బండ్ల నమరిన
చక్కెరలకు మూఁగు శాఖి♦సద్విజ వర్గం
బక్కన్య జనన మహమున
నక్కజముగ నొప్పె భావు♦కాకర ఫణితిన్. 29

టీ. ఎక్కువగన్ - మిక్కిలిగా, పండ్లన్ - ఫలములతో, అమరిన - కలసిన, చక్కెరలకున్ - పంచదారలకు, మూఁగు - క్రమ్మిన, శాఖిసద్విజవర్గంబు. శాఖి - వేదశాఖాధ్యయనముఁజేసిన, సద్విజ - మంచిబ్రాహ్మణుల యొక్క, వర్గంబు - సమూహము, అక్కన్య - ఆ చిన్నదానియొక్క, జనన మహమునన్ - జన్మోత్సవమందు, అక్కజమునన్ - ఆశ్చర్యముగా, భావుకాకరఫణితిన్, భావుక - శుభమునకు, ఆకర - స్థానమగు, ఫణితిన్ = రీతిచేత, ఒప్పెన్ - ప్రకాశించెను.

వ. అంత.

క. చిలుకల పిలుకల పలుకుల
కులుకులు గల మెలకువలకుఁ ♦ గొఁలత ఘటించుఁ
జిలిబిలిపలుకులు బలుకుచు
జలకము కలికికి నొసర్పఁ ♦ జనిరి పొలంతుల్. 50

టీ. చిలుకల పిలుకల - చిలుక పిల్లలయొక్క, పలుకుల - వాక్యములయొక్క కులుకులుగల - విలాసములుగల, మెలకువలకున్ - ప్రౌఢిమలకు, కొఁరతఘటించు - లోటుకలిగించు, జిలిబిలిపలుకులు - మృదువాక్యములు, పలుకుచున్ - ఉచ్చరించుచు, పొలంతుల్ - స్త్రీలు, కలికికిన్ - ఆచిన్నదానికి, జలకము, అభ్యంగనము ఒసర్చన్ - చేయుటకు, చనిరి - వెళ్ళిరి.

చ. క్రమమునఁ బ్రత్న రత్న పరి♦కర్మితనిర్మల శాత కుంభ కుం
భములసుగంధగంధ రస ♦ బంధురమైన నఖంపచోదకం
బమరిచి బాలకుం జలక ♦ మార్చివడిందలయొత్తిపొత్తులం
గొమరులు మించ నుంచి రళి♦కుంతలలంతయులంతదీర్పఁగన్.

టీ. అంత - అంతట, అళికుంతలలు - తుమ్మెదలవంటి ముంగురులుగల స్త్రీలు, అలంత - ఆయాసము, తీర్పఁగన్ - పోగొట్టుటకు, క్రమమునన్, వరుసగా, ప్రత్న...కుంభములన్. ప్రత్న - పురాతనములగు, రత్న - మణులచేత, పరికర్మిత - అలంకరింపఁబడిన, నిర్మల - శుభ్రములైన, శాతకుంభ బంగారముయొక్క, కుంభములన్ - ఘటములచేత, సుగంధ...బంధురమైన. సుగంధ - మంచి పరిమళముగల, గంధరస - గంధోదకముచేత, బంధురమైన, అతిశయించిన, నఖంపచోదకము - గోరువెచ్చనీరు, అమరిచి-సిద్ధపరచి బాలకున్ - చిన్నదానికి, జలకమార్చి - నీళ్ళుబోసి, వడిన్ - త్వరతో,

[ప]డియెత్తి - కుడిచి, పొత్తులన్ - సన్నబుడ్డలయందు, కొమరులు మించన్ - శోభలతిశయించ, ఉంచిరి - పరుండఁబెట్టిరి.

క. అతుల నతసీతసుమనః
ప్రతినిధి యనిగుణము లేరు ♦ పడ నలసవన
క్షితిలోనంబికనా దమ
హితముగనొక పేరఁబలికి ♦ రింతులు బాలన్. 32

టీ. పా— ఇంతులు = స్త్రీలు, బాలన్ = ఆ చిన్నదానిని, అతులన్ = సామ్యము లేనిదాని, అతసీతసుమనః ప్రతినిధి = అతసీ = అవిసెచెట్టు చేత, ఇత, పొందఁబడిన, సుమనః పుష్పములకు, ప్రతినిధి = సమానురాలు అని - అని, గుణము లేరుపడన్ = రంగులు స్పష్టముగాగా, అసల...లోన్, అలస = వృక్షవిశేషముల యొక్క, వనక్షితిలోన్ = వనభూమిలో, అంబికనాన్ = అంబికయనఁగా, దమహితముగన్ = శాంతగుణమునకు హితమగునట్లుగా, ఒకపేరన్ - ఒక నామము చేత, పలికిరి = వచించిరి.

సీత— ఇంతులు బాలన్, అతులనతన్ = సామ్యము లేమంటుటచేత, సీత = సీత సుమనః ప్రతినిధి = దేవతాసమానురాలు, అని గుణము లేరుపడన్, అల = అట్టి, సవనక్షితిలోనన్ = యజ్ఞభూమిలోపల. పికనాదమహితముగన్ - కోకిలధ్వని చేతఁబూజితమగునట్లు ఒక పేరఁబలికిరి.

వ. ఆక్రమంబున.

సీ. పల్లవమ్ములకు సం ♦ పల్లవమ్ములు గూర్చు
పదములొక్కటి రెండు ♦ బొదువ నేర్చె
విశ్వంబుఁగబళించు ♦ విశ్వంభరుని నామ
మనుచుఁ దా నత్తత్త ♦ యనఁగ నేర్చె
బంగారు చవికలో ♦ శృంగారవతులతో

గురివింజ కుప్పలు ♦ గూర్చ నేర్చె
వీణావతులఁగూడి ♦ రాణామృతము సద్వి
పంచికా తతుల వా ♦ యించ నేర్చె

గీ. బాలికారత్న మనుదిన ♦ వర్ధమాన
కాంత శృంగార నటన రం ♦ గంబులైన
యంగముల నంగజునిచేతి ♦ యసమ హేతి
సానఁబట్టిన రీతి ము ♦ చ్చటల హెచ్చె. 38

టీ. బాలికారత్నము = బాలికలయందు శ్రేష్ఠురాలగు నాచిన్నదిం పల్లవమ్మలకున్ = చివుళ్ళకు, సంపల్లవంబులు = మతికొంత శోభలను, కూర్చు = సంధానముఁ జేయునట్టి, పదములు = అడుగులు, ఒకటి రెండు కాలదిగా, పాదువ నేర్చెన్ = ఉంచ నేర్చెను - విశ్వంబుఁ గబళించు = ప్రపంచమును దినునట్టి, విశ్వంభరుని = విష్ణువు యొక్క, నామమనుచున్ = పేరని తలంచుచు, అత్తత్తయనఁగ నేర్చెన్ - అత్త, యత్తయనుట నేర్చెను - "అదభక్షణే" అనుధాతువు పైని తృన్ప్రత్యయముగాని, తృచ్ప్రత్యయము గాని చేర్చఁగా అత్తృ అని ప్రాతిపదికము అయినది - ఆపైని "డాబవిధాతాద్రేరుః, దీర్ఘాణాంవాహ్రస్వస్యాత్" అను నాంధ్రవ్యాకరణ సూత్రములచే నీ రూపము (అత్త) వచ్చెను - బంగారు చవికెలోన్ = బంగారపు మండపము లోపల, శృంగారవతులతోన్ = స్త్రీలతోడ, గురివింజకుప్పలు = క్రీడావిశేషములు, కూర్చ నేర్చెన్ = ఆడనేర్చెను, వీణావతులన్ = వీణలు గల స్త్రీలను, కూడి = కలసి, రాణామృతము = అమృతము వంటిధ్వని, రణ శబ్దే అనుధాతువుపై ఘఞ్ ప్రత్యయముఁ జేర్చఁగా రాణ అను రూపము వచ్చినది. సంగీతమని యర్థము, సద్విపంచికాతతులన్ = మంచి వీణాసమూహములయందు, వాయించ నేర్చెన్ = ధ్వనించ నేర్చెను, అనుదిన...రంగంబులైన, అనుదిన = ప్రతిదినమందు, వర్ధమాన = వృద్ధిఁబొందు

చున్న, కాంత = మనోహరమైన, శృంగారనటన = శృంగార నాట్యమునకు, రంగంబులైన = రంగస్థలములైన అనఁగా శృంగార ప్రచురములయిన, అంగములన్-అవయవములచేత, అంగజునిచేత = మన్మథుని చేతిలోని. అసమహేతి సమానము లేనికత్తి. సానబట్టిన రీతిన్ = సానపై నూరినట్లుగా, ముచ్చటలన్ = శోభలచేత, హెచ్చెన్ = అతిశయించెను.

క. బాల్యంబు జారె మన్మథ
లౌల్యం బలరారె నంత ♦ లజ్జాసమమై
కాల్యమున నలినికిం బలెఁ
గల్యంబగు జవ్వనంబు ♦ గలికికిఁ బొడమెన్. 34

టీ. కలికికిన్-ఆచిన్నదానికి, బాల్యంబు-బాల్యము, జారెన్-వదలెను, మన్మథలౌల్యంబు-కామునిచేత నయిన చాంచల్యము, లజ్జాసమమై-సిగ్గుతో సమానమయి, (అనఁగా మన్మథలౌల్యమును సిగ్గునుగూడ) అలరారెన్-ప్రకాశించెను, కాల్యమునన్-ప్రాతఃకాలమునందు, నలినికిం బలెన్ -తామరతీగకువలె, కల్యంబగు-మంచిదగు, జవ్వనంబు-యౌవనము, పొడమెన్-అంకురించెను.

చ. కుటిలములయ్యెఁ గోమలికిఁ ♦ గుంతలముల్ బెళుకుల్ కనుం
గవన్ | బుటమరిలెం జనుంగవయుఁ ♦ బోకల రేకలఁ బ్రాకెఁ
బల్కులం | జటుల లలితంబులొప్పెనర ♦ చందురు చందముః
జొదవె మోమునం బొ | ల్కుటగ హాసత్వ ముల్లసిలెఁ ♦ గెంపుల
కెంపు వలిర్చె వాతెరన్. 35

టీ. కోమలికిన్-స్త్రీకి, కుంతలముల్-ముంగురులు, కుటిలములయెన్-వంకగలవయ్యెను, కనుంగవన్-నేత్రద్వంద్వమందు, బెళుకుల్-చాంచల్యములు, పుటమరిలెన్-ఉబ్బెను, చనుంగవయు-కుచద్వంద్వమును, పోకల రేకలన్-

పోకకాయలరీతిని, ప్రాకెన్-వ్యాపించెను, పల్కులన్ - వాక్యములయందు, చటులలితంబులు - చంచములగు విలాసములు. ఒప్పెన్ - ప్రకాశించెను. మోము-ముఖము, (నుమరని తాత్పర్యము) అరచందురు చందమున్-అర్ధచంద్రునిరీతిని, చెందెన్-పొందెను, పొక్కిటన్ - నాభియందు, గహనత్వము-లోతు, ఉల్లసిలెన్-ప్రకాశించెను, వాతెరన్ - అధరోష్ఠమందు, కెంపుల కెంపు-కెంపులయొరుపు, తలిర్చెన్-ఒప్పెను.

ఉ. బాలికయంగరాజ్యమున♦బాల్యపుమంత్రి నిజప్రభావముల్
మూలకుద్రొబ్బ రానతని♦ముంచఁగయౌవనమంత్రినుంచి త
ల్లాలిత మధ్యపుష్టి నఖి ♦ లంబుగ్రహించి మనోజరాజ ను
ద్వేలతఁ గూర్చులిబ్బులనఁ♦దేలెగుచంబులుచంద్రపాలకున్.

టీ. మనోజరాజు-మన్మథుఁడనురాజు, బాలిక - చిన్నదానియొక్క, అంగరాజ్యమునన్-శరీరమనురాజ్యమందు. బాల్యపుమంత్రి - శిశుత్వమనెడు ప్రధాని, నిజప్రభావముల్-తన సామర్థ్యములు, మూలకుద్రొబ్బినన్-మూలకు ద్రోసి వేసిరాగా, అనఁగా బాల్యమందు మన్మథచేష్ట లుండవని తాత్పర్యము. అతనిన్-ఆబాల్యమంత్రిని, ముంచఁగన్-అణచిచేయుంటకు, యౌవనమంత్రిన్-జవ్వనమను ప్రధానిని, ఉంచి-ఏర్పాటుచేసి, తల్లాలితమధ్యపుష్టిన్-నడుము యొక్క-పుష్టిని, మధ్యదేశమందలి యైశ్వర్యమనియు, అఖిలంబు-అంతయును, గ్రహించి-పుచ్చుకొని, అనుద్వేలతన్-అతిశయము లేకుండుటచేత, అనఁగా మెల్లమెల్లగానని యర్థము. కూర్చు-సంధానముఁజేయునట్టి, లిబ్బులనన్-ధనముప్రాతరలన్నట్లుగా, కుచంబులు-స్తనములు, చంద్రఫాలకున్-చంద్రునివంటి లలాటముగల స్త్రీకి, తేలెన్-బయలుదేలెను.

చ. జలజరజంబుఁ జంద్రసుధఁ♦జంచలచామచకచ్చకచ్ఛపుల్
మలయపుగాలిశూలి వన♦మానస ఖంబురు నేచ్చెసూర్చెగ్రొం

దలిరుకటారి వీరుఁడు ద ♦ నర్పఁగఁ జోలుఁబడంతిఁ గానిచోఁ
బలియునె మేన గంధరస ♦ భాస్వర శీత సువర్ణవైఖరుల్.

టీ. క్రొందలిరుకటారి-క్రొత్తచివుళ్ళకత్తిగాఁగల, వీరుఁడు-మన్మథుఁడు, జలజ రజంబున్ - పద్మరాగమును, ఇది పంచభూతములలో భూమ్యంశము, చంద్రసుధన్ - చంద్రునియమృతమును, ఇది జలాంశము, చంచల-మెఱపు యొక్క, చారుచకచ్చకచ్ఛవుల్-సుందరములగు చకచకయను కాంతులును, ఇది తేజోంశము, మలయపుగాలిన్ - మలయపర్వతవాయువును, ఇదివా య్వంశము, శూలి... ఖంబును, శూలి-ఈశ్వరునియొక్క, వన-వనమందలి, మానస - మానససరస్సునందయిన, ఖంబును - ఆకాశమును, ఇది ఆకా శాంశము, ఏర్చి—ఏరి, కూర్చి—కలిపి, పడంతిన్ — ఈ చిన్నదానిని, తనర్పఁగఁబోలున్ - చేయఁబోలును, మనుష్యసృష్టి పంచభూతముల మేళన వలనఁ గలుగును గావున నిట్లుఁ జెప్పఁబడెను. కానిచోన్ - అట్లుగాని యెడల, మేనన్ - శరీరమందు, గంధ...వైఖరుల్ - గంధ - పరిమళము యొక్కయు, రస - అభిరుచియొక్కయు, భాస్వర-ప్రకాశముయొక్కయు ఇదిభావప్రధాన నిర్దేశము - శీత చలువయొక్కయు, సువర్ణ - మంచిరంగు యొక్కయు, వైఖరుల్ - రీతులు, బలియునె - అతిశయించునా ?

సీ. కచభరంబు ఘనాళి ♦ గరిమచే విలసిల్లఁ
గమల విభ్రమరీతి ♦ నమరుఁజూపు
కమల లక్షణ లక్ష్మి ♦ గణియించు మొగ మోష్ఠ
మరుణ బింబపురక్తి ♦ నవఘళించు
సుమన శ్ఛటా హార ♦ సురుచిరంబగు నవ్వు
తాళవృత్తత పమో ♦ ధరము లెనయు

విపుల చక్రిమురీతి ♦ వెలయు నితంబంబు
తారాకృతి వహించుఁ ♦ దత నఖములు
గీ. ఘన మళులు దమ్మి లేళ్ళ రిం ♦ ఖణము లిందు
కమలములు బింబ రవుల శో ♦ ణిమలు సుమము
లమృతమును దాళిఫలము తా ♦ ళ మరి ధరణి
ముత్తెములు భంబు లోనఁగూడె ♦ ముదిత మేన. ౩౮

టీ. కచభరంబు - వెండ్రుకలగుంపు, ఘనాళి గరిమచేన్, ఘన - మేఘ మాలయొక్క, అళి - పఙ్క్తియొక్కయనియు, ఘన - గొప్పవియగు, అళి - తుమ్మెదలయొక్క, అనియు నర్థము. గరిమచేన్ - గొప్పదనముచేత, విలసిల్లున్ - ప్రకాశించును, చూపు - దృష్టి, కమలవిభ్రమరీతిన్ కమల - పద్మములయొక్క యనియు, లేళ్ళయొక్క యనియు నర్థము, విభ్రమ - విలాసములయొక్క, రీతిన్ = క్రమముచేత, అమరున్ - ఒప్పును, మొగము - ముఖము, కమల లక్షణలక్ష్మిన్ - కమల లక్షణ లేడిచిహ్నములుగల చంద్రునియొక్క యనియు, కమల = పద్మములయొక్క, లక్షణ - రీతులయొక్క - యనియు నర్థము. లక్ష్మిన్ - శోభను, గణియించున్ - లెక్కించును, ఓష్ఠము - పెదవి, అరుణ బింబపు రక్తిన్, అరుణ - ఎఱ్ఱనైన, బింబపు - దొండపంటియొక్క, అరుణబింబపు - సూర్యబింబముయొక్క, రక్తిన్ - ఎఱుపును, అవఘళించున్ - తిరస్కరించు నవ్వు. స్మితము సుమనశ్ఛటాహార సురుచిరంబు. సుమనః - పుష్పముల యొక్క, ఛటా - సమూహముయొక్క, హార - మాలికవలెననియు, సుమనశ్ఛటా దేవతా సమూహముయొక్క, ఆహార - భోజనపదార్థమగు నమృతమువలెనని యునర్థము. సురుచిరంబు - మిక్కిలి మనోహరమైనది అగున్ - ఔను. పయోధరములు - స్తనములు. తాళవృత్తత. తాళ - తాటిపండ్లయొక్కయనియు తాళముల యొక్కయనియు నర్థము. వృత్తత - వర్తులత్వమును. ఎనయున్ - పొందును, నితంబంబు - పిఱుదు, విపులచక్రముదీతిన్ - విపుల - విస్తారమైన

చక్రము - బండిగల్లు యొక్క యనియు, విపుల చక్రము - భూచక్రము యొక్క, యనియు నర్థము. ఇది తెలుగు షష్ఠీ సమాసము గావున విపులా శబ్దమునకు హ్రస్వము గలిగెను. రీతిన్ — క్రమము చేత, వెలయున్ - ఒప్పును, తత నఖములు - విస్తారమగు గోళ్ళు. తారాకృతిన్ — తార— ముత్యముల యొక్క యనియు, నక్షత్రముల యొక్క యనియు నర్థము, అకృతిన్ - ఆకారమును, వహించున్ - పూనును, గీతచరణములయందు శ్లేష భంగిచేతఁ నిదివఱకుఁ జెప్పినవస్తువులఁ జెప్పుచున్నాఁడు. ఘనము - మేఘ మును, అళులు-తుమ్మెదలును, తమ్మి-పద్మమును, లేళ్ళు - మృగములయొక్క రింఖణములు - త్రొక్కుపాటులున్ను, గర్వములని తాత్పర్యము. ఇందుకమల ములు-చంద్రపద్మములును, బింబ రవుల - దొండపంటియొక్కయు సూర్యుని యొక్కయు, శోణిమలు - ఎఱుపులును, సుమములు-పుష్పములును, అమృతము ను-సుధయును, తాళఫలము-తాటిపండును, తాళము - వాయించుకొనునట్టి తాళమును, అర—బండిచక్రమును, ధరణి - భూమియును, ముత్తెములు - ము త్యములును, భంగులు = చక్కలును, ముదితమేన్ = చిన్నదాని శరీరమందు ఒనఁగూడెన్ = తాగనించెను.

క. వింటికి సరిబొమ కౌనల
వింటికి సరి దొరక దెంత ♦ విఱువీఁగిన నె
ప్పంటికి నలపంటికి నల
పంటికి నలసాక్షి గుబ్బ ♦ పాలిండ్ల సిరుల్. 39

టీ. బొమ = కనుబొమ, వింటికిన్ = ధనుస్సునకు, సరి = సమానము, కౌను = నడుము, అలవింటికిన్ = ఆకాశమునకు సరి, సమానము, అల సాక్షి = మందములైన నేత్రములు గల చిన్నదానియొక్క, గుబ్బపాలిండ్ల = గుండ్రనైన స్తనముల యొక్క, సిరుల్ = శోభలు, అలపంటికిన్ = ప్రసిద్ధ

మగుఫలమునకును, అలపంటికిఁ బ్రసిద్ధమగు కలశమునకును, ఎంతవిఱవీగినన్ ఎంతగర్వపడినను, ఎప్పంటికిఁ - ఏ కాలమునకును, దొరకవు = లభించవు.

సీ. నీల లీలలు నేలు ♦ బాల వాల భరంబు
పద్మసంపదఁ గాంచుఁ ♦ బడఁతి మొగము
రంభ సంభ్రమ మెంచు ♦ రమణి యూరు యుగంబు
హేమ భూమ వహించు ♦ నింతి కాంతి
శ్యామ కోమల రీతి ♦ సవరించు మెఱుఁగారు
చిత్రరేఖను మించుఁ ♦ బత్రరేఖ
తారసారులగేరుఁ ♦ దరుణి పాద నఖాళి
మినుకుకొమ్మనుమీరు ♦ మెలఁత భుజము
గీ. గాన నీచాన యసమాన ♦ మాన సకల
మానినీ మాననీయ లీ ♦ లానిధాన
మిన్నెలఁత నెన్నగాఁ బన్న ♦ గేశ్వరునకు
భూరి ముఖములు నిర్మింపఁ ♦ బోలు ధాత. 40

టీ. బాల వాల భరంబు = చిన్నదాని కేశసమూహము, నీలలీలలఁ = ఇంద్రనీలముల విలాసములను, విష్ణుభార్యయగు నీలాదేవి యొక్క విలాసములని ధ్వని, ఏలుఁ = శాసించును, పడఁతి మొగము = చిన్నదాని ముఖము, పద్మసంపదఁ - తమ్మియొక్క శోభను, లక్ష్మీదేవి యొక్క శోభనని ధ్వని - కాంచుఁ = పొందును, రమణి యూరు యుగంబు = చిన్నదాని తొడలజోడు, రంభసంభ్రమము = అరటి చెట్టు యొక్క యాటోపమును, రంభయను నప్సరస యొక్క యాటోపమునని ధ్వని, ఎంచుఁ - లెక్కబెట్టును, ఇంతి కాంతి = చిన్నదాని కాంతి, హేమభూమన్ = బంగారము యొక్క గొప్పతనమును, హేమయను నప్స

రసయొక్క గొప్పతనమునని ధ్వని, వహించున్ = పొందును, మెఱుఁగారు-మెఱుఁగైన నూగారు, శ్యామకోమలరీతిన్ - నల్లనికోమలమైన పద్ధతిని, శ్యామయను నప్సరయొక్క కోమలరీతిననిధ్వని, సువరించున్-దిద్దును, పత్రరేఖ-మరి కాపత్రరేఖ, చిత్రితేఖన-చిత్రమైన పద్ధతిచేతను, చిత్రరేఖయనునప్సరసను అని ధ్వని, మించున్-అతిశయించుచు, తరుణిపాదనఖాళి - చిన్నదానిపాదపు గోళ్ళవరుస, తారసౌరులన్-నక్షత్రముశోభను, తారయను బృహస్పతి భార్య యొక్క శోభననిధ్వని, కేరున్-హాస్యముఁజేయును, మెలఁతి భుజము-చిన్న దానిబాహు, మినుకుకొమ్మను - తళుకుగలతీగను, సరస్వతి నని ధ్వని, మీరున్-అతిశయించును, గానన్ కనుక, ఈచాన - ఈ చిన్నది, అసమాన మాన-సమానములేని గౌరవముగల, సకలమానినీ-సమస్త స్త్రీలకును, మాననీయ-గౌరవించఁదగిన, లీలా-విలాసములకు, నిధానము-నిధియైనది, ఇన్నెలతన్-ఈచిన్నదానిని, ఎన్నగాన్-వర్ణించుటకు, ధాత-బ్రహ్మ, పన్నగేశ్వరునకున్-శేషునికి, భూరిముఖములు-చాలానోళ్ళు, నిర్మింపఁబోలున్-చేయఁబోలును.

క. నీలమ్ములు వాలమ్ములు
నీలమ్మల శ్రీలుదేలు ♦ నిగనిగమను దృ
గ్జాలమ్ములు జాలమ్ములు
జాలమ్ముల లీల నేలుఁ ♦ జంద్రాననకున్. 41

టీ. చంద్రాననకున్ = చంద్రునివంటి ముఖముగల చిన్నదానికి వాలమ్ములు = కేశములు, నీలమ్ములు = నల్లనివి, నిగనిగమను = నిగనిగలాడెడు, దృగ్జాలమ్ములు = దృష్టిసమూహములు, జాలమ్ముల = వలలయొక్క జాలమ్ముల = కపటముల యొక్క, లీలన్ = విలాసమున్ను, ఏలున్ = శాసించును.

సీ. కన్నెకన్నులతోడ ♦ వన్నెలెన్నఁగ వచ్చి
సారసమ్ములు నీర ♦ సత్వ మొందె
నాతినేత్రములతో ♦ నీతులాడఁగ వచ్చి
నల్లగల్వలు వేగ ♦ నయము దొలఁగె
కాంత కన్గవతోడ ♦ గరిమఁ బూనఁగవచ్చి
మీనజాలము సుళ్ళ ♦ లోన మునిఁగె
మగువ దృగ్యుగళితో ♦ నిగనిగ ల్గొనవచ్చి
నెలపుల్గుగవలు వ ♦ ర్తిలఁగ నరసె
గీ తమ్ములకుఁ దమ్ము లిందీవ ♦ రమ్ములకు వ
రమ్ములును మీలకుసీమ్మల ♦ నమ్మ లల చ
కోరికలకుఁ గోరికల్ ♦ కొమిరె మేలు
వాలు గన్నులు వర్ణింప ♦ వశ మెవరికి. 42

టీ. సారసమ్ములు - పద్మములు, కన్నె కన్నులతోడన్ - చిన్నదాని నేత్రములతో, వన్నెలెన్నఁగవచ్చి-శోభలెంచుటకు వచ్చి, నీరసత్వము-రసహీనతను, నీటియందునికిననియు, ఒందెన్ - పొందెను, నాతి నేత్రములతోన్ - చిన్నదాని కన్నులతో నీతులాడఁగవచ్చి-నీతులు పలుకగ వచ్చి, ఇందీవరములు వేగన్-త్వరతో, తెల్లవారఁగాననియు, నయము బాసెన్ - అందమును బోఁగొట్టుకొనెను. కాంతకన్గవతోడన్, చిన్నదాని నేత్రద్వంద్వముతో, గరిమ బూనఁగవచ్చి-గౌరవమునొందవచ్చి, మీనజాలము-చేపలగుంపును, సుళ్ళలోనన్-నీటిసుడులయందు, కష్టములలోననియు, మునిగెన్-మునిఁగిపోయెను, మగువ దృగ్యుగళితోన్-చిన్నదాని నేత్రద్వంద్వముతో, నిగనిగల్గొనవచ్చి-తాళతళ్యమునొందవచ్చి, నెలపుల్గుగవలు-చకోరద్వంద్వములు, వర్తిలఁగన్-సంచరించుటకు, (ఈ పాఠము సరియయినదని తోఁచదు) అరసెన్-చూచెను,

తమ్ములకున్ - పద్మములకు, తమ్ములు - సహోదరులు, ఇందీవరమ్ములకున్ - నల్లగల్వలకు, వరమ్ములు - శ్రేష్ఠములు, మీలకున్ - చేపలకు ఉన్మీలనమ్ములు, కనులు మూయుటయును, అలచకోరికలకున్ - ఆ స్త్రీ చకోరములకు, కోరికల్ - కామితములును, ఐనట్టి, కొమిరె - చిన్నదానియొక్క, వాలుగన్నులు - విశాలనేత్రములు, వర్ణింపన్ - వర్ణనజేయుటకు, ఎవరికిన్ - ఎవరికైనను, వశమె - స్వాధీనమా.

ఉ. కమ్మనిపల్కు తేనెలర ♦ కమ్మని కుల్కుకుచమ్ము చక్రవా
కమ్మని మేనికాంతి కన ♦ కమ్మని బెళ్కుడుచూపుచేవపాం
కమ్మని చెక్కు చంద్రఫల ♦ కమ్మని కొమ్మెఱుంగారు దందశూ
కమ్మని కొప్పు తేటికుల ♦ కమ్మని పల్కెద నీలవేణికిన్.

టీ. నీలవేణికిన్ - నల్లని జడలుగల చిన్నదానికి, కమ్మని పల్కులు - రుచిగల వాక్యములు, తేనెలరకమ్మని - తేనెలదనుసనియు, కుల్కుకుచమ్ము - శృంగారముగల స్తనము, చక్రవాకమ్మని - చకవాక పక్షియని, మేనికాంతి - శరీరచ్ఛాయ, కనకమ్మని - బంగారమనియు, బెళ్కుచూపుచేవ - చంచలమైన దృష్టియొక్క బలము, పాంకమ్మని - పాసమునదనియు, చెక్కు - గండస్థలము, చంద్రఫలకమ్మని - చంద్రకాంతమనియు, కొమ్మెఱుంగారు - నిగనిగలాడెడు నూగారు, దందశూకమ్మని - పామనియు, కొప్పు - కేశభారము, తేటికులకమ్మని - తుమ్మెదగుంపనియు, పల్కెదన్ - చెప్పెదను.

గీ. ఇంతి సల్లపన స్ఫూర్తి ♦ యించు కమరు
రాజునకు మత్తకోకిల ♦ రాజునకును
తరుణియుచ్చరణస్ఫూర్తి ♦ దనరుఁ గొంత
శుకములకు నతివికచ కిం ♦ శుకములకును. 43

టీ. ఇంతి - చిన్నదానియొక్క, సల్లపనస్ఫూర్తి - సత్ - శ్రేష్ఠమయిన, లపన - ముఖముయొక్క, సల్లపన - పలుకుబడియొక్కయు, స్ఫూర్తి -

స్ఫురణము, ఇంచుక - కొంచెము, రాజునకున్ - చంద్రునికి, మత్తకోకిలరాజునకును = మదించిన కోకిల శ్రేష్ఠమునకును, అమరున్ ... ఒప్పును. తరుణి చిన్నదానియొక్క, ఉచ్చరణస్ఫూర్తి. ఉచ్చరణ- పలుకుబడియొక్క. ఉత్ - ఉన్నతమయిన, చరణ - పాదములయొక్కయు, స్ఫూర్తి - స్ఫురణము, శుకములకును - చిలుకలకును, అతి వికచ కింశుకములకును - మిక్కిలి వికసించిన మోదుగ పువ్వులకును, కొంత - కొంచెము, తనరున్ - ఒప్పును.

చ. కలికి మొగంబు డంబునకుఁగా శశి పద్మము లాఢ్యపుష్కర
స్థలిని సదా తపస్స్ఫురణఁ దాల్చుతటి న్వికలంక సౌరభో
జ్జ్వలతను బద్మ మొందె నల చందముఁ జందురుఁ డందఁ డయ్యెనా
కలుషము గాదె మేదినిఁ గారణ మివ్వరి వైరవృత్తికిన్. 44

టీ. శశిపద్మములు-చంద్రపద్మములు, కలికి - చిన్నదానియొక్క, మొగంబు డంబునకుఁగాన్ - ముఖశోభకై, ఆఢ్యపుష్కరస్థలిని- ఆఢ్య - మంచిదియగు, పుష్కరస్థలిని - తీర్థవిశేషమందు, ఆకాశస్థలమందనియు, నీటిస్థలమందనియు నర్థములు - తపస్సు తీర్థవిశేషమందుఁ జేయుదురుగదా - ఇదియుభయశ్లేషము- ఆకాశమందలి చంద్రపక్షమందును, జలమందలి పద్మపక్షమందును, ఇట్లుమూఁడర్థములు గూర్చుకొనవలయును-సదా - ఎల్లప్పుడును. తపస్స్ఫురణన్-తపస్సుయొక్క స్ఫూర్తిని, సత్ - యోగ్యమయిన, ఆతప - ఎండయందు, స్ఫురణన్ — వికాసమువనియు, తాల్చుతటిన్ - ధరించినప్పుడు. వికలంక సౌరభోజ్జ్వలతను - కలంకరాహిత్యమును, బరిమళముచేఁ బ్రకాశించుటయును, పద్మము - తమ్మి, ఒందెన్ - చెందెను, అలచందమున్ - ఆరీతిని, చందురుఁడు - చంద్రుఁడు, అందఁడయ్యెన్ - పొందఁడాయెను, ఆకలుషము - ఆదోషము, మేదినిన్ - భూమియందు, ఇర్వురి - ఇద్దఱియొక్క, వైరవృత్తికిన్ - విరోధ వ్యాపారమునకు, కారణముగాదె — హేతువుగాదా.

గీ. కొమ్మకే లింపలరు లేత ♦ కొమ్మకేలి
మేచకము లచ్చెలియ నెరుల్ ♦ మేచకములు
తియ్యని రుచిం దనరు మోవి ♦ తియ్యని రుచి
యించుక మరుని చేవింటి ♦ యించు కమరు. 45

టీ. కొమ్మకేలు-చిన్నదానిచేయి, లేతకొమ్మకేలిన్ - లేతకొమ్మయొక్క విలాసముచేత, ఇంపలరున్ — శోభించును, మేచకములు - నల్లనయిన, ఆచ్చెలియ - ఆచిన్నదానియొక్క, నెరుల్ - వెండ్రుకలు, మేచకములు - నెమిలిపింఛములు, తియ్యని — మధురమగు రుచిన్ - రుచిచేత, తనరు - ఒప్పుచున్న, మోవి - అధరము, తియ్యని - వెనుకఁదీయనట్టి, రుచి — మాధుర్యము, ఇంచుక - కొంచెము మరుని - మన్మథునియొక్క, చేవింటి — చేతిలోని ధనుస్సుయొక్క, ఇంచుకున్ = చెఱకునకు, అమరున్ = ఒప్పును.

చ. కలహమునం బరస్పరముఁ ♦ గన్పడు కన్నుల కున్విభాగపుం
గల నలసాక్షులొప్పుకొనఁ ♦ గాముఁడు యౌవనమంత్రిచే సము
జ్జ్వలత వలగ్నపత్రమునఁ ♦ బట్టి లిఖింపఁగఁ జేయు నక్షర
మ్ముల నలరారు బంతియనఁ ♦ బాటిలు గ్రొమ్మెఱుంగారు
బోటికిన్. 46

టీ. కలహమునన్ = విరోధముచేత, పరస్పరమున్ = అన్యోన్యము, కన్పడు = అతిశయించుచున్న, కన్నులకున్ = నేత్రములకు, విభాగపుంగలను = పంపకప్రచోటు, అలసాక్షులు = ప్రసిద్ధులైనసాక్షులు, మందములగు నేత్రములనియు, ఒప్పుకొనన్ - అంగీకరించఁగా, కాముఁడు = మన్మథుఁడు యౌవనమంత్రిచేన్ = జవ్వనమనెడు ప్రధానిచేత, సముజ్జ్వలతన్ = ప్రకాశముచేత, వలగ్నపత్రమునన్ = నడుమనెడు నాకువై, పట్టి = పట్టికొని, లిఖింపఁగఁజేయు = వ్రాయింపఁజేసిన, అక్షరమ్ములన్ = వర్ణములచేత, అల

రారు = ఒప్పుచున్న, బంతియన్ = పంక్తియనునట్లు, క్రొమ్మెఱుంగారు = క్రొత్తకాంతులుగల నూగారు, బోటికిన్ = చిన్నదానికి, అలరారున్ = ప్రకాశించును.

సీ. రద పాళి కెదురించి♦రా లేక పాలిండ్ల
గౌరవంబు వహించె♦గోరకములు
తనుకాంతి కాసించి♦తా నిల్వ లేమికి
కేతకి నెరి కొప్పు♦రీతిఁగాంచె
నెర తొడలను బోలి♦ద రహిత స్థితిఁగాంచి
కదళికల్ నఖర♦సంపదలఁబొదలె
మెఱుఁగారు గణియించి♦మిగుల వాదిగ నిల్చి
శైవాలముపిఱుందు♦చాయ నెనసె
గీ. మధుకరమ్ములు కుంతల♦ప్రథిమ నెంచి
క్రమముగా న ద్వితీయవ♦ర్ణముగ నిల్చి
జంఘలకుఁగ్రిందుపడె నౌర♦జలజనేత్ర
గాత్రముల దీటుల చరిత్ర♦చిత్రమయ్యె. 47

టీ॥ కోరకములు = మొగ్గలు, రదపాళికిన్ = దంతపంక్తికి, ఎదురించి = ఎదురై, రాలేక = వచ్చుటకు సామర్థ్యములేక, ర అను నక్షరము లేక యనియు నర్థము. కోరక శబ్దమందు 'ర' లేకుంటే కోకమగును, చక్రవాకములని యర్థము. పాలిండ్లగౌరవంబున్ = స్తనముల యౌన్నత్యమును, వహించెన్ = పూనెను, కేతకి = మొగలిపువ్వు, తనుకాంతికిన్ = శరీరకాంతికి, ఆశించి = ఆశపడి, తా నిల్వ లేమికిన్ = తా నాగలేకుండుటకు, త అను నక్షరము నిలువకుండుటకు ననియు నర్థము. కేతకిశబ్దమందు త నిలువకుంటే కేకియగును. నెమిలియని యర్థము. కొప్పురీతిన్=కొప్పుయొక్క పద్ధ

తిని, గాంచెన్ = పొందెను, కదళికన్ = అనంటులు, నెరతొడలను = మించిన యూరుతొడలను, పోలి = పోలినవియై, దరహాసస్థితిన్ = కొంచెమిష్టి మగురీతిని, కాంచి = పొందియనియు నర్థము. కదళికల్ అను శబ్దమందు 'ద' కారాన్యమయితే కళికల్ అనియగును, మొగ్గలని యర్థము, నఖరసంపదలన్ = గోళ్ళ యొక్క శోభలచేత, పొదలెన్ = వృద్ధినిబొందెను, శైవాలము = నాచు మెఱుఁగారున్ = మెఱుఁగైన నూగారును, గణించి = లెక్కించి, మిగులన్ = మీరుటకు, వాదికన్ = వాదము చేయునదిగా, నిల్చి = ఉండి, 'వ' అను యక్షరము దిగిపోగా-నిలచి, శైవాలశబ్దమందు- 'వ' అను నక్షరముదిగిపోగా- శైలముఅగును. పర్వతమని యర్థము. పిఱుందునాయన్ = కటియొక్క శోభను, ఎనసెన్ = పొందెను, మధుకరమ్ములు = తుమ్మెదలు, కుంతల ప్రథిమన్ = ముంగురుల గొప్పతనమును, ఎంచి = లెక్కించి, క్రమముగాన్ = తిన్నగా, అద్వితీయవర్ణముగన్ = రెండవవర్ణములేనిదిగా, అనఁగా సామ్యము లేనిదై, రెండవయక్షరములేనిదై యనియు నర్థము, మధుకరశబ్దమందు రెండవ యక్షరము లేకుంటే మకరమ్ములు అగును- మొసళ్ళని యర్థము. జంఘలకున్ = పిక్కలకు, క్రిందుపడెన్ = తక్కువాయెను, ఔర = ఆశ్చర్యము. జలజ నేత్రి = చిన్నదానియొక్క, గాత్రముల = అవయవములయొక్క, దీటుల సమానవస్తువులయొక్క, చరిత్ర = చరిత్ర = చరితము, చిత్రమయ్యెన్ = ఆశ్చర్య మాయెను.

క. మెఱుఁగుపసిడింకి వాసన
చెఱకునకున్ సత్ఫలంబు♦సృజియింపని యా
క్కొఱ చెలిమేనిసజిగి వా
తెఱయును నిర్మించిధాత♦తీరిచి కొనియెన్. 48

టీ. మెఱుఁగుపసిండికిన్ = మెఱుంగు బంగారమునకు, వాసన = పరిమళమును, చెఱకునకున్ = ఇక్షువునకు, సత్ఫలంబు = మంచిపండును, సృజియింపని = నిర్మించనట్టి, అక్కొఱ = ఆలోటు చెలిమేనిని = చిన్నదాని శరీర

మును, జిగివా తెఱయును = నునుపైన యథరోష్ఠమును, నిర్మించి = చేసి, ధాత = బ్రహ్మ. తీరిచికొనియెన్ = పోఁగొట్టుకొనెను.

సీ. సరసులలోన న ♦ బ్జములున్నఁబనియేమి
    విషములసంగతి ♦ విడువ వెపుడు
కళ లన్నెలకు నెన్ని ♦ కలిగినఁ బనియేమి
    దోషాకరఖ్యాతి ♦ దొలఁగ దెపుడు
కవ జక్కవలు వృత్త ♦ గతినున్నఁబనియేమి
    తమి నొండొరులఁగూడు ♦ క్రమము లేదు
ఘనులలోన మెఱుంగు ♦ గలసినంతనె యేమి
    చాంచల్యమొక్కింత ♦ జారలేదు
కాన నీచాన కనుదోయి ♦ కాననమున
కబ్బురపు గబ్బిగుబ్బల ♦ కంగమునకు
జలజ చయ చంద్ర చక్రిచం ♦ చలల సరిగ
బలుక నుచితంబుగా దిట్లు ♦ దలఁచి చూడ. 49

టీ. అబ్జములు = పద్మములు, సరసులలోన్ = రసయుక్తులయిన వారిలో, మడుగులలోననియు ఉన్నన్ = ఉంటచేత, పనియేమి = కార్యమేమి గలదు, విషముల = ఉదకములయొక్క, గరళములయొక్క యనియు, సంగతి = స్నేహము, ఎపుడు = ఎన్నఁడును, విడువదు = వదలదు, అన్నెలకున్ = ఆచంద్రునికి, కళలు = పదియారవ భాగములు, శాస్త్రములనియు, ఎన్నిగలిగినన్, పనియేమి = కార్యమేమి, దోషాకరఖ్యాతి = పాపములకు స్థానమను ప్రసిద్ధి, రాత్రినిఁ జేయువాఁడను ప్రసిద్ధియనియు, ఎపుడుదొలఁగదు = ఎన్నఁడును పోదు, కవజక్కవలు = జోడైన చక్రవాకములు, వృత్తగతిన్ = మంచి నడతచేత, వర్తులరీతిచేత ననియును, ఉన్నఁబనియేమి=ఉన్న

కార్యమేమి, రతిమిన్ = అనురాగముచేత, రాత్రియందనియు, ఒండొరులం బొందు క్రమములేమ = అన్యోన్యముంగలియు రీతిలేదు, మెఱుంగు = మెఱుపు, ఘనములంగోనన్ = గొప్పవారింగో మేఘములలోననియు, కలసినంత నెయ్యేమి = కూడినంతమాత్రమున నేమి ప్రయోజనము. చాంచల్యము = చంచలత్వము, ఒక్కింత బోగ లేదు = కొంచెమైనంబోలేదు, కానన్ = కాబట్టి, ఈచాన = ఈచిన్నదానియొక్క, కనుదోయికిన్ = నేత్రద్వంద్వమునకును, ఆననమునకున్ = ముఖమునకును, అబ్బురపు గబ్బిగుబ్బలకున్ = ఆశ్చర్యమయిన గొప్ప కుచములకును, అంగమునకున్ = శరీరమునకును, జల...చలలన్ = జలజ చయ = పద్మసమూహమును, చందిరి = చంద్రుని, చక్ర = చక్రవాకములను, చంచలలన్ = మెఱపులను, ఇట్లు దలంచి చూడన్ = ఈప్రకారమాలోచించి చూడంగా, సరిగన్ = సమానముగా; పలుకన్ = చెప్పుటకు ఉచితంబుగాదు = అర్హము గాదు.

క. వదనము వాణీవల్లభ
పదమును మధ్యంబు విష్ణు ♦ పదమును గెలువన్
సదళిక యీసతితొడలకుఁ
గదళిక లేపగిదిఁబోల్ప ♦ గాఁదగునొక్కో. 5

టీ. వదనము = ముఖము, వాణీవల్లభ పదమును, బ్రహ్మకుస్థానమగు పద్మమును, మధ్యంబు = నడుము, విష్ణుపదమును = ఆకాశమును, గెలువన్ = జయించఁగా, సదళిక = మంచి నుదురుగల, ఈసతి = ఈచిన్నదానియొక్క తొడలకున్ = ఊరువులకు, కదళికన్ = అరఁటిని, నింద్యమగు నళికయని యర్థము, సదళికయొక్క తొడలకుఁ గదళికను బోల్పరాదని తాత్పర్యము. ఏపగిదిన్ = ఏప్రకారము, పోల్పఁగాదగునొక్కో = సాటిచేయఁదగునో;

సీ. అలరు బంతు లటంచు ♦ నాడవచ్చునుగాని
యలరు బంతులటంచు ♦ నాడరాదు

భద్ర కుంభములంచుఁ ♦ బలుక వచ్చునుగాని
భద్రకుంభములంచుఁ ♦ బలుకరాదు
వృత్తతాళములంచు ♦ నెంచవచ్చునుగాని
వృత్తతాళములంచు ♦ నెంచరాదు
అతను కోశములంచు ♦ నరయ వచ్చునుగాని
యతనుకోశములంచు ♦ నరయరాదు

గీ. గుణమును సువర్ణమును రక్తి ♦ గుప్తిగలిగి
విభ్రమ రమాప్త మకరికా ♦ విలసనంబు
విదృమ లతోపగమ క్లప్త ♦ విలసనంబు
నై యలరు బాల పాలిండ్ల ♦ దోయి నిపుడు. 51

టీ. ఇచట సీసచరణములకును గీతచరణములకును సంబంధము గలుగు నట్లుగా జెప్పఁబడినది. గుణమును = వర్తులత్వాదికమును (అలరు బంతుల పక్షమున) దారమునని యర్థము. సువర్ణమును = మంచిరంగును, (భద్రకుంభ పక్షమున) బంగారమునని యర్థము. అనురక్తి = అనురాగమును (వృత్తతాళ పక్షమున) ఎఱుపునని యర్థము గుప్తి = రవిక కప్పు (అతను కోశపక్షమున) దాపరికమునని యర్థము, కలిగి = ఉండి విభ్ర......లసనంబు = విభ్రమ మా - విలాసలక్ష్మిచేత, ఆప్త = పొందఁబడిన = మకరికా = మకరికాపత్త్ర ములయొక్క, విలసనంబు = విలాసము గలదియు, విదృమ......లసనంబు, విద్రుమలతా = పగడపు తీగలయొక్క, ఉపగమ = పొందుటచేత, క్లప్త = రచించబడిన, విలసనంబు = విలాసము గలదియు, ఐ = అయి, ప్రకాశించు నట్టి, బాలపాలిండ్లదోయిన్ = చిన్నదాని స్తనద్వంద్వమును, ఇపుడు = ఇప్పుడు, అలరుఁబంతులటంచున్ = పువ్వుఁబంతులని - ఆడవచ్చునుగాని పలుకవచ్చునుగాని, అలరు=శోభించునట్టి, బంతులటనించున్ - కందుకముల

ఆడరాదు = పలుకఁగూడదు - భద్రకుంభములంచున్ = - బంగారు కలశములని, పలుకవచ్చునుగాని = చెప్పవచ్చునుగాని, భద్రకుంభములంచున్ ఏనుగుకుంభస్థలములని, పలుకరాదు=వచించఁగూడదు, వృత్తతాళములంచున్ వర్తులములగు తాటిపండ్లని, ఎంచవచ్చునుగాని = ఎన్నవచ్చునుగాని, వృత్త తాళములంచున్ - వర్తులములగు తాళపుచిప్పలని, ఎంచరాదు = ఎంచఁ గూడదు, అతనుకోశములంచున్ = మన్మథుని ధనరాసులని, అరయవచ్చును గాని = చూడవచ్చునుగాని, అతనుకోశములందున్ = గొప్ప మొగ్గలని అరయరాదు = చూడఁగూడదు.

క. కామిని కన్గవ కాంతులు
సోమ కళా విలసనంబుఁ ♦ జూపుచుఁ బెను లీ
లా మీనాకృతిఁ బూనఁగఁ
గోమలికిన్ శ్రుతులు శ్రీల ♦ గుట సందియమే. 52

టీ. కామిని కన్గవ కాంతులు = స్త్రీ యొక్క నేత్రద్వంద్వముయొక్క కాంతులు, సోమకళావిలసనంబు = చంద్రకళ యొక్క విలాసమును, చూపుచున్ = కనఁబరచుచు, పెను = విస్తారమగు, లీలా = విలాసముచేతనైన, మీనాకృతిన్ = మత్స్యాకారమును పూనఁగన్ = ధరించఁగా, కోమలికిన్ స్త్రీకి, శ్రుతులు = చెవులు, శ్రీలగుట = శ్రీకారములగుట, లక్ష్ములగుట యనియు నర్థము - సందియమే = సంశయమా, ఇచట నేత్రములయందుఁ దెల్లని రంగుగలిగి యుండుంగావునఁ జంద్రకళాసామ్యముఁ జెప్పెను. కన్నులు చంద్రకళావిలాసమును మీనాకారమ్మును ధరించుటచేత సముద్రమందుఁ బుట్టిన చంద్రమత్స్యములున్నచోట సముద్రమందే పుట్టిన శ్రీ యుండుటకు సందేహము లేదని తాత్పర్యము.

చ. మనసను బ్రోలి నేలు నెఱ ♦ మావి శరమ్ములదొరట నిస్తుల
స్తన గిరి దుర్గయుగ్మము తు ♦ దన్నిలపెన్ మకరాంకుడ ప్పుచ

య్యానఁజను నాభికూపపు త- దంకము చేఁ బద లగ్నకౢప్తమై
పసుఁపడు నాచుతీవయొగిఁ ♦ బ్రాకె ననందగు నారు నాతికిన్.

టీక. మనసను ప్రోలన్, = చిత్తమనెడు పట్టణమునను, ఏలు = పాలించు నట్టి, నెఱమావిశరమ్ములవంటు = శ్రేష్ఠములగు మామిడిపువ్వుల బాణములు గల నేర్పరియగు మన్మథుఁడు, నిస్తుల...తుదన్ - నిస్తుల = సామ్యము లేని స్తన - కుచముల నెడు, గిరిదుర్గయుగ్మము = పర్వతదుర్గ ద్వంద్వముయొక్క, తుదన్ = చివరను, మకరాంకము = మకరికా పత్రముల నెడు మొసలి జాడను, నిలపెన్ - ఉంచెను. చయ్యన-శీఘ్రముగా, చను-వెడలునట్టి, నాభికూపపు - నాభియను నూతియందలి, తదంకముచేన్ - ఆ మన్మథుని చిహ్నమగు చేపచేత, నూతియందుఁ జేపయుండుట న్యాయముగనుక యట్టి చేపయొకటి నాభికూపము నందుండి మన్మథుని ధ్వజము మీనమును జూచి పైకెగచెనని తాత్పర్యము. పదలగ్నకౢప్తమై - పాదమందుఁ దగులుకొన్నట్టిదియు, బాగ: బడినట్టిదియునై చేపకుఁ బాదములు లేకున్నను పాదములవంటి యవయవములనే అట్లు నిర్దేశించినాఁడు. పసుపడు బాగగు, నాచుతీవ- శైవల లత, ఎగఁ బ్రాకెననన్ - ఎగచినదో యనునట్లు, నాతికిన్ - స్త్రీకి, ఆరు - నూగారు, తగున్ - ఒప్పును.

సీ. పొలఁతి పాద పయోజ ♦ ములపేర నవనిలోఁ
బ్రబలఁగాఁబోలుఁ బ ♦ ల్లవ చయంబు
కలువకంటి కటాక్ష ♦ ములపేరఁబుడమి వ
ర్ధిలఁబోలు వాలుగ ♦ న్నుల కులంబు
కలకంఠి కాలంది ♦ యల పేర వర్ధిల్లఁ
గాఁబోలు వర హంస ♦ క వ్రజంబు
కుంద సుందరహాస - కుంతలమ్ముల పేర
నమరఁ బోలును మద ♦ భ్రమరకంబు

గీ. లాకులతనున్న వలగొన్న ♦ నమరభంగ
ములఁబడిన నెల్ల యెడలను ♦ మొనయుడి నను
మించు చిగురులు వాలుగ ♦ లంచ లళులు
గాంచఁజాలవు శృంగార ♦ మించుకైన. 54

టీ. పల్లవచయంబు - చిగుళ్ళసమూహము, మరియు, పత్ - పాదములయొక్క, లవ - లేశములయొక్క, చయంబు - సమూహమనియు నర్థము. ఈ యర్థము పాదముల పేరఁ బ్రబలఁబోలు నని చెప్పుటకు నుపయోగించుచున్నది. ముందుఁజూడ నిట్లూహింపవలయును. పొలఁతి పాదపయోజముల పేరన్ - స్త్రీయొక్క పాదపద్మముల పేరితో, అవనిలోన్ - భూమిలో, ప్రబలగాఁబోలున్ - అతిశయించఁబోలును, వాలుగకన్నుల, వాలుగ = వాలుగ చేపలవంటి కన్నులుగల స్త్రీలయొక్క, కులంబు - జాతి, మరియు, వాలు - దీర్ఘములగు, కన్నుల - నేత్రములయొక్క యనియు నర్థము - కలువకంటి కటాక్షముల పేరన్, స్త్రీయొక్క క్రేగంటి చూపలను పేరుతో, పుడమిన్ - భూమియందు, వర్ధిలబోలున్ - వృద్ధిఁ బొందబోలును. వరహంసకవ్రజంబు. వర - శ్రేష్ఠమయిన, హంసక - అంచలయొక్క, వ్రజంబు - సమూహము - మరియు, హంసక - కాలికడియములయొక్క యనియు నర్థము, కలకంఠికా లందియల పేరన్ - ఆ చిన్నదాని పాదముల నుండెడి యందెల పేరుతో, వర్ధిలఁగాఁ బోలున్ - వృద్ధిఁబొందఁబోలున్, మదభ్రమరకంబులు - మద - మదముతోఁగూడిన, భ్రమరకంబులు - తుమ్మెదలు, మరియు. భ్రమరకంబులు ముంగురులు, కుందసుందరహాస - మల్లిపువ్వులవలె సుందరమయిన నవ్వుగల స్త్రీయొక్క కుంతలమ్ముల పేరన్ ముంగురుల పేరితో, అమరఁ - బోలును ఒప్పబోలును, ఆకులతనున్నన్ - ఆకులత్వముచేతనున్నను, (పల్లవము) ఆకులతియందున్నదని యును, వలఁగొన్నన్ - ప్రదక్షిణముఁ జేసినను, (వాలుగలు) వలలోఁబడెననియు, అమరన్ = ఒప్పునట్లు, భంగములఁబడినన్ = హానులఁ

బొందినను, (హంసలు) తరంగములలోఁ బడె ననియు, ఎల్లయెడలను = అన్ని చోటుల, మొఱయిడిన = మొఱ్ఱఁబెట్టుకొన్నను, (తుమ్మెదలు) ధ్వనిచేసె ననియు, మించు చిగురులు = అతిశయించు పల్లవములును, వాలుగలు = వాలుగచేపలును, అంచలు = హంసలును, అళులు = తుమ్మెదలును, ఇంచుకైనన్ = కొంచెమైనను, శృంగారము = సౌందర్యమునని లాక్షణికార్థము. కాంచఁజాలవు = పొందలేవు.

మ. ఘన శృంగారపుతీగ యౌవన వనిం ♦ గందర్పుఁడే హాలికుం
  డు నెరా పొక్కిటిపాదునిల్పఁదనరె ♦ నూగారునాఁ దానిమీఁ
  ద నవోష్ణారుణ బింబడంబర రతిన్ ♦ ద్వంద్వంబమైజక్కవల్
  దనరెం జన్నులునాఁగ నింతిముఖ చం ♦ ద్రశ్రీభయ స్తబ్ధమై.

టీ. యౌవనవనిన్ = జవ్వనమనుతోటయందు, కందర్పుఁడన్ = మన్మథుఁడే నెడు, హాలికుండు = సేద్యగాఁడు, నెరా = ప్రశస్తమైన, పొక్కిటిపాదు = నాభియనెడుపాదు. నిల్పన్ = ఉంచఁగా, దానియందని యధ్యాహారము ఘనశృంగారపుతీగ = గొప్పదియగు శృంగారమనెడు తీగఁ నూగారునాన్ = రోమావళియను పేరుచేత, తనరెన్ = ఒప్పెను. దానిమీఁద = దానిపైని, నవోష్ణారుణబింబడంబరరతిన్ = నూతనమగు నధరోష్ఠమనెడు సూర్యబింబము యొక్క యాటోపమందాసక్తిచేత - చక్రవాకములకు సూర్యబింబమందాసక్తి కలుగుట ప్రసిద్ధము. ద్వంద్వంబయై = జోడై, జక్కవల్ = చక్రవాకములు, చన్నులునాఁగన్ = స్తనముల పేరితో, ఇంతి = ఆచిన్నదానియొక్క ముఖ... స్తబ్ధమై, ముఖచంద్ర = ముఖమను చంద్రునియొక్క, శ్రీ = శోభయొక్క, భయ = భీతిచేత, స్తబ్ధమై-కొయ్యబారి, తనరెన్ = ఒప్పెను. చక్రవాకములు చంద్రునికి జడియుట ప్రసిద్ధము.

సీ. పఠతి మేల్నడతలా ♦ పరమహంసలకైన
  సతి నఖస్థితులు స ♦ ద్వ్రతతికైన

వనిత కన్గవకాంతి యనిమిషావళి కైనఁ
గన్నె పెన్నెరిగుంపు ఘనుల కైన
వనజాక్షి వదనమీశ్వర శిఖామణి కైన
వెలఁది పల్కులు శుకాదులకు నైన
హరిణాక్షి యిఱిగౌను హరి కైనఁ బల్లవా
ధర యూరులు సరసతరుల కైనఁ
గీ. బట్టి వర్ణింపనలవిగా దిట్టులుండ
నతివ యాసొంపులా పెంపులా నెరా యొ
యారములు బీరములును శృంగారములును
దరమె లెక్కింపఁ దర్కింప నరుల కెపుడు. 56

టీ॥ ఈపద్యమం దుపమానవస్తువులకును బూజ్యులకును శ్లేషద్వారా భేదాధ్యవసాయముఁ జేసినాఁడు పడఁతిమేల్నడతలు=ఆచిన్నదాని మంచి గమనములు, అపరమహంసలకైనన్ = ప్రసిద్ధులగు జ్ఞానులకయినను, గొప్ప హంసలకనియును, సతినఖస్థితులు = ఆచిన్నదాని గోళ్ళరీతులు, సద్వ్రతతికైనన్ = సౌభాగ్యలసమూహమునకైన, నక్షత్రసమూహమునకనియును, వనితకన్గవకాంతి = ఆచిన్నదాని నేత్రద్వంద్వముయొక్క కాంతి, అనిమిషావళికైనన్ = దేవసమూహమున కైనను, తెప్పపాటులేని చేపల సమూహమునకనియును, కన్నెపెన్నెరిగుంపు=చిన్నదాని కేశసమూహము, ఘనులకైనన్=గొప్పవారికైనను, మేఘములకయినననియు, వనజాక్షివదనము=స్త్రీయొక్క మొగము, ఈశ్వరశిఖామణికైనన్=ఈశ్వరశ్రేష్ఠులకయినను, శివునిశిరోమణియగు చందురునకనియును, వెలఁదిపల్కులు = చిన్నదానిమాటలు, శుకాదులకునైనన్=శ్రీశుకుఁడు మొదలగువారికయిన, చిలుకలు మొదలగువాని కనియును, హరిణాక్షియిఱిగౌను = చిన్నదాని సన్నమగు నడుము, హరికైనన్=విష్ణువుక

యునను, సింహమునకనియును, పల్లవాధరయూరులు = చిన్నదాని తోడ వరసకరులకైనన్ = మిక్కిలి సరసులగు వారికయినను, నయముక్తము చెట్లకనియును, పట్టి = పూని, వర్ణింపన్ = వర్ణనచేయుటకు, అలవిగాదు = శ ముగాదు, ఇట్టులుండన్ = ఈరీతినుండఁగా, అతివ = చిన్నదానియొక అసొంపులు = ఆసొగసులు, ఆ పెంపులు = ఆ యతిశయములును, ఆ నె యొయారములు = ఆగొప్పవిలాసములును, బీరములును = బిగువులును శృం రములును = శృంగారచేష్టలును, నరులకున్ = మనుష్యులకు, ఎప్పుడు = ఎప్ డును, లెక్కింపఁగా = గణనసేయుటకును, తర్కింపఁగా = ఊహించుటకు తరమె = శక్యమా!

క. కాంచన కళికాంచనమును
గాంచెన్ బంకేజపాణి ♦ ఘన నాసిక య
మ్మించులమించుల మించి ర
మించు లతా లలితగాత్రి ♦ మేని మెఱుంగుల్.

టీ. పంకేజపాణిఘననాసిక = పద్మములవంటిహస్తములుగల చిన్నది ముక్కు, కాంచనకళికాంచనమును = సంపెంగమొగ్గయొక్కగౌరవము కాంచెన్ = పొందెను, లతాలలితగాత్రి = తీగవలె సుందరమగు శరీరము స్త్రీయొక్క, మేనియొఱుంగుల్ = శరీరకాంతులు, అమ్మించులమించుల ప్రసిద్ధమగు మెఱుపుల కాంతులను, మించి = అతిశయించి, రమించుఁగా క్రీడించును.

మ. కలయు న్మీనము ద్విస్వభావ గరిమం ♦ గన్గోయి దంభం
నన్ । వెలయుం దచ్చన నుచ్ఛభావముగుటన్ ♦ విచ్చేం
శుకుఁడుండు నా । నలరు న్మంగర ముత్తై మంగనకుఁ ద
ధ్యం బిచ్చెలింగాంచుచో । నలఘుం డాతఁడు గన్న క
కిల నై ♦ చ్యం బెంచ లేదే జనుల్.

టీ. మీనరాశి ద్విస్వభావరాశియనియు, శుక్రునకది యుచ్చయనియు, ఉచ్చకు నేడవరాశియగు కన్యరాశి నీచయనియు, గ్రహములన్నియుఁ దామున్న రాశినుండి యేడవరాశినిఁ జూచును గావున మీనమందున్న శుక్రుఁడు కన్యారాశినిఁ జూచుననియు, జ్యోతిశ్శాస్త్రప్రసిద్ధములు. ఈ పద్యము దానిననుసరించి చెప్పుచున్నాడు. కలయన్ = వ్యాపించునట్లుగా. మీనము=చేప, మీనరాశియనియును, ద్విస్వభావగరిమన్ = చరస్థిరస్వభావగౌరవముచేత, కన్దోయి—ఆచిన్నదాని నేత్రద్వంద్వముయొక్క, దంభంబునన్ = మిషముచేత వెలయన్ = ఒప్పఁగా, ఛద్మనన్ = కపటముచేత, ఉచ్చభావము గుటన్ = ఉన్నతత్వమగుటచేత ఉచ్చరాశియనియును, విచ్చేయు = వచ్చినట్టి, శుక్రుండునాన్ = శుక్రుండేమో యనునట్లు, ముంగరముత్తెము = ముంగరయందలి ముత్తెము, అంగనకున్ = స్త్రీకి, అలరున్ = ఒప్పును, తథ్యంబు = నిశ్చయము, ఇచ్చెలిం గాంచుచోన్ = ఈ చిన్నదానిఁ జూచునపుడు, అలఘుండు = గొప్పవాఁడగు, అతఁడు = ఆశుక్రుఁడు, కన్నకన్యకున్ = చూచిన కన్యరాశికి, కన్నట్టి చిన్నదానికి (అనఁగా దేవయానికి) జనుల్ = మనుష్యులు, నైచ్యంబు = నీచత్వమును ఎంచలేరే = ఆలోచించలేరా.

సీ. నానాప్రసూనాళి ♦ లో నారసి వసంతుఁ
డసము సౌరభసార ♦ మొసఁగ మొసఁగ
ధారాళ ధారాసు ♦ ధారాసు జాబిల్లి
వెదకి సారముఁదెచ్చి ♦ పద నొనర్ప
సంపాత శంపాళి ♦ నింపారు చకచకల్
ఘనులోక గుమిగఁ జే ♦ కొని తనర్ప
శృంగార ముంగారఁ ♦ బొంగారు బంగారు
మేరు లేర్పరచిన ♦ మిన్నక యొసంగఁ

సీ. బచ్చవిలుకాఁడు లచ్చిపై ♦ యచ్చొచ్చెనర్చి
యచ్చరలు మెచ్చ ముచ్చటల్ ♦ హెచ్చ నిచ్చ
నిచ్చెలినిఁ జేసెఁగానిచోఁ ♦ నింత వింత
చక్కఁదన మొక్కటనె యెట్లు ♦ పిక్కటిల్లు. 59

టీ. వసంతుఁడు = వసంతర్తువు, నానాప్రసూనాళిలోన్ = సమస్త పుష్పపఙ్క్తులో, అరసి = చూచి, సౌరభసారము = మంచిపరిమళము, ఎనన్ = ఒప్పునట్లు, ఒసఁగన్ = ఇయ్యఁగా, జాబిల్లి = చంద్రుఁడు, ధారా.....రాశిలోన్ = ధారాళ = అడ్డులేని, ధారా = ధారారూపమైన, సుధా = అమృతము యొక్క, రాశిన్ - ప్రోగునందు, వెదకి = వెదకి, సారము దెచ్చి = మెఱుఁగుఁ దెచ్చి, పదనొనర్పన్ = తడివేయఁగా, ఘనులు - మేఘములు, సంపాత శంపాళిన్ = సంపాత = బాగుగ ప్రసరించుటతోఁ గూడిన, శంపా = మెఱుపుయొక్క, ఆళిన్ = పఙ్క్తియందు, ఇంపారు = సొగసయిన, చకచకల్ = తళతళలు, ఒక గుమిగన్ = ఒక ప్రోగుగా, చేకొని = పుచ్చుకొని - తనర్పన్ - అతిశయించఁగా, మేరువు = మేరువు పర్వతము, శృంగార ముంగారన్ - శృంగారమొప్పునట్లు, పొంగారు అతిశయించునట్టి, బంగారు - బంగారము. ఏర్పరచి - ఏరి, నమ్మికన్ - నమ్మకముచేత, ఒసంగన్ - ఈయఁగా, పచ్చవిలుకాఁడు - మన్మథుఁడు, లచ్చిపైన్ - లక్ష్మిమీఁద, అచ్చొచ్చెనర్చి - అచ్చొత్తి, అచ్చరలు మెచ్చన్ - అప్సర స్త్రీలు పొగడునట్లుగా, (అప్సరల సౌందర్యమును మించినదని తాత్పర్యము) ముచ్చటల్ హెచ్చన్ - ఆనందము లతిశయించఁగా, ఇచ్చన్ ఇచ్చచేత, ఇచ్చెలిని - ఈ చిన్నదానిని, చేసెన్ - రచించెను, కానిచోన్ - కానట్లయితే, ఇంత వింత చక్కఁదనము = ఇంతచిత్రమగు సౌందర్యము, ఒక్కటన్ - ఒక్కచోటు, ఎట్లు పిక్కటిల్లున్ - ఎట్లుగా విజృంభించును.

మ. కన్నుల్ గాంచిచకోరకంబుసరిరాఁ ♦ గా నుచ్చవర్ణంబుతో
మిన్నాదంతములం దలంచుచు సము ♦ న్నీల ద్విరేఫ స్థితిం

జన్నుల్ గాంచినఁ గోపవృత్తినవి పై ♦ సాధింపఁ గంఠంబు మేల్
చెన్నుల్ గోరుచు సుళ్ళఁ బొందె నవలా ♦ శ్రీ లబ్బునే యేరికిన్.

టీ. చకోరకంబు - చకోరపక్షి, కన్నుల్ గాంచి - నేత్రములను జూచి నేత్రములతో సామ్యము బొందఁ దలఁచి యని భావము - ఉచ్చవర్ణంబుతోన్ - ఉన్నతమగు కాంతితోఁ గూడి, సరిరాగాన్ - సరివచ్చుటు, మిన్నాదంతములన్ - శ్రేష్ఠములగు దంతములను, తలంచుచున్ - తలపోయుచు, ఉచ్చవర్ణంబుతోన్ - ఉత్సృష్టమయిన, అనఁగా విడువఁబడిన, చకారముతో (చకోరకంబు అను శబ్దమందు చవర్ణము విడువఁగా, కోరకము అయినది.) మొగ్గయని యర్థము - అది దంతముల సామ్యమొందినదని భావము, సము...స్థితిన్ - సమున్నీలత్ - అతిశయించుచున్న, విశేష - నింద్యము గాని, స్థితిన్ - ఉనికిచేత, జన్నుల్ గాంచినన్ - స్తనములఁ జూడఁగా, (విరేఫస్థితిన - ర అను నక్షరము లేని యునికిచేత) చకారము పోఁగా మిగిలిన కోరకశబ్దమందు రేఫము పోఁగా 'కోకంబు' అయినది. చక్రవాకమని యర్థము, అది స్తనములతో సామ్యమునకు వచ్చెనని భావము. అవి ఆ స్తనములు, కోపవృత్తిన్ - క్రోధవ్యాపారముచేత, పైసాధింపన్ - అధికములుఁ గాఁగా, కంఠంబు - కుత్తుకయొక్క, మేల్ చెన్నుల్ మంచిశోభలు, కోరుచున్ - కోరుకొనుచు, (కోపవృత్తిన్ - కో - కో యను నక్షరము యొక్క, అపవృత్తిన్ - నివారించుటచేత) మిగిలిన కోకంబు అను శబ్దమందు కో అను నక్షరమును దీసివేయఁగా, కంబు అయినది. శంఖమని యర్థము - అది కంఠము సామ్యము గోరుచున్నదని భావము, సుళ్ళఁబొందెన్ బాధలఁబొందెనని లాక్షణికార్థము. శంఖమునకు లోపల సుడిదిరిగి యుండునని భావము. ఏరికిన్ - ఎవరికైనను, నవలా - ఆ చిన్నదాని యొక్క, శ్రీలు - శోభలు, అబ్బునే - దొరకునా.

సీ. ఘన చంపక స్నేహ ♦ మున మించు ముంగురుల్
భ్రమరకంబు లటంచు ♦ భ్రమము రాదు

వలరేని నెనరు బా ♦ టిలు చాన నయనముల్
వాలుగన్నులటంచుఁ ♦ బలుకరాదు
అనిశోజ్జ్వలస్ఫూర్తి ♦ గను బాల ఫాలంబు
చంద్రకాంతమటంచుఁ ♦ జదువరాదు
ఇల నల్ల నవ నదం ♦ బులఁబొసంగమి జెడ
కృష్ణవేణియటంచు ♦ నెంచరాదు

గీ. మదమధువ్రతవితతులు ♦ మత్స్యసతులు
హారిణ కిరణాశ్మములు ♦ నదుల్ హారిణ నయన
కుంతల దృగాస్యవేణుల ♦ గురు సమాఖ్య
లేకతంబున వహియించు ♦ నేకతమున. 61

టీ. ఘన...స్నేహమునన్, ఘన=గొప్పదియగు, చంపకస్నేహమునన్= సంపెంగనూనెచేత, సంపెంగపువ్వుల మైత్రిచేతననియుఁ, మించు=అతిశయించునట్టి, ముంగురుల్ - అలకములు, భ్రమరకంబులటంచున్ - తుమ్మెదలనుచు, భ్రమయరాదు - భ్రమపడఁగూడదు, తుమ్మెదలైనచో చంపక స్నేహమున మించవని తాత్పర్యము. భ్రమరకములని ముంగురులకుఁ బేరు. వలరేని - మన్మథునియొక్క, వలలకు నధికారియగు పల్లెవానియొక్క యనియుం, నెనరు స్నేహమును, పాటిలు - పొందిన, చాన నయనముల్ - ఆ చిన్నదాని నేత్రములు, వాలుగన్నులటంచున్ - అడువాలుగలనుచు, పలుకరాదు - చెప్పఁగూడదు, అడువాలుగలైనచోఁ బల్లెవాని నెనరు బాటిలవని తాత్పర్యము. వాలుగన్నులని నేత్రములకు బేరు - అని...స్ఫూర్తిన్, అనిశ - ఎల్లప్పుడు, నిశేతర కాలమందు [అనఁగాఁబగటియందు] అని యుజ్జ్వల - ప్రకాశించుచున్న స్ఫూర్తిన్ స్ఫురణను, కను - పొందునట్టి, బాలఫాలంబు = ఆచిన్నదాని లలాటము, చంద్రకాంతమటంచున్ - చంద్రకాంతమణియని, చదువరాదు - చెప్పుట

గూడదు, చంద్రకాంతమైనచోఁ బగటియం దుజ్జ్వలన్ఫూర్తిగనదని తాత్పర్యము. చంద్రకాంతము (చంద్రునివలె సుందరమైనది) అని నుదుటికిఁబేరు, ఇలన్ - భూమియందు, అల్ల - ప్రసిద్ధములైన, నవ - నూతనములగు, నదంబులన్ - పురుష నదములచేత, అల్లనన్ - తిన్నగా, వనదంబులన్ - మేఘములచేత ననియుఁ, పొసంగమిన్ - అనుకూలించ కుండుటచేత, (జడపత్తుముసా వేఘములను మించియున్నదని భావము.) జడ - జటు, కృష్ణవేణియటంచన్ - కృష్ణవేణీ నదియని ఎంచరాదు - తలఁచఁగూడదు - నదియైనచో నదములఁబొసంగునని తాత్పర్యము. కృష్ణవేణి - నల్లనిజడ యుని జడపేరు. సుద మధువ్రత నిరతులు - మదయుక్తములగు తుమ్మెదలసమూహములును, మత్స్యసతులు - ఆడుచేపలును, హరిణ కిగణాళ్మములు - చంద్రకాంత మణులును, నదుల్ - ఏఱులును, హరిణనయన - ఆచిన్నదానియొక్క, కుంత... వేణుల - కుంతల - ముంగురులయొక్కయు, దృక్ - నేత్రములయొక్కయు ఆస్య - ముఖముయొక్కయు, వేణుల = జడయొక్కయు, గురుసమాఖ్యలు- గొప్ప పేరులు, ఏకతంబునన్ - ఒంటరితనముచేత, ఏకతంబునన్ - ఏపేంకువుచేత, వహించున్ - ధరించు.

వ. ఇప్పగిది నుప్పిరిఁగొనుజవ్వనంబుప్పతిల్లఁజొప్పడియొప్పుల కుప్పయగు నప్పొలఁతుక యప్పుడప్పు డరవిప్పు విరులం దలిర్పు పుప్పొడి కుప్పలఁ దెప్పలు దేలుచు, నిప్పుకలచొప్పున తెక్క లప్పళింపుచుఁ గుప్పగంతులం గుప్పళించు నళులు గప్పి కొనఁ జొప్పడు పూఁజప్పరమ్ముల గుప్పుగుప్పున లేఁగరువలి దలిర్పు నుప్పరంబెగయు కప్పురంపుఁ దిప్పల సవికల్ప కల్పనలఁ దోఁచు సీదలగు ప్రోడచేడియలతోడ నాడుచుం బాడుచు నుండి యొక్కనాఁడు మనోవినోదంబున. 62

టీ. ఇప్పగిది = ఈవిధముగా, ముప్పిరిగొను = అతిశయించునట్టి, జవ్వనంబు=యౌవనము, ఉప్పతిల్లన్-పుట్టగా, చొప్పడి-యొప్పి, ఒప్పులకుప్పయగు నప్పొలతుక-అందముల ప్రోగు అగు ఆ చిన్నది, అప్పుడప్పుడగనిప్పు-అప్పుడప్పుడే నగము విచ్చుచున్న, విరులం-పూవులయందు, తలిర్పు-ఒప్పుచున్న, పుప్పొడికుప్పలన్-పూపరాగముల ప్రోగులలో, దెప్పలం తేలుచు-ఊగిసలాడుచు, నిప్పుకలచొప్పున = నిప్పులవలె, ఱెక్కలప్పళింపుచున్-ఱెక్కలువిదర్చుచు, కుప్పగంతులం గుప్పళించు నళులు — కుప్పిగంతులు (చిన్న చిన్న గంతులచే) నెగురుచు తుమ్మెదలు, కప్పికొన - మూఁగగా, చొప్పడు-తగియున్న, పూఁజప్పరమ్ముల - పూలపందిళ్ళపై, గుప్పుగుప్పున, శే కరువలి-పిల్లతుమ్మెదలు, తలిర్పన్-ఒప్పగా, ఉప్పరంబెగయు-పైకిపోవు, తిప్పలనన్-సమూహములనునట్లు, అనికల్పకల్పనల-చిత్రవిచిత్రగతులకు, తోడునీడలగు-స్థానములగు, ప్రోడచేడియలతోడన్-ప్రౌఢాంగనలతోడ, ఆడుచున్ బాడుచునుండి-ఆటలాడుచుఁ పాటలుపాడుచుండి ఒక్కనాఁడు-ఒకరోజున, మనోవినోదంబున-మనస్సునకు వినోదమును కల్పించుటకై.

సీ. పాటీర కోటీర ♦ కోటీ సమాటీక
మాన మందమరు త్కు ♦ మారగతులు
నాళీకపాళీ మృ ♦ ణాళీ కబళనై క
పాక పాక మరాళ ♦ బహు విహృతులు
సారంగ కీరాంగ ♦ నా రంగ నారంగ
పరిపక్వ ఫల పరం ♦ పరల రుచులు
వేలాప గాలాప ♦ లీలాపర పికావ
ళీ లాలిత మహో కు ♦ హూ లలితము
గీ. ఐందవశిలా కలాప ని ♦ ష్యందములును
సార మారంద సారణీ ♦ ధోరణులును

విలసిల్లు నొకానొక విలాస ♦ విపినమునను
తోడుచేడియలను గూడి ♦ యాడఁ దలఁచి. 63

టీ. పాటీర...గతులు - పాటీర కోటీర = శ్రేష్ఠములైన మంచి గంధపు చెట్లయొక్క, కోటీ - కోటులయందు, బహువృక్షములయందనుట, సంపాటీకమాన - సంచరించుచున్న. సురతుక్కమార = పిల్లవాయువుల యొక్క, గతులు - సంచారములును, నాళీక...వ్రాతులు - నాళీకపాళీ = పద్మపఙ్క్తుల యొక్క, మృణాళీ = తూండ్లయొక్క, కబళన = తినుటయే, ఏకపాక = ముఖ్యపరిపాకముగల, పాకనురాళి = పిల్లహంసలయొక్క, బహు - విస్తారమైన, విహ్వాతులు = విహారములు, సారంగ...రవములు - సారంగ = తుమ్మెదల యొక్కయు, కీర = చిలుకలయొక్కయు, అంగనా = స్త్రీలకు, రంగ - విహారస్థలమగు నారంగ = నారింజచెట్లయొక్క, పరిపక్వ = పండిన, ఫల = పండ్లయొక్క, పరంపరల = పఙ్క్తుల యొక్క, రుచులు = కాంతులును శేలా...లలితములు. శేలా = హద్దును, అపగ = దాటిపోయిన, ఆలాప = వాక్యముల యొక్క. లీలా = విలాసము, పర = ప్రధానముగల, పిక = కోయిలలయొక్క, ఆవళీ = పఙ్క్తియొక్క, లాలిత = సమ్మానించఁబడు చున్న, మత్ = గొప్పలగు, కుహూ = కుహూధ్వనుల యొక్క, (కోయెల కూతకు కుహువని పేరు) లలితములు = విలాసములును, ఐంద... ష్యందములును, ఐందవ శిలా = చంద్రకాంతమణుల యొక్క, కలాప = సమూహము యొక్క, నిష్యందములును = జలప్రవాహములును, సార... సారణులును. సార = శ్రేష్ఠమైన, మారంద = మకరంద సంబంధి యగు, సారణీ = పిల్లకాలువల యొక్క, ధోరణులును పఙ్క్తులును, విల సిలు = ప్రకాశించునట్టి, ఒకానొక విలాస విపినమునను = ఒక ప్రమదా వనమందు, తోడుచేడియలను గూడి = చెలికత్తెలను గూడి, ఆడఁదలఁచి విహరించుట కాలోచించి,

క. నిగ నిగలు గలిగి సొగసగు
తొగరుచి గురు పాదుకలను ♦ దొడిగి చెలుల్ తో
డుగ రా మగరా నిగరా
లం గరాళితమైన త్రోవ ♦ లం గనుంగొనుచున్. 64

టీ. నిగ నిగలు గలిగి = తాళతళ్యములు గలిగి, సొగసగు = మనో హరమైన, తొగరుచిగురు పాదుకలను = ఎఱ్ఱని చిగుళ్ళ పావలను, తొడిగి = ధరించి, చెలుల్ - చెలికత్తెలు, తోడుగరాఁ - వెంటరాఁగా, మగరా నిగరాలన్ - శ్రేష్ఠములగు వజ్రములచేత, కరాళితమైన - పొడవైన, త్రోవలన్ - మార్గములను, కనుంగొనుచున్ - చూచుచు,

సీ. కప్పు రా లొప్పు రా ♦ చప్పరాల నెసంగు,
కప్పురా ల్గప్పు మా ♦ ర్గమున నైనఁ
బలుకు రాచిలుక రా ♦ జులను రాగమొసంగు
పలుకురా ల్గులుకు మేల్ ♦ పద్య నైనఁ
బొదల సంపదల స ♦ మ్మొద లసద్గతిమించి
పొదలు తుమ్మెదలాడు ♦ పదవి నైన
విరుల పెందరుల పం ♦ దిరులఁ బుప్పొడి కుప్ప
లురులు సుందర లతా ♦ సరణి నైనఁ

గీ. గొమ్మ పూరెమ్మ బంగారు ♦ బొమ్మ ముద్దు
గుమ్మరో పోవలయునంచు ♦ నెమ్మి చెలులు
నమ్మికలు గ్రమ్మి తెలుపఁగా ♦ నమ్మనోజ
రాజసామ్రాజ్యలక్ష్మి బి ♦ రానఁ దరలి. 65

టీ. కప్పు...చప్పరాలన్, కప్పు-నల్లనైన, రాలు - రాళ్ళు, ఒప్పు - ప్రకాశించు, రాచప్పరాలన్ - రాతిచవికలచేత, ఎసఁగు - ఒప్పునట్టి, కప్పురాల్ - కర్పూరములు, కప్పు - క్రమ్మునట్టి, మార్గమునన్నైనన్ - త్రోవలయందైనను, పలుకు...రాగము, పలుకు-మాటాడును, రాచిలుక - రాజకీరముల యొక్క, రాజులకున్ - పక్షులకు, రాఁ మొసంగు - అనురాగమును బుట్టించునట్టి, పలుకురాల్ - ప్రతిధ్వనియిచ్చురాళ్లు, కులుకు - ప్రకాశించునట్టి, మేల్ - శ్రేష్ఠమయిన, పథ్యనైనన్ - త్రోవయందైనను, పావలసంపదలన్ - ఈరముల సంపదలయందు, సద్గతిన్ - మంచి సంచారముచేత, మించి - అతిశయించి, పొదలు - వృద్ధిఁబొందునట్టి, తుమ్మెదలాను - తుమ్మెదలు విహరించునట్టి, పదవిన్నైనన్ - త్రోవయందయినను, విరుల - పుష్పముల యొక్క, పెందరుల - పెద్ద చెట్లుగల, పందిరులన్ - పందిరులయందు, పొప్పొడి - పరాగముయొక్క, కుప్పలు - ప్రోవులు, ఊరులు - జాయమున్న, సుందరలతాసరణినైనన్ - చక్కని తీఁగలుగల త్రోవయందైనను, కొమ్మ - ఓ చిన్నదానా, పూఁరెమ్మ - పువ్వుఁగొమ్మా, బంగారుఁబొమ్మ - బంగారు బొమ్మవంటిదానా, ముద్దుగుమ్మరో - ఓ సుందరి, పోవలయునంచున్ - వెళ్ళవలయునని, నెమ్మిచెలులు - ఇష్టమగు చెలికత్తెలు, నమ్మికలు - నమ్మి-విశ్వాసములుగలిగి, తెలుపఁగాన్ - చెప్పఁగా, అమ్మనోజ రాజసామ్రాజ్యలక్ష్మి - ఆ మన్మథరాజ్యలక్ష్మి, బిరానన్ - సత్వరముగా, తరలి - బయలుదేరి.

క. సకనక కైతుక వైమా
నిక నికర వధూకరాగ్ర ♦ నీరద శంకా
చకచకిత కితవశిఖి మే
చక చకిత మరాళ శాలి ♦ జలపద పదవిన్. 63

టీ. స......విన్ - సకనకకైతుక - సువర్ణమయములయిన ఠెక్కెముల సమూహముతోఁగూడిన, వైమానికనికర - దేవతా సమూహము యొక్క,

వధూ - స్త్రీలయొక్క, కరాగ్ర - భుజములయందున్న, నీర......శిఖి - నీరద శంకా - మేఘసందేహముచే, చకచకిత - మిక్కిలి ప్రకాశించెడు, కితవశిఖి - ధూర్త మయూరములయొక్క, మేచక - నెమలిపురిచే, చకిత - భయపడిన, మరాళి - హంసలచే, శాలి - ఒప్పుచున్న, జలపదపదవిన్ - కొలనును.

సీ. వకుళ పాదప పల్ల ♦ వ కులముల్ విలసిల్లు
ముకుళముల్ రవజల్ల ♦ మూగికొనుచు
మలయ మారుత పోత ♦ వలయ మాడఁగఁ జూత
ముల యదృచ్ఛనువీత ♦ ములయినట్టి
తొగరుమించిన లేఁత ♦ చిగురుటాకుల మేత
కెగరు కోయిల కూఁత ♦ లగడుపఱుప
నదరి డెందములోన ♦ బెదరి చూచి తటానఁ
జెదరి తమ్ములలోనఁ ♦ బదరుచుండు
గీ. తుమ్మెదలు ఝుమ్మనుచు లేచి ♦ దొమ్మిపడుచు
నెడనెడఁ జలించు నెరిగొప్పు ♦ జడల నడరు
కమ్మతావికి వెనువెంటఁ ♦ గ్రిమ్మికొనఁగఁ
దోడుచేడెలతోడను ♦ గూడి చనుచు. 67

టీ. వకుళ...కులముల్, వకుళపాదప - పొగడచెట్లయొక్క, పల్లవ కులముల్ - చిగురుగుంపులు, విలసిల్లు - ప్రకాశించునట్టి, ముకుళముల్ - మొగ్గలను, రవఁజల్లన్ - పాడివలెఁజల్లఁగా, మూగికొనుచున్ - ఆవరించుచు, [ఇది తుమ్మెదలకు విశేషణము] మలయ పర్వత సంబంధమయిన శీతగాలియొక్క సముదాయము, ఆడఁగన్ - విసరఁగా, చూతములన్ - మామిడిచెట్లలోనుండి, యదృచ్ఛను - తమంతటదామే, వీతములయినట్టి -

బయలు వెడలునట్టి, తొంగరుమించిన — ఎఱ్ఱవయొఱుపుగల, లేఁతచిగురు టాకుల - లేతవైన పల్లవములయొక్క, మేతకున్ - ఆహారమునకు, ఎగరు పైకి లేచిన, కోయిల - కోయిలలయొక్క, కూఁతలు - ధ్వనులు, అగడుపరు పన్ - తొట్రుపడఁజేయఁగా, అదరి - చలించి, డెందములోనన్ - మన మనస్సులో, బెదరి - భయపడి, చూచి - వీక్షించి, తటాలునన్ — హఠాత్తుగా, చెదరి - విడిపోయి, తమ్ములలోనన్ - పద్మములలో, పదను చుంయు-ధ్వని చేయుచుండునట్టి, తుమ్మెదలు - తేంట్లు, ఝుమ్మను చు లేచి - ఝుంకారముఁ జేయుచు లేచి, దొమ్మిపడుచున్ - చీకాకుపడుచు, ఎడనెడన్ - అక్కడక్కడ, చలించు - కదలెడు, నెఱి - శ్రేష్ఠమయిన, కొప్పుజడలన్ - కొప్పులయందును, జడలయందును, అడరు - ఒప్పునట్టి, కమ్మతావికిన్ — మంచి పరిమళమునకు, వెనువెంటన్ - వెంబడిగా, క్రమ్మికొనఁగన్ — ఆవరించఁగా, తోడుచేడెలతోడను - చెలికత్తెలతో, కూడి - కూడుకొని, చనుచున్ - వెళ్ళుచు.

ఉ. అంగనయుం గనుంగొనె వ♦నాంగణ సంగి లవంగ లుంగ నా
రంగ కుడుంగ శృంగ శత♦రంగ తరంగిత ఖాంతరంగణా
నంగ తురంగ పుంగవ వి♦హంగమ భృంగ కుళింగ కాంగనా
భంగ రవ ప్రసంగమున ♦ భాసిలు కేళి వనీ లలామమున్.

టీ. అంగనయున్ - ఆచిన్నదియు, వనాంగణ ... ప్రసంగమునన్; వనాంగణ - వనసీమయందు, సంగి-కలసికొన్న, (ఉన్నవియనుట) లవంగ - లవంగపుచెట్లయొక్కయు, లుంగ - ప్రుల్లమాదీఫలపు చెట్లయొక్కయు, నారంగు - నారింజచెట్లయొక్కయు, కుడుంగ - పొదలుగల, శృంగ - పర్వత శిఖరముయొక్క, శత - వందలయొక్క, రంగు - ప్రదేశములచేత, తరంగితన్ - వ్యాప్తమయిన, ఖ - ఆకాశముయొక్క, అంతరంగణ - మధ్య ప్రదేశమందలి అనంగ - మన్మథునియొక్క, తురంగపుంగవ - అశ్వశ్రేష్ఠములగు,

విహంగముః - పక్షులనఁగాఁజిలుకలయొక్కయు, భృంగ - తుమ్మెదల యొక్కయు, కుళింగక=పక్షివిశేషములయొక్కయు, అంగనా = స్త్రీలయొక్క అభంగ - ఎడతెగని, రవప్రసంగమునన్ = ధ్వనియొక్క ప్రసక్తిచేత, భాసిలు ప్రకాశించునట్టి, కేళివనీ లలామమున్ - క్రీడావనశ్రేష్ఠమును, కనుంగొనెన్- చూచెను.

వ. మఱియు నయ్యుపవనంబు జవన పవన ప్లవన విచల దమంద తటినీ తట వికట చటుల సురవిటపి పట నటదేలా లతికా లాలిత డోలా పరిలోల భ్రమర బాలా కలితాలాప సుధా లాలస వేలాపగ లీలా వర వైలాసిక మాలాకృత నీలాంబుజ జాలాంబక మూలాగమ కోలాహల ఖేలా హాల హాళిక మెలకువలకు మరు బలుకు కలికిచిలుక పేఁటికల తాండంబు లుద్దండంబులగు తుండంబుల ఖండింప మెండుగ నవని మండలంబునం బడు ఫల ఖండంబులు మెసవి మెసవి యసను కుసుమ రస వశంబున ముదముదయింప నింపుగాఁ బాఱు నభంగ భృంగాంగనల సంగీతభంగీ ప్రసంగంబున నంతరంగంబు లుప్పొంగ నిలిచి నిలిచి దర తరళతరల సదసమ కుసుమ విసర విస్మృమర రజో ప్రజోపరాగంబున గాత్రమ్ములు చిత్రమ్ములుగా నుండి యుండి చండ కర కిరణ మండలంబు మెండుకొన నలరు జ్వాలాభీషణమ్ములనఁ దరలి మరుమరీచి వీచికలఁ దిరిగితిరిగి సొరిగి, హరిణాంకోపల ఫలక కుల కలితాలవాల జాలమ్ముల నిండిన పజ్జ నలరు గొజ్జఁగి తీవల నీరు కొంత సేపు దాఁగ్రివుచు నంతలో నచట బింబితమ్ములగు తమవిచి

త్రగాత్రంబులు చూచిచూచి, విలక్షణ లక్షణ మృగమ్ములని యెంచి యుదంచిత భయమ్మునం బరువెత్తు కురంగ పుంగవ మ్ములును, కురంగ పుంగవమ్ములం గనుంగొని యనంగ సంగర ప్రసంగమ్మునకుం బోషిత కురంగికలం గలియం బాచు పుళింద మిళింద సుందరాల కాబ్బాందమ్ముల సల్లలిత చరణ పల్లవమ్ముల నుల్లసిల్లు మంజుతర కంజరాగ పుంజ పింజరిత మంజీర పుంజంబులం జెలువలరు శింజారవమ్ములకు బెదరి దిక్కుదిక్కుల దృక్కులు పిక్కటిల్ల మెల్లమెల్లన సంచరించు పరిసర సర స్తరంగ మాలికా డోలికా కేళికాశాలి కాంచన మరాళికా బాలికా జాలంబుల గగు త్పరంపరల తుంపురుల గుంపు తళుకొత్తు క్రొత్త ముత్తియంపు సంపదల నింప గింపె సంగు పచ్చ గాతట్టుల బిట్టు లవఘళించు పద్మినీ పత్రంబులం జూచి తివియందివురనెంచు కుమారికల యాగమ్ములం గులుకు మెఱుంగులనియుం బ్రఫుల్ల పల్లవోల్లసిత సల్లకీ విటప విఘట నోచిత కరప్రచారంబులగు సామజ వారంబుల బృంహితంబు లురుములనియు, నావర్త నర్తనోద్వృత్త గంధ గంధవహ సంధుక్షిత విచిత్రపరాగ పూగంబులు పురందరశరాశన యోగంబులనియు, నిబిడ తమ తమాల నికురుంబంబులం బరా లంబి కాదంబినీ డంబరంబులనియు, భ్రమించి సంభ్రమించి రమించు శిఖండి మండలంబుల పింఛసంచలన ప్రపంచమ్ములు గాంచి తల-ఖవాంచి గానతాన ప్రతానమ్ములం జాలించు

పటీర విటపి విటప కుటీతటీనటన ఘటన పటుచటుల భుజంగ పుంగవాంగనలును, భుజంగపుంగవాంగనల సంగీత ప్రసంగంబునం గఱంగు కురంగటి యురుంగులం జెలంగు కలువరేని మానికంబుల నుల్లసిల్లు పెల్లు వెల్లువల నల్లనల్లన నల్లుకొను మల్లికావల్లికా మతల్లి కల చల్లని నీడల నుండియుండి, తండోపతండంబులుగా నొండుకొని యొండొరులం జెండాడు వరాహవ్యూహంబుల కష్ట దంష్ట్రికా ఘట్ట ఘట్టనంబులం బగులు వెదురుపొదల కణుపూడుపునం జిటిలు మౌక్తిక పటలంబులు తటాలునందాక, పుళిందబృంద సంధానిత నళికా పాళికోన్ముక్త గుళికా నికాయంబులని యురుకు చురు కురంగ పుంగవమ్ముల పొక్కిళ్ళం గక్కసంబులగు మార్గ మార్గ కిరాత జాత నిఖాత ఛురికాభి ఘాతంబునం జారు క్రొత్త కస్తూరికా వికారంబులం బొడము నవీన పరిమళ పరీవాహంబులునుం గలిగి డెందంబున కమందానందంబు సంపాదింప నెచ్చెలులతోడం గూడుకొని యచ్చెలువ యుద్యానంబుం బ్రవేశించు సమయంబున. 69

టీ॥ మఱియుఁ - ఇంతేకాక, అయ్యుపవనంబు - ఆ యుద్యానము జవన...మెలకువలకుఁ, జవన - వేగము గల, పవన - గాలి యొక్క, ప్లవన - దాటులచేత, విచలత్ - కదలుచున్న, అమంద - విస్తారమగు, తటినీ - నదులయొక్క, తట - ఒడ్డుల యొక్క, నికట - సమీపమందలి, చటుల - చంచలములగు, సురవిటపి - మందారవృక్షములయొక్క, పటల - సమూహమందు, నటత్ - ఆడుచున్న, ఏలా లతికా - ఏలకి తీగలనెడు, లాలిత - లాలించఁబడు, డోలా - ఉయ్యెలలయందు, పరి-

లోల - ఆసక్తలగు, అమరబాలా - దేవతా స్త్రీలచేత, కలిత - పలుకఁబడుచున్న, ఆలాపసుధా - అమృతము వంటి పలుకులయందు, లాలస - ఆసక్తులగు, వేలాపగ - హద్దులేని, లీలా - విలాసము చేత, శర - శ్రేష్ఠులగు, వైలాసిక - విలాస స్వభావులయొక్క, మాలా పఙ్క్తిచేత, కృత = చేయఁబడిన, నీలాంబుజ జాలాంబక = నల్లకలువలే బాణములుగల మన్మథునకు (అనఁగాఁ గామోద్రేకమునకు) మూల = కారణమైన, ఆగమ = శాస్త్రముయొక్క, (అనఁగాఁ సంగీతముయొక్క) కోలాహల = కలకలము యొక్క, ఖేలా, విలాసముయొక్క, హళహళిక = కందరగోళముయొక్క, మెలకువలకున్ - నేర్పులకు, మరుబల్కు = మారుమాట చెప్పునట్టి కలికిమకో హరములగు, చిలుకపిలుకల - చిలుక పిల్లలయొక్క, తండంబులు = సమూహములు, ఉద్దండంబులగు, = తీక్ష్ణములగు తుండంబులన్ = ముట్టెలచేత, ఖండింపన్ = కొట్టఁగా, మెండుగన్ = అతిశయముగా, అవనిమండలంబునన్ = భూప్రదేశంబున, పడు = పడినట్టి, ఫలఖండంబులు=పండ్లముక్కలు, మెసవి - తిని, అసమ = సమానములేని, కుసుమరస = మకరందమునకు, వశంబునన్ = స్వాధీనత్వముచేత, ముదముదయింపన్ - సంతోషము గలుగునట్లుగా, ఇంపుగాన్ - మనోహరముగా, పాడు-గానముఁజేయునట్టి, అభంగ = భంగములేని, భృంగాంగనల = ఆడు తుమ్మెదల యొక్క, సంగీతభంగి = గానరీతియొక్క, ప్రసంగంబునన్ = ప్రసక్తిచేత, అంతరంగంబులు = మనస్సులు, ఉప్పొంగన్, ఉబ్బఁగా, నిలచినిలచి = ఆగి యాగి, దర... రాగంబునన్ —దర = కొంచెముగా, తరళతర = మిక్కిలి చలించుచున్న లసత్ = ప్రకాశించుచున్న, అసమ = సమానములేని, కుసుమనిసర = పుష్పసమూహముయొక్క, విసృమర = వ్యాపించుస్వభావముగల, రజోవ్రజ = పరాగసమూహముయొక్క, ఉపరాగంబునన్ = ఆవరణముచేత, గాత్రమ్ములు = దేహములు, చిత్రమ్ములుగాన్ = చిత్రవర్ణములుగలవిగా, ఉండియుండి, చండకరకిరణమండలంబునన్ = సూర్యకిరణ సమూహమును, మెండుకొనన్ - వ్యాపించఁగా, అలరు = ఒప్పుచున్న, జ్వాలా = మంటలవలె, భీషణంబునన్ = భయంకరస్థితిచేత

మరలి మళ్ళుకొని, మరుమరీచికలన్ - మరు = నీరులేని బయళ్ళయందైన, మరీచికలన్ = ఎండమావులయందు, తిరిగితిరిగి = సంచరించి సంచరించి, సొరిగి = మూర్ఛిల్లి హారి ..జాలంబులన్ - హరిణాంకోపల = చంద్రకాంత మణులయొక్క, ఫలక = ఫలకములయొక్క కుల = సమూహముచేత, కలిత-చేయఁబడిన, ఆలవాల = పాదులయొక్క, జాలంబులన్ - సమూహముల యందు, నిండిన - పూరించిన, పజ్జనలరు - సమీపమందొప్పుచున్న, గొజ్జఁగి తీవల - గొజ్జంగితీగలయొక్క, నీరు - జలము, కొంతసేపు - ఇంచుకసేపు, త్రావుచున్ పానము సేయుచు, అంతలోన్ - అంతటిలో, అచటిలో, అచట ఆ పాదులయందు బింబితంబులగు - ప్రతిఫలించిన, తమ విచిత్ర గాత్రంబులు స్వీయములగు చిత్రశరీరములు, చూచి - ఆలోకించి, విల ... మృగమ్ములని, విలక్షణ - వేరు రూపుగల, లక్షణ-స్వరూపములుగల, మృగమ్ముల - మెక ములని, ఎంచి - ఆలోచించి, ఉదంచితభయమ్మునన్ -అతిశయించిన బెదురు చేత, పరువెత్తు - పరుగువారుచున్న, కురంగపుంగవమ్ములును- శ్రేష్ఠములగు లేళ్ళను, కురంగ పుంగవమ్ములన్ - శ్రేష్ఠములగు లేళ్ళను, కనుంగొని - చూచి, అనం ... ప్రసంగమ్మునన్ - అనంగ సంగర - సంభోగము యొక్క ప్రసంగంబునకున్ - ప్రసక్తికై, పోషితకురంగికలనన్ - పెంపుడు లేళ్ళను, కలియఁబంచు - కలియుటకై పంపునట్టి, పుళింద...బృందమ్ముల - పుళింద - చెంచువాండ్ర యొక్క, మిళిందసుందరాలకా - స్త్రీల యొక్క, బృందమ్ముల సమూహముల యొక్క, సత్ - మంచివియగు లలిత - సుందరములగు, చరణపల్లవమ్ములన్ - చిగుళ్ళవంటి పాదములయందు, ఉల్లసిల్లు - ప్రకాశించుచున్న, మంజుతర - మిక్కిలి మృదువులగు, కంజరాగ - పద్మరాగముల యొక్క, పుంజ - సమూహముచేత, పింజరిత - వ్యాపింపఁబడిన, మంజీర - అందెలయొక్క, పుంజంబులన్ - సమూహములయందు, చెలువలరు - శోభించుచున్న, శింజారవమ్ములకున్ = శింజాధ్వనులకు, బెదరి - భయపడి. దిక్కు దిక్కునన్ - ప్రతి దిక్కులయందును, దృక్కులు - చూపులు, పిక్కటిల్లన్ - విజృంభింపఁగా, మెల్ల మెల్లనన్ - మందమందముగా, సంచ

రించు - తిరుగుచున్నట్టి, పరి... జాలాంబుల - పరిసర - సమీపమందలి, సరః - మడుగుల యొక్క, తరంగ - అలలయొక్క - మాలికా - పంక్తులనెడి, డోలికా - ఉయ్యేలలయందు, కేళికా - క్రీడతోడ, శాలి - ఒప్పుచున్న కాంచనమరాళికా-బంగారపు ఆడ హంసలయొక్క. బాలికా-పిల్లలయొక్క, జాలంబుల-సమూహములయొక్క, గరుత్ - ఱెక్కల యొక్క, పరంపరల - పఙ్క్తులయొక్క, తుంపురుల - జలబిందువులయొక్క, గుంపు - సమూహము, తళుకొత్తు - తళతళలాడు, క్రొత్తముత్తియంపు - క్రొత్త ముత్తెములయొక్క సంపదలన్ - సంపత్తులచేత, ఇంపెసఁగు-మనోహరములగు, పచ్చరాతిట్టుల- పచ్చరాళ్ళ ప్రదేశములయొక్క, బిట్టులు - అతిశయములు, అవఘళించు - తిరస్కరించుచున్నట్టి, పద్మినీ- తామరల పొదలయొక్క, పత్రంబులన్-ఆకులను, చూచి - వీక్షించి, తివియన్ - వానిలాగుటకు, తివురు నెంచు - వేడుక పడు, కుమారకల-చిన్నపిల్లలయొక్క, అంగమ్ములన్ - శరీరములను, కులుకు- శోభించుచున్నట్టి, మెఱుంగులనియు- మెఱపులనియును, ప్రఫుల్ల......చారంబులగు, ప్రఫుల్ల - వికసించిన పల్లవ-చిగుళ్ళచేత, ఉల్లసిత - ప్రకాశింపఁజేయఁబడిన, వల్లకీ-అందుగుచెట్లయొక్క, విటప - శాఖావిస్తారముయొక్క, విఘటన - విరచుటకు, ఉచిత-తగిన, కర - తుండములయొక్క, ప్రచారంబులగు-ప్రసారముగలవియగు, సామజ-ఏనుఁగులయొక్క, వారంబుల-సమూహములయొక్క, బృంహితంబులు - బృంహితధ్వనులు, ఉరుములనియు - గర్జితములనియు, ఆవర్త......పూగంబులు-ఆవర్త, నర్తన-సుడి దిరుగుటయందు, ఉద్వృత్త - అతిశయించిన, గంధ - పరిమళయుక్తమైన. గంధవహ - గాలిచేత, సంధుక్షిత = కూర్చఁబడిన, విచిత్ర = అనేకవర్ణములుగల, పరాగ = పుష్పొడులయొక్క, పూగంబులు=సమూహములు, పురందర శరాసన-ఇంద్రధనస్సుయొక్క, యోగంబులనియు - సంబంధములనియు, నిబిడతర - మిక్కిలిదట్టమగు, తమాల = చీకటిమ్రాను చెట్లయొక్క, నికురుంబంబులు — సమూహములు, అంబరా...డంబరంబులు, అంబర - ఆకాశమందు, అలంబ వేరిలుచున్న, కాదంబినీ-మేఘపఙ్క్తియొక్క, డంబరంబులనియు - ఆటోపము

లనియును భ్రమించి-భ్రమపడి, సంభ్రమించి - త్వరపడి, రమించు - క్రీడించు నట్టి, శిఖండి మండలంబుల - నెమిలిగుంపులయొక్క, పింఛ - పురులయొక్క సంచలన - కదలుటయొక్క, ప్రపంచమ్ముల-విస్తారములు, కాంచి - చూచి తలల-శిరములు, వాంచి - వంచి గానతానప్రతానమ్ములన్ - సంగీతముల యందలి తానముల సమూహములను, చాలించు = మానునట్టి, పటీర... గవులును — పటీరవిటపి = మంచిగంధపు చెట్లయొక్క, విటప = శాఖావి స్తారముయొక్క, కుటీ - చిన్నయిండ్లయొక్క, తటీ - ప్రదేశమందు, నటన- సంచారముయొక్క, ఘటన - కూర్పుటయందు, పటు - సమర్థములయిన, చటుల-చంచలములగు, భుజంగపుంగవ = సర్పశ్రేష్ఠములయొక్క, అంగనలు ను-స్త్రీలును, భుజంగపుంగవాంగనల-సర్పశ్రేష్ఠముల స్త్రీలయొక్క, సంగీత ప్రసంగంబునన్ - గానప్రసక్తిచేత, కఱంగు - నీరుసరించునట్టి, కురంగ టి - దగ్గిరనున్న, అరుంగులన్ - వేదికలయందు, చెలంగు - ఒప్పుచున్న, కలు వరేని మానికంబులన్-చంద్రకాంతమణులచేత, ఉల్లసిల్లు - ప్రకాశించునట్టి వెల్లు-విస్తారమగు, వెల్లువన్ - నీటికాలువలచేత, అల్లనల్లనన్ - మెల్లమెల్ల గా, అల్లుకొను-ఆవరించునట్టి, మల్లికావల్లికాపతల్లికల - శ్రేష్ఠములగు మల్లె తీగలయొక్క, చల్లనినీడలన్ - శీతలచ్ఛాయలయందు, ఉండియుండి-నిలచి నిలచి, తండోపతండంబులుగా, తెంపిలేక - మొందుకొని - అతిశయించి, ఒండొరులన్ - అన్యోన్యమును, చెండాడు - కొట్టునట్టి, వరాహవ్యూ హంబుల = పందులగుంపులయొక్క, దుష్ట-కఠినములగు, దంష్ట్రికా - కోరల యొక్క, ఘట్ట - సమూహముయొక్క, ఘట్టనంబులన్ - దెబ్బలచేత, పగు లు-బ్రద్దలయిన, వెదురుపొదల - వెదురు డొంకలయొక్క, కణుపుడొంపు నన్ = కణుపులూడిపోవులచేత, చిటిలు-తూలునట్టి, మౌక్తికపటలంబులు — ముత్తెపుసమూహములు, తటాలునన్ - చటుకున, తాకన్ - తగులఁగా, పు ళింద......నికాయంబులు, పుళింద - చెంచువాండ్రయొక్క, వ్యూహ - స మూహముచేత, సందానిత-కూర్పఁబడిన, నళికా-తుపాకులయొక్క, పాళి కా-పఙ్క్తిచేత, ఉన్ముక్త-విడువబడిన, గుళికా-గుండ్లయొక్క, నికాయంబు

ఆలి - సమూహములను, ఉరులు - తూలింపఁజాలున్న, ఉరు — గొప్పవియగు, తురంగ పుంగవమ్ముల - మృగములయొక్క, పొక్కిళ్ళన్ - నాభుల యందు, కక్కసంబులగు - కఠినములగు మార్గ - కస్తూరియొక్క మార్గ - పొదుగుటగల, కిరాతజాతి - చెంచువాండ్రసమూహముచేత, ఖాత = పొడిచఁబడిన, ఛురికా = కత్తులయొక్క అభిఘాతంబున్ = దెబ్బచేత జారు - తొంగుచున్నట్టి, క్రొత్త - నవీనమయిన, కస్తూరికావికారంబులన్ - కస్తూరియొక్క వ్యాప్తిచేత, గాఢము - పుట్టునట్టి, అరీణ - జారినట్టి, పరిమళ - వాసనల యొక్క పరీవాహంబులునున్ - ప్రవాహములును, కలిగి - ఉండి యొందంబునకున్ - మనస్సునకు అమంద - అధికమయిన. ఆనందంబు - సంతోషమును, సంపాదింపన్ - పుట్టించఁగా, అచ్చెలులతోడన్ - ఆచెలికత్తెలతో. గూడుకొని - కలసికొని, అచ్చెలువ - ఆచిన్నది, ఉద్యానంబునన్ - ఉద్యానవనమును, ప్రవేశించు సమయంబునన్ - ప్రవేశించునప్పుడు,

క. వనపాలిక నత్తరినొక
వన పాలిక వినయ మొనయ ♦ వచ్చి జగజ్జీ
వన పాలిక యాకైరవ
వన పాలిక పాదములను ♦ బడి యిట్లనియెన్. 70

టీ. వనపాలికన్ వనపంక్తియందు, అత్తరిన్ - ఆసమయమందు, ఒక వనపాలిక - ఒకవనమును గాపాడువాడుది, వినయ మొనయన్ - వినయ మొప్పునట్లు, వచ్చి - ఏతెంచి, జగజ్జీవనపాలిక, జగత్ - లోకముయొక్క, జీవన - జీవితమును, పాలిక - పాలించునట్టి, ఆ - అట్టి, కైరవవనపాలిక - కైరవవన - కలువపాదను, ప - పాలించునట్టి చంద్రునివంటి, అలిక - లలాటముగలచిన్నదానియొక్క, పాదములను - కాళ్ళమైని, పడి - ఒరఁగి, ఇట్లనియెన్ - ఈప్రకారము జెప్పెను.

సీ. తొగకంటి! కంటె య ♦ ధ్వగ మాన లుంటాక
కంటకంబగు నీ కు ♦ రంటకంబు

నించుబోఁడిరో విలో ♦ కించితే మదభృంగ
కంపకంబైన యీ ♦ చంపకంబు
కంజాక్షి కనుఁగొంటె ♦ మంజరీ కింజల్క
మంజులంబైన యీ ♦ వంజులంబు
కాంచనాంగిరో విలో ♦ కించితే యుల్లాసి
కేసరంబైన యీ ♦ కేసరంబు
గీ. కీర కంఖాణ రింఖణ ♦ ఖేర పంచ
బాణ బహుళ ప్రతాప పా ♦ వక శిఖా ని
కాశ పల్లవ జాతమీ ♦ కాంత చూత
జాతమును జూచితే బాల ♦ చంద్రఫాల. 71

టీ. తొగకంటి-కలువవంటి కన్నులుగల యోచిన్నదానా, అధ్వ...కంటకంబు అధ్వగ-మార్గస్థులయొక్క (అనఁగా విరహవంతులయొక్క) మాన-గర్వమునకు లుంటాక - హరించునట్టి, కంటకంబగు - ముండ్లుగల, ఈకురంటకంబున్-ఈపచ్చపువ్వుఁగోరంటచెట్టును, కంటే-చూచితివా, ఇంచుబోఁడిరో-చెఱకువలె మనోజ్ఞములగు నవయవములుగల యో చిన్నదానా, మద-మదముతోఁగూడిన, భృంగ-తుమ్మెదలకు, కంపకంబగు-కంపింపజేయునట్టిదైన, ఈ చంపకంబున్-ఈసంపెంగచెట్టును, విలోకించితె-చూచితివా, కంజాక్షి-పద్మములవంటి నేత్రములు గల యో చిన్నదానా, మంజ...మంజుల, మంజరీ-పువ్వులగుత్తులయొక్క, కింజల్క-కేసరములచేత, మంజులంబైన-మృదువైన, ఈవంజులంబున్=ఈయశోకవృక్షమును, కనుగొంటె-చూచితివా, కాంచనాంగిరో-బంగారమువంటి దేహముగల యోచిన్నదానా, -ఉల్లాసికేసరంబు-వికసించిన కింజల్కములుగల, ఈకేసరంబున్=ఈపొగడచెట్టును, విలోకించితె-చూచితివా, కీర...జాతము, కీర కంఖాణ-చిలుకయే గుఱ్ఱముగల,

మన్మథునియొక్క, రింఖణ-చలనముగల, ధీర - గంభీరములైన, పంచబాణ- అయిదుబాణములయొక్క, బహుళీ-విస్తారమగు, ప్రతాప పావక - ప్రతాపాగ్నియొక్క, శిఖా- జ్వాలలతోడ, నికాశ — సమానమగు, పల్లవ — చిగుళ్ళయొక్క, జాతము సమూహముగల ఈ - ఇట్టి, కాంత - సుందరమైన, చూత - మామిడిచెట్ల యొక్క, జాతమును - సమూహమును, బాల చంద్రఫాల- లేఁతచంద్రునివంటి లలాటము గల యోచిన్నదానా, చూచితే- కనుఁగొంటివా.

శా. సంతుష్టాంతర కంతురాజ కర వి♦శ్రాంతానలాంత శ్శిఖా
సంతప్తాంత లతాంత కుంత కృత దు♦స్సంతాప చింతా పరి
శ్రాంత స్వాంత నితాంతతాంతతరుణీ♦సంతాన మిక్కానసో
పాంతం బింతిరో నీవురా వసర మో♦దంతంబుచే బొల్చెడిన్॥72

టీ. సంతు......సంతానము, సంతుష్ట = సంతోషించిన, అంతర = అంతఃకరణగల, కంతురాజ = మన్మథరాజుయొక్క, కర = హస్తమందు, విశ్రాంత = నిలచియున్న, అనల = అగ్నియొక్క, అంతఃశిఖా = లోపలి జ్వాలలచేత, సంతప్త = కాల్పఁబడిన, అంత = చివరలుగల, లతాంత = పుష్పములనెడి, కుంత = ఈటెలచేత, కృత - చేయఁబడిన, దుస్సంతాప = దుష్టతాపము చేతనైన, చింతా = విచారము చేత, పరిశ్రాంత - అలసిన, స్వాంత - చిత్తము గలిగినట్టియు, నితాంత = అత్యంతము - తాంత = బడలికగల, తరుణీ - స్త్రీల యొక్క, సంతానము = సమూహముగల, ఇక్కానసోపాంతంబు = ఈవన ప్రాంతము, ఇంతిరో = ఓచిన్నదానా, నీవురాక్ నీవు రాఁగా వన రమోదంతంబుచేక్ = వనలక్ష్మి వార్తచేత, పొల్చెడిక్ = ఒప్పును.

క. అని వనపాలిక దెలుపఁగ
మనమున ముద ముదయమంద ♦ మందార లతా

ఘన సరణిఁ దరుణి చనుచోఁ
జనువున నవచంద్రిక యను ♦ సఖి యిట్లనియెన్॥

టీ. అని = ఇట్లని, వనపాలిక = వనపాలిక, తెలుపఁగన్ - చెప
మనమునన్ - మనస్సునందు, ముదము - సంతోషము, ఉదయమంది
పుట్టఁగా, మందారలతా = మందార వృక్షపు తీఁగలయొక్క, ఘన = గ
యగు, సరణిన్ - త్రోవయందు, తరుణి - ఆచిన్నది, చనుచోన్ -
నపుడు, చనువునన్ - స్నేహముచేత, నవచంద్రికయను సఖి - నవ
యను పేరుగల చెలికత్తె, ఇట్లనియెన్ - ఈ ప్రకారము జెప్పెను.

చ. జలజలరాలుపూ లలర ♦ సాల రసాల రసాల రాజిలో
పలఁ దగు కోకిల చ్ఛటల♦పాటల పాటల పావనామృ
జ్జ్వలత దలిర్ప నేర్పఁగల ♦ వా కలవా కలవాణి యో
వ లరు లతాళి నేల నవ♦లా నవలానవ లాఘవంబున

టీ. జల జల రాలు - జల్లున రాలునట్టి, పూలలరన్ - పుష్ప
వికసించఁగా సాల...లోపలన్ = సాల- మద్దులు, రసాల - తీయమా
అన్నట్టి, రసాల - వృక్షములయొక్క, రాజిలోపలన్ - పంక్తియం
అమరిన, కోకిలచ్ఛటల - కోయిలగుంపుల యొక్క, పాటలన్ - 
లను, పాటల...జ్జ్వలత - పాటల - కలిగొట్టు చెట్లయొక్క, పా
నిర్మలమయిన, అమృత= మకరందమువలె, ఉజ్జ్వలత - ప్రకాశము, తలి
ఒప్పునట్లు, నేర్పఁగలవా - కలుపఁగలవా, కలవాణి - అవ్యక్తమధుర
గల యోచిన్నదానా, నీవు = అలరులతాళిన్ - పువ్వుతీవల గుంప
ఓరఁగలవా = ఒరఁగగలవా, నవలా = ఓ చిన్నదానా, నవలాఘవంబు
క్రొత్త యగౌరవముచేత, నవము - నగము, అననేల - పొందనేందుకు,
(నబలక భేదముచేత) -బలాయని ప్రశంసార్థము. (పువ్వుదీవలచెంత

బడినచో, నగలు ధరించుట యగౌరవమే కాని వేరు లాభము లేదని తాత్పర్యము.)

చ. కల రవ కీర వార కలి ♦ కాకలికా కలికావికారముల్
తొలఁగక యొప్పు కల్పలత ♦ లోలత లోలతలోదరీ వన
స్థలిఁ గనుఁగొంటె నీవు వని ♦ తా వని తావని తాపమందకీ
నెలవులుజూచుమా వరమ♦ణీ రమణీ రమణీయవైఖరిన్ ॥75

టీ. కల రవ కీర వార కలి కాకలికా, కల - అవ్యక్తమధురమగు, రవ = ధ్వనిగల, కీర = చిలుకల యొక్క, వార = సమూహముతోడ, కలి = విరోధముగల, కాకలికా = సూక్ష్మమధురధ్వనిగల యోచిన్నదానా, కలికా వికారముల్ = మొగ్గలప్రామర్యములను, తొలఁగక = విడిపోక, కల్పలత = కల్పవృక్షలత, లోలతన్ = చాంచల్యముచేత, ఒప్పున్ = ప్రకాశించును, లోల తలోదరీ = చంచలమగు నరచేతివలె పలుచనగు నుదరముగల యోచెలీ నీవు = నీవు, వనస్థలిన్ - వనభూమిని కనుఁగొంటె, చూచితివా, వనితా - ఓచిన్నదానా, వని = ఈ స్థానము, తావని - నివాసస్థలమని, తాపమందకు - బాధనొందకుము. వరమణీ - శ్రేష్ఠములగు మణులుగలదానా, రమణీ = సుందరీ, రమణీయ వైఖరిన్ - మంచిరీతిచేత, ఈ నెలవులు జూచుమా = ఈస్థలములు గాంచుమా!

సీ. వనవన ప్రథిత దే♦వవ వనప్రియ కుహూ
ఘనఘన ప్రచిత రం♦జన జనంబు
కలకల స్ఫుర దగాం♦చలచల త్కుసుమ కే
వల నలభ్రమర పు♦ష్కల కలంబు
సరస రజ్యనురు కే♦సర సరప్రభవ దా
దర దర స్ఫురత కి♦న్నర నరంబు

ధగధగ జ్వాలనపుం ♦ జగ జగజ్జయి సుమా
శుగ శుగర్దిత మనో♦బ్జ గజగమన
గీ. మలయ మలయజ ధరణిభృ ♦ ద్వలయ నిలయ
పవన జవ నట దురు లతో♦పవన భవన
భవ నవరజో ప్రజోదయ♦భాసురంబు
వాసి కెపుడెక్కెను వసంత♦వాసరంబు.

టీ. వన...జనంబు = వనవన = ప్రతివనమందును, ప్రథిత=ప్రసిద్ధవ
కేవన = క్రీడగల, వనప్రియ=కోయిలలయొక్క, కుహూ = కోయనుధ్వని
ఘనఘన = ఘనప్రకారమగునట్లు, ప్రచిత = వ్యాప్తమగు, రంజన -
తోషముగల, జనంబు = మనుష్యులుగలదియు, కల......కలంబు - కల
ధ్వనులచేత, స్ఫురత్ - ప్రకాశించుచున్న, అగాంచల-కొండచివరలయ
చలత్ - కదలుచున్న, కుసుమ - పువ్వులయందు, కేవల - ముఖ్యము
వలత్ = చంచలించుచున్న, భ్రమర - తుమ్మెదలయొక్క, పుష్కల
విస్తారమగు, కలంబు - అవ్యక్తమధురధ్వనిగలదియు, సరస...వరంబు, సర
మకరందముతో గూడినట్టియు, గజ్యత్ - ప్రకాశించుచున్న. ఉరు - గొ
లగు, కేసరసర-పొగడపూదండలయందు, ప్రభవత్ - పుట్టుచున్న, ఆదర
ఆదరముగల, దరస్ఫురిత - ఇంచుకచలించుచున్న, కిన్నర- దేవయోని వి
లును, నరంబు - మనుష్యులునుగలదియు, ధగ.........గమనము-ధగధగ
ధగలాడుచున్న, జ్వాలన - అగ్నికణములయొక్క, పుంజ - సమూహ
ను, గ - పొందిన, జగజ్జయి - లోకములనుజయించిన, సుమాశుగ - మ
ధునిచేతనైన, శుక్ - దుఃఖముచేత, అర్దిత - పీడించఁబడిన, మనోబ్జ = మ
పద్మములుగల, గజగమనము - స్త్రీలుగలదియు, అలయ...భాసురంబు - అ
య - అణఁగిపోవని, మలయజ ధరణిభృత్ - మలయపర్వతముయొక్క
వలయ - మండలమందు, నిలయ - స్థానముగల, పవన - గాలియొక్క,

వేగముచేత, నటత్ - కదలుచున్న, ఊరు - గొప్పలగు, లత - తీఁగలుఁగల, ఉపవనభవన - ఉద్యానగృహముల యందు, భవ - పుట్టిన నవరజః - క్రొత్త పుష్పాదులయొక్క, వ్రజ = సమూహముయొక్క, ఉదయ - పుట్టువుచేత భాసురంబు - ప్రకాశించుచున్న, వసంతవాసరంబు- వసంతర్తు దినము, ఇపుడు ఈ కాలమందు, వానికెక్కెను - ప్రసిద్ధికెక్కెను.

చ. వనవనితా తనుస్ఫురిత♦వక్ర నఖాంకము లంగజాగ్నిలం
బన శరముల్ ప్రసూనరస♦వర్ష పురందర గోపముల్ సఖే
లన వనదేవతాచరణ♦లక్షణ లాక్షలు పక్ష్మలేక్షణా
మనసిజ దావపావక స♦మగ్ర శిఖల్ దగెఁగింశుకావళుల్.77

టీ. వన...నఖాంకములు, వనవనితా = వనమను స్త్రీయొక్క, తను= శరీరమందు, స్ఫురిత = ప్రకాశించుచున్న, వక్ర = వంకరలైన, నఖాంకములు = నఖక్షతములైనట్టియును, అంగ...శరముల్, అంగజ = మన్మథుని యొక్క, అగ్నిలంబన = అగ్నిని జల్లుచుండు, శరముల్ =బాణములైనట్టియును, ప్రసూన...గోపముల్, ప్రసూన రస = మకరందములయొక్క, వర్ష = వానల యందలి, పురందరగోపముల్ = ఆర్ద్రపురుగులైనట్టియును, సఖేల...లాక్షలు, సఖేలన = విలాసములతోఁగూడిన, వనదేవతా = వనలక్ష్మియొక్క, చరణ లక్షణ = పాదచిహ్నములయందలి, లాక్షలు = లాక్షారసములైనట్టియును, పక్ష్మ శిఖల్ - పక్ష్మలేక్షణా = స్త్రీలయందలి, మనసిజ = కామమనెడు, దావపావక = కార్చిచ్చుయొక్క, సమగ్ర = సంపూర్ణములగు, శిఖల్ = జ్వాలలయిన, కింశుకావళుల్ = మోదుగపువ్వులపంక్తులు, తగెన్ = అను కూలముగా నుండెను.

సీ. గళితమై యరవింద♦మిళితమై మకరంద
మొలయ గిన్నెలఁ దేనె♦లుంచ వలను

లలితమై పవన సం♦చలితమై సుమబృంద
మెనయఁ బూవుల పాన్పు♦వేయ వలదు
కలితమై తరుముఖ♦స్ఖలితమై విరిధూళి
నెరయఁ జొక్కపు బుక్క♦నింపవలదు
లలితమై పికముఖో♦జ్జ్వలితమై పంచమ
స్వరము మించ విపంచి♦నరయ వలదు
గీ. వల్లరిత మల్లివల్లిమ♦తల్లి వెల్లి
తములు పొద లుల్లసిల్ల సు♦న్నము దలిర్ప
నలరు నుల్లడపట్టు తే♦వలను నావ
హింప నుల్లాస గృహము లా♦శింప వలదు. 78

టీ. గళితమై = జారినదియై, అరవిందమిళితమై = పద్మములయందుఁ గలసినదియై, మకరందము=పూదేనె, ఒలయన్=వ్యాపించఁగా, గిన్నెలన్ = పాత్రములయందు, తేనెలు = మధువులు, ఉంచవలదు = ఉంచనక్కరలేదు, లలితమై = రేగినదియై, పవనసంచలితమై = గాలిచేతఁ గదలుచున్నదియై, సుమబృందము = పుష్పసమూహము, ఎనయన్ = కలయఁగా, పూవుల పాన్పులు = పుష్పశయ్యలు, ఏయవలను = వెయ్యనక్కరలేదు, కలితమై = శోభించుచున్నదియై, తరుముఖ = వృక్షములు మొదలగువానివలన, స్ఖలితమై= తొట్రుపడినదియై, విరిధూళి = పూదుమారము, నెరయన్ = ప్రకాశించఁగా, చొక్కపుబుక్క = సొగసైనబుక్క, నింపవలదు = నిండించనక్కరలేదు, లలితమై = సుందరమై, పికముఖోజ్జ్వలితమై = కోయిలయొక్కనోటఁ బ్రజ్వరిల్లుచున్నదియై, పంచమస్వరముమించన్ = పంచమధ్వని యతిశయించఁగా, విపంచిన్=వీణను, అరయవలదు=చూడనక్కరలేదు, వల్ల...ల్లితములు, వల్లరిత = పూగుత్తులెత్తిన, మల్లి వల్లిమతల్లి= శ్రేష్ఠములగు మల్లితీగలచేత, వెల్లిత

ములు = అల్లుకొనబడిన, పొదలు = పొదరిండ్లు, ఉల్లసిల్లన్ = ప్రకాశించఁగా, సన్నముదలిర్పన్ = సన్నపుపూతలొప్పునట్లు, అలరు = ప్రకాశించునట్టి, ఉల్లడపట్టు = ఖాదిని యగు తెలిపట్టుబట్టయొక్క, సేవలను = ఒప్పిదములను, ఆవహింపన్ = ధరించునట్లుగా, ఉల్లాసగృహములు = క్రీడాగృహములు, ఆశింప వలదు = కోరనక్కర లేదు.

ఉ. బాలరొ యీమధూకతరు ♦ పఙ్క్తి వినోదము జూడు చేడియల్
మేలగు తేనెలాని మద ♦ మీలిత లోల విలోచనాంతలై
వ్రాలుచుఁ బుక్కిటన్మిగులు ♦ వానిని గ్రాయఁగ బూవు పుక్కిటం
దాలుచు తేనెపై నుమిసెఁ ♦ దా నహహా కలికోపక్లృప్తిచేన్.

టీ. బాలరో = చిన్నదానా, ఈమధూకతరుపఙ్క్తి = ఈయిప్పచెట్ల వరుసయొక్క, వినోదమున్ = సంతోషమును, చూడు = కన్గొనుము, చేడియల్ = స్త్రీలు, మేలగు తేనెలు = మంచిమధువులు, అని = త్రాగి, మద... తలై మద = మత్తుచేత, మీలిత = మూయఁబడిన, లోల = చంచలములగు, విలోచనాంతలై = నేత్రాంతములు గలవారై, వ్రాలుచున్ = తూలుచు, పుక్కిటన్ = బుగ్గలలోపల, మిగులువాని = యెక్కువయైనవానిని, క్రాయఁగన్ = కక్కఁగా, తాను = ఇప్పయనుట, పూవుపుక్కిటన్ = పుష్పమనెడు పుక్కిటియందు, తాలుచు = ధరించునట్టి, తేనెన్ = మధువును, కలికోపక్లృప్తిచేన్ = కలి = ద్వేషముచేతనైన, కోప = కోపముయొక్క, క్లృప్తిచేన్ = చేయుటచేత, కలికా = మొగ్గలయొక్క, ఉపక్లృప్తిచేన్ = రచనచేతననియు, ఉమిసెన్ = ఉమ్మివేసెను, అహహా = ఆనందార్థకమగు నవ్యయము.

ఉ. కొమ్మరొ పువ్వుగుత్తి కొన ♦ కొమ్మనుగాంచి గ్రహించ
నెంచుచుం । గ్రమ్మిచెలుల్ పదంబుపృథు ♦ కాండమునం దు

నుపంబొసంగుచుఁబు । ష్పమ్ముల శోకమూలమునఁ ♦ బ్రాయఁ
పుబాలల కాలుసోకినం । గ్రమ్మవె పల్లవప్రకృతి ♦ గల్గినచో
సుమనో వినోదముల్. 80

టీ. కొమ్మరో = చిన్నదానా, చెలుల్ = స్త్రీలు, పూవుగుత్తి = పువ్వులగుత్తిని, కొనగొమ్మను = చివరకొమ్మయందు, కాంచి = చూచి, గ్రహించన్ = పుచ్చుకొనుటకు, ఎంచుచున్ = తలఁచుచు, క్రమ్మి = ఆవరించి, పదంబు = పాదము, పృథుకాండమునందున్ = గొప్పమాని యందు, ఉనుపన్ = ఉంచఁగా. పుష్పమ్ములు = పువ్వులు, అశోకమూలమునన్ = అశోక వృక్షముయొక్క మొదటియందు, పొసంగున్ = బాగుగనుండును, ప్రాయపుబాలల = యౌవనముగల స్త్రీలయొక్క, కాలుసోకినన్ = పాదము ప్రసరించఁగా, పల్లవప్రకృతి = విటస్వభావము, చిగుళ్ళస్వభావమనియు, కల్గినచోన్ = ఉన్నచోట, సుమనోవినోదముల్ = తెస్సయయిన చిత్తవినోదములు, పువ్వవినోదములనియు, క్రమ్మవె = వ్యాపించవా.

చ. కలికికవుంగిటం గురవ ♦ కమ్ములఁ గొమ్మలు నెమ్మిఁ గ్రమ్మఁ జో
వలగొను గబ్బిగుబ్బలను ♦ వర్తిలు వర్తులతాకఠోరతల్
దెలసి మదిన్ముదం బలరఁ ♦ దేరు వసంతుని హర్షబాష్పముల్
పులకలనంగ రంగలరెఁ ♦ బుష్పరసమ్ములుఁ బుష్పపాళికల్. 81

టీ. కలికి = ఓచిన్నదానా, కొమ్మలు = స్త్రీలు, కవుంగిటన్ = కౌఁగిటియందు, కురవకమ్ములు = గోరంటుచెట్లు, నెమ్మిన్ = ప్రీతిచేత, క్రమ్మఁజోన్ = ఆవరించుచుండఁగా, వలఁగొను = చుట్టుకొనిన, గబ్బిగుబ్బలను = దృఢములగు స్తనములయందు, వర్తిలు = ఉండునట్టి, వర్తులతాకఠోరతల్ = గుండ్రదనమును కాఠిన్యమును, తెలసి = ఎఱిగి, మదిన్ = మనస్సునందు, ముదంబలరన్ = సంతోషము మొప్పునట్లుగా, తేరు = బయలుదేఱునట్టి, వసంతుని = వసంతునియొక్క, హర్షబాష్పముల్ = సంతోషముచేతనైన కన్నీ

త్పును, పులకలు = పులకాంకురములును, అవంగన్ = అనునట్లు, పుష్ప రసస్సులు = మకరందములును, పుష్పపాళికల్ = పుష్పపఙ్క్తులును, రంగలరెన్ = ప్రకాశించెను.

ర గ డ

మధుర మధురసైక పాక ♦ మహిత ఫల రసాలసాల
పృథివి నధివసించు మించు ♦ పికము జూడవేల బాల
తొగరు జిగురులందు జిందు ♦ తొలి మధూళిసోన వాన
కెగరు పొగరు తేటికోటి ♦ నెసయు మనుపమాన చాన
మాటి మాటి కింపునింపు ♦ మలయ పవనుఁడంచునెంచు
నాటి నాటికిందు విందొ ♦ నర్చువిరులమించు మించు
కంతు కంటి విల్లు జెల్లు ♦ ఘనుని మేటిథాటి ఘోటి
యంటి గంటిసేయు మేయు ♦ నరుణ బింబ కోటి బోటి
బాల మాలతీల తాల ♦ వాల జాలమందుఁ బొందు
సేల మూల రాల లీల ♦ నీలమాల నందు విందు
నుల్లముల్లసిల్లుఁ బల్ల ♦ వోల్లస ల్లవంగ భృంగ
మల్ల హ్మల్ల ఫుల్లఫుల్ల ♦ మల్లివల్లులం గనంగ
కందుఁ డిందు చందు పొందు ♦ గ్రందుగం దనర్చి పేర్చు
కుంద బృంద మందు నిందుఁ ♦ గుందుఁ జెంద కేర్చి కూర్చు
తేనెసోన లీన నీ న ♦ దీ నవీన కమల కమల
లోన గాన లీనమా న ♦ లూన సూన గములుగములు. 82

టీ. బాల=ఓచిన్నదానా, మధుర...పృథివిన్, మధుర=తియ్యనైన, మధురస = మకరందములయొక్క, ఏక=ముఖ్యమయిన, పాక=పరిపాకము

చేత, మహిత = గౌరవించఁబడు, ఫల=పండ్లుగల, రసాలసాల=మామిడిచెట్టు యొక్క, పృథివిఁ=భూమియందు, అధివసించు=పొందునట్టి, మించు=అతిశయించునట్టి, పికముఁ = కోయిలను, చూడు = వీక్షించుమా, అనుపమాన = సామ్యములేని, చాన=ఓచిన్నదానా, తొగరు చిగురులందున్ = ఎఱ్ఱని పల్లవములయందు, చిందు = తూలిపడిన, తేఁటి = క్రొత్తదియగు, మధూళి = మకరందముయొక్క, సోనవానకున్ = ధారావర్షమునకు, ఎగరు=ఎగరుచున్న, పొగరు = గర్వించిన, తేటికోటిఁ = తుమ్మెదలసమూహమును, వినయము=పొందుము, మలయపవనాంశు=మలయమారుతము, మాటిమాటికిఁ-మరలమరల, ఇంపునింపుఁ=సంతోషమునిచ్చును, అంచునెంచు-అనియెంచు, నాటినాటికిన్=నానాటికి, ఇందుఁ=ఇచట, విరులఁ = పువ్వులయందు, మించు-అతిశయించునట్టి, మించు-కాంతి, విందొనర్చున్-ఆనందము గలిగించును, కంటె-చూచితివా, కంటివిల్లు జెల్లు-కన్నుగలధనువొప్పునట్టి, ఘనుని-గొప్పవాఁడగు మన్మథునియొక్క, మేటి-గొప్పదియగు, దాటి=దాడియందలి, ఘోటి-గుఱ్ఱమగుచిలుక, అంటి-తాకి, బోటి-ఓచిన్నదానా, అరుణబింబకోటిన్-ఎఱ్ఱని దొండపండ్లసమూహమును, గంటిసేయుఁ=కాటుసేయును, మేయున్-తినును, కాల...మందున్, కాల-లేతదైన, మాలతీలతా-మాలతీలతలయొక్క, ఆలవాల-పాదులయొక్క, జాలమందున్-సమూహమందు, పొందు-అనుకూలమగు, నేలన్-భూమియందు, మూల - ప్రక్కయందలి, రాల-రాళ్ళయొక్క, లీల-శోభ, నీలమాలన్-నీలములపంక్తిని, ఇందున్-ఇక్కడ, అందున్- పొందును, పల్లవో—ల్లులన్- పల్లవ-చిగుళ్ళచేత, ఉల్లసత్-ప్రకాశించుచున్న, లవంగ-లవంగవృక్షములను, భృంగమల్ల గొప్ప తుమ్మెదలయొక్క, హృత్-హృదయమును, ల=స్వీకరించుచున్న, ఫుల్లఫుల్లి-మిక్కిలివికసించిన, వల్లివల్లీఁ - వల్లితీగెలను, కనంగఁ - చూడఁగా, ఉల్లము-హృదయము, ఉల్లసిల్లున్-ఆనందించును, కందు=కళంకము, డిందు-నశించిన, చందు-చంద్రునియొక్క, పొందు-కలయిక, క్రందుగఁ-తరచుగా, తనరి-ఒప్పి, పేర్చు=అతిశయించునట్టి, కుందబృందము-మల్లికలసమూహము,

అందు నిండుగన్-అక్కడనిక్కడ, కుంకుఁజెందక-తక్కువను పొందక, పిక్కి-అతిశయించి, కూర్చు-కూడఁబెట్టునట్టి, తేనెసోనలు-మధువర్షములు, ఈనన్-పుట్టించఁగా, ఈ-ఈ కాన్పించుచున్న, నదీ-నదియందైన, నవీన నూతనమయిన, కనుల-పద్మములయొక్క, కమలఁగాన్-శోభఁగాపల, కానన్-చూడఁగా అలూన-తుఱుంచఁబడని, సూన-పువ్వులను, గనుబు-పొందిన, గములు-సముదాయములు, లీనమౌన్-అణగును.

చ. పరగు చిరత్న రత్నములు ♦ బన్నిన పాదులు పాదులం దరుల్
తరువులపై విరుల్ విరులఁ ♦ దామ్రను మధూళిమ ధూళిపై రజం
బు రజమునన్ మదభ్రమర ♦ ముల్ భ్రమరంబుల సుస్వ
రంబు సు। స్వరమునఁ బంచబాణ విభ ♦ వంబులుఁ బాటి
లుబోఁటి యివ్వనిన్. 83

టీ. బోటి - ఓ చిన్నదానా, ఇవ్వనిన్ - ఈవనమందు, పరగు - ఒప్పునట్టి, చిరత్న - చిర కాలపువియగు, రత్నములు - మణులు, పన్నిన - కూర్చిన, పాదులన్ - కుదుళ్ళయందు, తరుల్ - వృక్షములును, తరువులపైన్ వృక్షముల మీఁద, విరుల్ - పువ్వులును, విరులన్ - పువ్వుయందు, తామ్రి మధూళి - ఎఱ్ఱనిమకరందమును, మధూళిపైన్ - మకరందముపైని, రజంబు - పుప్పొడియును, రజమునన్ - పుప్పొడియందు, మదభ్రమరముల్ - మత్తతోఁగూడిన తుమ్మెదలును, భ్రమరంబులన్ - తుమ్మెదయందు, సుస్వరంబు మంచిస్వరమును, సుస్వరమునన్ - మంచిస్వరమందు, పంచబాణవిభవంబులు మన్మథవైభవములును, పాటిలున్ - ఒప్పును.

సీ. లలన యీదేవ వ ♦ ల్లభ సమాజము లెల్లఁ
బొసఁగు సదానవ ♦ స్ఫూర్తి నిచట
కలికిరో ఘన గంధ ♦ కలిత పున్నాగముల్
హారులకు హర్షంబు ♦ నెరపు నిచట

కలవాణి చక్కెర ♦ కవణంపు విహగముల్
సంకులాస్యమున బొ ♦ సంగు నిచట
శంపా సదృశ గాత్రి ♦ చంపకమ్ములతోన
భ్రమర కామోదంబు ♦ బరఁగు నిచట
గీ. సజ్జ ఘన మంకల స్ఫుర ♦ చ్చంచ లాంశు
కాంత విహృతులు హంస కా ♦ త్యాంత రుచికిఁ
గారణముగాఁ దగిన నీస ♦ కాశ మహిమ
నెంత యెంతటి మహిమ లిం ♦ పెసఁగు నిచట. 84

టీ. లలన=ఓచిన్నదానా, ఈదేవతలవల్లభ సమాజములెల్లన్-ఈదేవతా శ్రేష్ఠసమూహములన్నియు, పొన్నచెట్లగుంపులన్నియుననియు, సదానవ=రాక్షసులతోఁగూడిన, స్ఫురణన్ = స్ఫూర్తిచేత, సదా = ఎల్లప్పుడును, నవ, క్రొత్తదియగు, స్ఫురణన్ - స్ఫూర్తిచేతననియు, ఇచటన్ - ఇక్కడ పొసఁగున్- అనుకూలించును. (దేవతాసమూహము దానవ స్ఫురణచేఁ బొసఁగుట విరోధము, రెండవయర్థముచేత నిది పోవుచున్నది. ఈ విరోధము తోఁచుటకు ముందుఁజెప్పఁబోవునట్టి 'ఎంతయెంతటి మహిమలింపెసఁగు, ననునది కారణము. ఇట్లీపయింగూడ నూహించవలయును.) కలికిరో - ఓ చిన్నదానా ఘనగంధకలితపున్నాగముల్ - గొప్ప గర్వము గల పురుషగజములు, గొప్ప వాసనగల పొన్నచెట్లనియును, హరులకున్ - సింహములకు, కోతులకనియును, ఇచటన్ - ఇక్కడ, హర్షంబు - సంతోషము, నెరయఁజేయున్ అతిశయింపఁజేయును, కలవాణి - అవ్యక్తమధుర వాక్కులు గల యోచిన్నదానా, చక్కెర కవణంపు విహగముల్ - పంచదార దాణాగల పక్షులు, అనఁగాఁ జిలుకలు, సంకులాస్యమునన్ - సంకుపిల్లులనాట్యముచేత, సంకులమగు ఆస్యమునన్ = ముఖముచేత, (అనఁగాఁ బలుకుచుండు నోటిచేతనని యర్థము.) ఇచటన్ = ఇక్కడ, పొసంగుచుండున్ = ఒప్పుచుండును. శంపా

సదృశగాత్రి = మెఱపుతోఁ దుల్యమగు శరీరముగల యోచిన్నదానా! చంపకమ్ములతోన = సంపంగి పువ్వులతోనే, సంపంగి నూనెతో ననియు భ్రమరకామోదంబు = తుమ్మెదల యానందము, ముంగురుల పరిమళ మనియును, ఇచటన్ = ఇక్కడ, పరగున్ = ఒప్పును, సజ్జ...విహృతులు. సజ్జ = సిద్ధముగనున్న, ఘనమండల = మేఘమండలమందు, స్ఫురత్ = ప్రకాశించుచున్న, చంచలా = మెఱపులయొక్క, అంశు = కిరణముల యొక్క, కాంత = మనోహరమగు, విహృతులు=విహారములు, సత్ = యోగ్యమైన, జఘన మండల = పిఱుదునందు స్ఫురత్ = ప్రకాశించుచున్న, చంచల = కదులుచున్న. అంశుక = వస్త్రముయొక్క, అంత = చివరయొక్క, విహృతులు = విలాసములనియును, హంసకాత్యంతరుచికిన్ = హంసలయొక్క యంతము లేని కాంతికి, కాలికడియముల గొప్ప కాంతికి ననియును, కారణముగాన్ = హేతువుగా, తగిన = ఒప్పిన, నీసకాశమహిమన్ = నీసామీప్య మహత్త్వముచేత, ఇచటన్ = ఇక్కడ, ఎంతెంతటిమహిమలు = ఎంతెంతమాహాత్మ్యములు, ఇంపెసఁగున్ = శోభించును.

### లయగ్రాహి.

కుందముల బృందములఁ జిందు మకరందముల
  బిందువుల నందుకొని డెందము లమందా
నంద రస కందళము లందవుల మందగతు
  లం దగు మిళిందముల సుందరులు మింటన్
గ్రందుపడ నందమగు చందనగిరిం దనరు
  పెందరులఁ గ్రొందరుల సంకుల రజోని
ష్యందముల యందు రవి సుందరి మెయిం దనివి
  పొందుపడఁగం దిరుగు మంద పవనమ్ముల్. 85

టీ. కుందములబృందముఁ జ = మల్లితీగలసమూహమందు, చిందు = రేఁగుచున్న, మకరందముల బిందువులన్ = మకరందబిందువులను, అందుకొని = పుచ్చుకొని, డెందముల = హృదయములు, అమం... దళములన్, అమంద = గొప్పదియగు, ఆనందరస = సంతోషరసముయొక్క. కందళములఁ జ = మొలకలయందు, తవులఁ జ = తగులునట్లుగా, మందగతులఁ జ = మందసంచారముల చేత, తగు = ఒప్పుచున్న, మిళిందముల సుందరులు = ఆఁడుతుమ్మెదలు, మింటఁ జ = ఆకాశమందు, క్రందుపడఁ జ = ధ్వనించుచుండఁగా, అందమగు = సొగసైన, చందనగిరిఁ జ = మలయపర్వతమందు, తనరు = ఒప్పునట్టి, పెందరులఁ జ = పెద్దగుహలయందు, క్రొందరుల = క్రొత్తచెట్లయొక్క, సందులఁ జ = మధ్యములయందు, రజోనిష్యందములయందుఁ జ = పుప్పొడియొక్క జాఱుటల యందు, రవిసుందరిమెయిఁ జ = ఛాయాదేవియొక్క శరీరమందు. (ఇచట లక్షణచే నీడయందని యర్థము) తనివి పొందుపడఁగఁ జ - తృప్తి నొందిల్లునట్టుగా, మంద పవనమ్ముల్ - మందమారుతములు, తిరుగుఁ జ - సంచరించును

క. వనజాతిగంధి యిటుల
వ్వనజాతవిలాస మెల్ల ♦ వర సఖి దెలుపన్
గనుచు నొకానొక పొదరిం
టను జేరి నిదాఘ జలక ♦ ణ లసిత ముఖియై. ౮౬

టీ. వనజాతిగంధి=పద్మమువంటి పరిమళముగల యాచిన్నది, ఇటులు- ఈప్రకారము, అవ్వనజాత విలాసమెల్లఁ జ - ఆవనసమూహముయొక్క శోభ యంతయు, వరసఖి - శ్రేష్ఠురాలగు చెలికత్తె, తెలుపఁ జ - చెప్పఁగా, కనుచున్ - చూచుచు, ఒకానొక పొదరింటను - ఒక నికుంజమందు, చేరి = ప్రవేశించి, నిదా...ముఖియై - నిదాఘజలకణ-చెమటబిందువులచేత, లసిత- ప్రకాశింపఁజేయఁబడిన, ముఖియై = ముఖముగలదియై.

క. మావుల క్రోవుల పూవుల
తావుల తావలములైన ♦ తావుల నలరుం

దీవల నావల నీవలఁ
దావెలిగా వెలయఁదార్చి ♦ తమి నొకచోటన్. 87

టీ. మావుల...వలములు - మావుల = మామిడి చెట్లయొక్కయు, క్రోవుల = గోరంట చెట్లయొక్కయు, పూవుల = పుష్పముల యొక్క, తావుల-పరిమళములయొక్క, తావలములైన - స్థానములయిన, తావులన్ - చోటులయందు, అలరుఁదీవలన్ - పువ్వుదీగలచేత, ఆవల నీవలన్ - అవతల నివతలను, తాన్- అనఁగా నాచిన్నది, వెలిగాన్- వెలుపలగా, వెలయన్- ఉండునట్లుగా, తార్చి - తారసిల్లఁజేసి, తమిన్-ప్రీతిచేత, ఒకచోటున్ - ఒకస్థలమందు.

శా. మందస్పందన చందనానిల చల ♦ న్మందారబృందాసవ
స్యందానంద మిళన్మిళింద మహిళా♦సందోహ సందానితా
మందోద్గాన కళాద్రవన్నవమణీ ♦ మాలాలవాలోపకం
ఠేందుప్రస్తర పట్టికన్నిలచుచో ♦ నిచ్ఛారతిన్నెచ్చెలుల్.

టీ. మంద...పట్టికన్ = మందస్పందన = మెల్లగాఁగదలుచున్న, చందన-మంచిగంధపుచెట్లయందలి, అనిల - గాలిచేత, చలత్ - కదలుచున్న మందారగ బృంద - కల్పవృక్ష సమూహముయొక్క, ఆసవ = మకరందము యొక్క, స్యంద - కారుటయందు, ఆనంద - సంతోషముతోడ, మిళత్ - కూడుకొనుచున్న, మిళింద మహిళా - ఆడుతుమ్మెదలయొక్క, సందోహ - సమూహముచేత, సందానిత-కూర్పఁబడిన, అమంద-విస్తారమయిన, ఉద్గాన-ఉన్నతగానముయొక్క, కళా - శిల్పముచేత. ద్రవత్ - కరగుచున్న, నవమణీ - నూతనమణులయొక్క, మాలా - పఙ్క్తియొక్క, ఆలవాల - పాదుల యొక్క, ఉపకంఠ - సమీపమందలి, ఇందుప్రస్తర - చంద్రకాంతశిలల యొక్క, పట్టికన్ - పలకయందు. నిలచుచోన్ - నిలచియున్నప్పుడు. ఇచ్ఛారతిన్ - స్వేచ్ఛాసక్తిచేత, నెచ్చెలున్ - చెలికత్తెలు.

క. ప్రసృమర కుసుమ రస రభస
భసల సముదయంబుఁ దోలి ♦ ప్రవికసిత బిస
ప్రసవ సహస్రము గైకొను
రసమున సరసికినిఁ జనిరి ♦ రమణి యనుజ్ఞన్. 89

టీ ప్రసృమర... సముదయంబున్ - ప్రసృమర - వ్యాపించుచున్న, కుసుమరస-మకరందమందు, రభస - వేగముగల, భసలసముదయంబున్ - తుమ్మెదగుంపును. తోలి-వెడలఁగొట్టి, ప్రవిక...సహస్రమున్-ప్రవికసిత-వికసించిన, బిసప్రసవ-పద్మములయొక్క, సహస్రమున్-అనేకములను, గైకొను రసమునన్-పుచ్చుకొనుటయందలి యాసక్తిచేత, రమణియనుజ్ఞన్ - ఆచిన్నదాని యాజ్ఞచేత, సరసికిన్-కొలనికి, చనిరి-వెళ్ళిరి.

వ. అంత. 90

సీ. గగన రంగస్థలీ ♦ కలిత నర్తన మరు
త్పద పత త్స్మరక తాం ♦ గద మనంగ
జవ నవ ప్లవనవ ♦ ద్రవి శతాంగ తురంగ
గళ గళ ద్ధరిదశ్వ ♦ ఘంట యనఁగ
బహుళ గాంగ తరంగ ♦ బంధు రోత్పతిత బు
ష్యతుల శీత తులసీ ♦ తతియనంగ
సరభ సామర వధూ ♦ కర పత త్సుర పుష్ప
పూర్ణ హారి త్పత్ర ♦ పుటమనంగ

గీ. సముదుమని తూరి జిగిమీరి ♦ సెమము దేరి
కరువలుల దారి నెగఁబారి ♦ కడకుఁ జేరి
తలిరుల కటారి వలకారి ♦ ధాటి ఘోటి
చిలుక చిలుకలకొలికి ముం ♦ గలను నిలచె. 91

టీ. గగన...మనంగ, గగన-ఆకాశమనెడు, రంగస్థలీ - నాటకస్థలమందు, కలిత-చేయఁబడిన, నర్తన-నాట్యముగల, మరుత్ - వాయుదేవుని

యొక్క, పద-పాదమువలన, పతత్-పడుచున్న, మరకత-మరకతవికారమగు, అంగదమనంగన్-అందెయనునట్లు, జవ...యనఁగ,జవ వేగముచేత, నవ-నూతనమైన, ప్లవ నవత్-తూలుఁగలిగిన, రవిరథాంగ-సూర్యరథముయొక్క, తురంగ-గుఱ్ఱముయొక్క, గళ-కంఠమువలన, గళత్-జారుచున్న, హరిదశ్వ-సూర్యుని గుఱ్ఱము యొక్క, ఘంటయనఁగన్-గంటయోయనునట్లు,బహుళ...యనంగన్, బహుళ=విస్తారమైన, గాంగ-గంగాసంబంధులగు, తరంగ-అలలవలన, బంధుర-ఉన్నతిముగా, ఉత్పతిత-ఎగురుచున్న, ఋషి-మునులయొక్క, (మునులు పూజలుచేసి గంగలో విడచిన నిర్మాల్యతులసియనుట) అతుల-సామ్యములేని, శీత-చల్లనైన, తులసీ-తులసీదళములయొక్క, తతియనంగన్-సముదాయమనునట్లుగా, సరభ...మనఁగ, సరభస-వేగముతోఁగూడిన, అమరవధూ-దేవతాస్త్రీలయొక్క, కర-హస్తమువలన, పతత్-పడుచున్న, సురపుష్ప-మందారపుష్పములచేత, పూర్ణ-నిండిన, హరిత్-పచ్చనైన, పత్రిపుటమనంగన్-ఆకుపొట్లమనునట్లుగా, సమయమని-ఇది తాను వచ్చుట కనుకూలమైన వేళయని, తూరి-చొచ్చి, జిగిమీరి-శోభచే నతిశయించి, సెమముదేరి - ఆయాసముఁ దీర్చుకొని,(సెమమనునది శ్రమశబ్దభవమని తోఁచుచున్నది.)కరువలులదారిన్-ఆకాశమందు, ఎగఁబారి-ఎగఁబ్రాకి, కడకుఁజేరి - దగ్గిరకువచ్చి, తలిరులకటారి మన్మథుఁడనెడు, వలకారి-మోహకారియొక్క, ధాటి - దాడియందలి, ఘోటి-గుఱ్ఱమగు, చిలుక-శుకము, చిలుకలకొలికి ముంగలను-ఆ చిన్నదానియెదుట, నిలచెన్-నిలువబడెను.

క. కని కరము తనదు మనమునఁ
గనికరము దలిర్పఁ జిగురు ♦ గతిఁ దనరెడి చు
ల్కనికరమున బట్టె నశో
క నికరము రుచులు శుభప్ర ♦ కరణము దెలుపన్॥ 92

టీ. కని-చూచి, కరము మిక్కిలి, తనదు మనమునన్-తనమనస్సునందు కనికరము-దయ, తలిర్పన్-ఒప్పఁగా, చిగురుగతిన్-పల్లవమువలె, తనరెడి-

ఒప్పునట్టి, చుల్కని-మృదువైన, కరమునన్ - హస్తముచేత, అశోకనికరము రుచులు - అశోకపుష్పకాంతులు, శుభప్రకరణమున్ - శుభవ్యాపారమును, తెలుపన్-తెలుపఁగా, పట్టెన్-చిలుకను బట్టుకొనెను.

క. చిలుకను గైకొని మదిఁ దమి
జిలుకను బలికెను పడంతి ♦ చిత్రంబుగనే
తలములు పొలములునుపవన
కులములుగనఁబోయితి శుక ♦ కులమణి చెప్పుమా॥ 93

టీ. పడంతి-ఆచిన్నది, చిలుకను - శుకమును, గైకొని - పట్టుకొని, మదిన్-మనస్సునందు, తమి-అనురాగము, చిలుకను-వ్యాపించఁగా, చిత్రంబుగన్-చిత్రముగా, పలికెను-చెప్పెను, శుకకులమణి-చిలుకజాతిలో శ్రేష్ఠమగుదానా, ఏతలములు-ఏస్థలములు, పొలములు-సస్యభూములు, ఉపవనకులములును-ఉద్యానవనసమూహములును, కనఁబోయితి- చూడఁబోతివి, చెప్పుమా-చెప్పుమా.

క. పెంచిన చిలుకవు నీవటు
పంచమ దివసంబు లేగి ♦ పరతెంచుటకుం
గొంచక కారణమును వివ
రించు మనంగను శుకంబు ♦ ప్రేమం బలికెన్॥ 94

టీ. పెంచినచిలుకవు - పెంపుడుచిలుకవు, నీవిటు - నీవీప్రకారము, పంచమదివసంబులు-అయిదారుదినములు, ఏగి-వెళ్ళి, పరతెంచుటకున్-వచ్చుటకు, కొంచక-సంకోచింపక, కారణమును-హేతువును, వివరించుమనంగను-చెప్పుమనఁగా, శుకంబు-చిలుక, ప్రేమన్-ప్రేమచేత, పలికెన్-చెప్పెను.

చ. సరస రసాలసాల ఫల ♦ సంగ్రహణ వ్యసనంబునన్ విస్మృ
త్వర మలయాద్రి మారుత వి♦వర్తిత నర్తన మంజు మంజరీ

పరిమళ సంగ భృంగకుల ♦ పక్ష ఝుణంఝుణ నాద భేద మే
దుర వనపాళి కేళి పరి♦తోష విశేషము మీఱఁబోయితిన్

టీ. సరస... వ్యసనంబునన్, సరస-రుచితోఁగూడిన, రసాల సాల-తియ్యమామిడిచెట్లయొక్క, ఫల-పండ్లయొక్క, సంగ్రహణ-సంపాదించుట యందలి, వ్యసనంబునన్ - ఆసక్తిచే, విస్ఫు... విశేషము, విస్ఫురత్ - వ్యాపించుచున్న, మలయాద్రి - మలయపర్వతమందలి, మారుత - గాలిచేత, వివర్తిత - ప్రవర్తింపఁజేయఁబడిన, నర్త - నాట్యముచేత, మంజు - మృదువగు, మంజరీ-పూలగుత్తులయొక్క, పరిమళ-వాసనయొక్క, సంగ-స్నేహముగల. భృంగకుల - తుమ్మెదగుంపులయొక్క, పక్ష - ఱెక్కలయొక్క, ఝుణంఝుణనాద-ఝుణఝుణధ్వనియొక్క, భేద-విశేషములచేత, మేదుర-దట్టమయిన, వనపాళిన్-వనపఙ్క్తియందు, కేళి-విహారముచేతనైన, పరితోష విశేష = సంతోషాతిశయము, మీఱన్-అతిశయించగా, పోయితిన్-వెళ్ళితిని.

క. రాజీవ లోల లోచన
రాజీవా యిటులఁ జనుచు ♦ రహినొక్క వనిన్
రాజిలు రాజశిఖామణిఁ
దేజస్విని గంటి నతని ♦ తేజము చూడన్ 96

తా — రాజీవా... జీవా - రాజీవ = మత్స్యవిశేషములవలె, లోల-చంచలించుచున్న, లోచన రాజీవా - నేత్రపద్మములుగల యోచిన్నదానా, ఇటులజనుచున్ - ఈలాగున వెళ్లుచు, రహిన్ = సంతోషముచేత, ఒక్క వనిన్ - ఒకవనమందు, రాజిలు = ప్రకాశించుచున్న, తేజస్విని - మంచి తేజస్సుగల, రాజశిఖామణిన్ = చంద్రశిరోభూషణుండగు నీశ్వరుని, కంటిన్ - చూచితిని, అతని తేజముచూడన్ - అతని తేజస్సుచూడఁగా, పై పద్యముతో నన్వయము.

సీత — రాజశిఖామణిన్ = రాజశ్రేష్ఠుని, శేషము సమము.

క. కొమ్మా నీరూపంబున
కమ్మానిత మహిమశాలి ♦ యర్హుఁడటంచున్
నెమ్మనమున దోఁచెను బూ
రెమ్మా నాబుద్ధి నేర్ప ♦ రించిన వినుమా. 97

టీ. కొమ్మా = ఓచిన్నదానా, నీరూపంబునకున్ - నీ సౌందర్యమునకు, అమ్మానితమహిమశాలి - పూజింపఁబడు మహిమతోఁగూడిన యీతఁడు, అర్హుఁడటంచున్ - తగినవాఁడని, నెమ్మనమునన్ - మనస్సునందు, తోఁచెను - తోఁచెను, పూరెమ్మా - పుష్పలతవంటి యోచిన్నదానా, వినుమా - ఆకర్ణించుమా, నాబుద్ధి నేర్పరించినన్ - నామనస్సులో విమర్శింపఁగా, పయిపద్యముతో నన్వయము.

శా. పాలుం జక్కెరగూడు వేడుక దలిర్పన్ ♦ రత్నకాంతుల్ దమీ
పాల జ్యోత్స్నలు పద్మవాసనలు శ్రీ ♦ పశ్రీలు చండప్రభా
మాలిచ్ఛాయలు దీటురాఁ గవయుచు ♦ న్మాధుర్యధుర్య
క్రియా। లీలన్ మీరలు మన్న సర్వశుభముల్ ♦ దీపించుఁ
గాంతామణీ. 98

టీ. పాలున్ - క్షీరములును, చక్కెర - పంచదారయును, కూడు - కలియునట్టి, వేడుక - సంతోషము, తలిర్పన్ - ఒప్పఁగా, రత్నకాంతుల్ - రత్నముల కాంతియును, తమీపాల జ్యోత్స్నలు - చంద్రుఁడును వెన్నెలయును, పద్మవాసనలు - పద్మమును బరిమళమును, శ్రీపశ్రీలు - విష్ణువును లక్ష్మియు, చండప్రభామాలిచ్ఛాయలు, చండప్రభామాలి - సూర్యుఁడును, ఛాయలు - ఛాయాదేవియును, దీటురాన్ - సామ్యమురాఁగా, కలయుచున్ - కూడుచు, మాధుర్యధుర్యక్రియాలీలన్, మాధుర్య - తీపుయొక్క, ధుర్య - భారమును వహించిన, క్రియా - వ్యాపారముయొక్క, లీలన్ =

విలాసముచేత, మీరలు - మీరు, మన్నన్ - వృద్ధిపొందినచో, కాంతామణీ- స్త్రీ శ్రేష్ఠురాలవగు నోచిన్నదానా, సర్వశుభముల్ - అన్నిశుభములును, ఓపెంచునే - పరికాశించును.

క. అని చిలుక పలుకు పలుకులు
విని వీనుల నమృతధార ♦ వెదజల్లితి మే
ల్చనువున ననిపెనుటెక్కలు
కొన గోరుల నిమిరి కొనుచుఁ ♦ గోమలి వేడ్కన్. 98

టీ. అని - ఈలాగునని, చిలుక - శుకము. పలుకు - చెప్పునట్టి, పలుకులు - మాటలు, విని - అకర్ణించి, కోమలి - చిన్నది, మేల్చనువునన్ = మంచిస్నేహముచేత, వీనులన్ - కర్ణములయందు, అమృతధార - అమృత ప్రవాహము, వెదజల్లితి - వ్యాపింపఁజేసితివి. అని - అని, పెనుటెక్కలు - చిలుకయొక్క పెద్దటెక్కలను, కొనగోరులన్ - నఖాగ్రములచేత, ముందు పద్యముతోడ నన్వయము.

ఉ. ఎచ్చటనుండివచ్చి యతఁ ♦ డెచ్చట తావక నేత్రవృత్తికిన్
ముచ్చటఁగూర్చెఁ జిక్కడన ♦ ముల్ ఘనముల్ గని నావొ
లేవొ నీ। వచ్చుతురుండు నుండుతల♦మచ్చటి ముచ్చట లావి
లాసముల్ మచ్చిక హెచ్చఁ దెల్పు మఖ ♦ లంబు ననంగ
తురంగమాగ్రణీ॥ 99

టీ. అనంగతురంగమాగ్రణీ-అనంగ - మన్మథునియొక్క, తురంగమ - గుఱ్ఱములగు చిలుకలలో, అగ్రణీ — శ్రేష్ఠమగునో చిలుకా, అతఁడు - ఆతఁడు, ఎచ్చటినుండివచ్చి - ఏస్థలమునుండివచ్చి, తావక నేత్రవృత్తికిన్ - నీసంబంధియగు దృష్టివ్యాపారమునకు, ముచ్చటఁగూర్చెన్-ఆనందముగలుగఁ

జేసెను. చక్కదనమున్ - సౌందర్యమును, ఘనమున్ - గొప్పతనమును, (ఇది భావప్రధాననిర్దేశము) కనినావో - చూచితివో, లేవో-చూడనేలేదో, నీవు, అచ్చతురుండు - ఆనేర్పరి, ఉండుతలము - ఉండుచోటును, అచ్చటి ముచ్చటలు - అచ్చటి విశేషములును, ఆవిలాసముల్ - ఆచేష్టా విశేషములును, అఖిలంబున్ - సమస్తమును, మచ్చికహెచ్చన్ - స్నేహ మతిశయించునట్లుగా, తెల్పుము - చెప్పుమా.

క. సకు లీపలుకులు వినినం
దికమకముగ నగుదుర ప్ర ♦ తీతము నైకాం
తికముగఁ దెలుపుము శుకమా
సకలం బని పలికెఁ గలికి ♦ సల్లలి తోక్తిన్॥ 100

టీ. శుకమా - చిలుకా, సకులు - చెలికత్తెలు, ఈపలుకులు - ఈ మాటలు, వినినన్ - ఆకర్ణించిరేని, తికమకముగన్ - గంద్రగోళముగా, అగుదురు - అవుదురు, అప్రతీతము - ప్రకటనకానిదియు, ఐకాంతికముగన్ - రహస్యమునైనదిగా, సకలంబు - అంతయును, తెలుపుము - తెలియఁజేయుమా అని, కలికి - ఆచిన్నది, సల్లలితోక్తిన్ - మిక్కిలి సుందరమగు వాక్యముచేత, పలికెన్ - చెప్పెను,

ఆశ్వాసాంతము.

శా. కాంతాస్వాంతవికారకారణమహా ♦ కౌమారకౌమార దీ
ర్ఘ్యంత్యక్లిష్టవిలాస లాసక వినో ♦ దాసార దా సారవో
పాంత స్వ స్తరు కంద కందళ దనూ ♦ నాకార నాకారసం
భాంతర్షి ప్రమద ప్రద ప్రచుర శో ♦ భామార భామారతా.

టీ, కాంతా...కౌమార, కాంతా - స్త్రీలయొక్క, స్వాంత-చిత్తములయొక్క, వికార = వికారమునకు, కారణ = హేతువగు, మహత్,

గొప్పదియగు, కౌమార = కౌమారావస్థగలవాఁడా, కౌమార...సారదా. కౌమారదీక్షు = కుమార సరస్సుయొక్క, అంతః = లోపలను, క్లృప్త-రచించఁబడిన, విలాస - విలాసములచేతను, లాసక - ప్రకాశించునట్టి, వినోద - ఆనందముగొక్క, ఆసార - ధారావర్షమును, దా-ఇచ్చువాఁడా, సార... కారపారవ - సరయూనదీ సంబంధియగు, ఉపాంత = ప్రాంతమందలి, స్వస్తరు - కల్పవృక్షముయొక్క, కంద - దుంపను, కందళత్-మొలకయై యాచరించుచున్న, అనూన - గొప్పదియగు, ఆకార - రూపముగలవాఁడా, నాకార...మార. నాకారసంభ్రాంత - రూపముచేత భ్రాంతిపడని,ఋషి-మునులకు, ప్రమదప్రద- సంతోషమునిచ్చునట్టి, ప్రమర - అతిశయముగు, శోభా - కాంతిచేతను, మార - మన్మథుఁడైనవాఁడా, భామారతా, భా - కాంతియందును, మా - లక్ష్మియందును, రత - ఆసక్తుఁడగువాఁడా.

క. పఙ్క్తిశిరోధి విభంగ వి
రక్తర్షి మనోబ్జ భృంగ ♦ రతి రభసవ్యా
సక్తరమా హృదయ పరి
ష్వక్త కర ద్వితయ విధృత ♦ శంఖ రథాంగా. 102

టీ. పఙ్క్తిశిరోధివిభంగ-రావణాసురునిఁ గొట్టినవాఁడా, విరక్తర్షి... భృంగ. విరక్త-విరక్తులగు, ఋషి-మునులయొక్క, మనః - చిత్తమనెడు, అబ్జ=పద్మమునకు, భృంగ - తుమ్మెదయైనవాఁడా, రతి...రథాంగా. రతి రభస-సంభోగవేగమందు, వ్యాసక్త - ఆసక్తినిఁ బొందిన, రమా - లక్ష్మీదేవియొక్క, హృదయ-వక్షస్థలమునకు, పరిష్వక్త - ఆలింగన జేసికొనునట్టి, కరద్వితయ - హస్తద్వంద్వముచేత, విధృత — ధరించఁబడిన, శంఖర, థాంగ - శంఖచక్రములు కలవాఁడా, (ఇచట విరక్త, వ్యాసక్త పరిష్వక్త, అను చోట్ల, ఉపసర్గపూర్వకములగు రఞ్జ, సఞ్జ, ష్వఞ్జ ధాతువులపై క్తప్రత్యయాంతరూపములు.)

గద్య.

ఇది సర్వతంత్ర స్వతంత్ర సకల భాషావిశేష కవితాధురంధర ప్రతి
దినప్రబంధ పరమేశ్వర శ్లేష యమక చక్రవర్తి బిరుదాంక తిరు
మల బుక్కపట్టణ శ్రీనివాసతాతాచార్య తనయ శ్రీమ
దణ్ణయాచార్య దీక్షితసుత పితృవ్య శ్రీనివాసార్య
కృపాకటాక్షలబ్ధ సకల పాండిత్య
తర్కాలంకార వాగీశ్వర బిరు
దాంక వేంకటాచార్యప్రణీతం
బైన యచలాత్మజా పరిణ
యంబును శ్లేషప్రబం
ధంబునందు.
ద్వితీయాశ్వాసము.

---



శుభమస్తు.

# అచలాత్మజా పరిణయము.

## తృతీయాశ్వాసము.

---

శ్రీరమణీ చారు మణీ
హార ఘృణీ జాల జాల ♦ కాంతర లగ్నో
దార మనో మిష మీన వి
హార సముల్లాస వేంక ♦ టాచలవాసా. 1

టీ. శ్రీరమణీ......ల్లాస = శ్రీరమణీ - లక్ష్మీదేవియొక్క, చారు సుందరములగు, మణీహార - మాణిక్యహారముల యొక్క, ఘృణీ = కిరణముల యొక్క, జాల - సమూహమనెడు, జాలక - వలయొక్క, అంతర - మధ్యమందు, లగ్న - తగులుకొన్న, ఉదార - విస్తారమగు, మనః - చిత్తమను, మిష - మిషముగల, మీన - చేపలయొక్క విహార - విహరించుట చేతనైన, సముల్లాస - ఉల్లాసము గలవాఁడా, వేంకటాచలవాసా - వేంకటాద్రియందు నివాసము గలవాఁడా,

గీ. అవధరింపవయ్య ♦ యఖిల కథాభిధా
నాతత నయుఁడైన ♦ సూత తనయుఁ

డనియె శౌనకునకు ♦ నారీతి నారీ తి
లకముతోడ ననియె ♦ శుక వరంబు.

టీ. అవధరింపవయ్య - చిత్తగింపుమయ్య, అఖిల...నయుండై అఖిల - సమస్తములైన, కథా - కథలయొక్క, అభిధాన - చెప్పుటయందు ఆతత - విస్తారమైన, నయుండైన - నీతిగల, సూతతనయుండు - సూతపుత్రుడగు సుగ్రశ్రవుండు, శౌనకునకున్ - శౌనకమహర్షికి, అనియెన్ - చెప్పెను. ఆరీతిన్ - ఆ ప్రకారము, నారీతిలకముతోడన్ - స్త్రీ శ్రేష్ఠురాలగు నాచిన్నదానితోడ, శుకవరంబు - చిలుకలలో గొప్పదియగు నాచిలుక అనియెన్ - చెప్పెను.

ఆ. సారసహిత వంశ ♦ జ రుచి రసాకేత
నగరి మహిత వృత్తి ♦ నాగరాజ
త మహీభృద్వరుండు ♦ ధవల సంగతి మించి
తనరు సతతసతిరి ♦ దశరథుండు॥

పా—సార......రుచి - సార = బలముతోడ, సహిత - కూడిన వంశ - వెదుళ్ళవలన, జ-పుట్టిన, రుచి-కాంతి. రసాకేతనగరిమన్ - రసా - భూమియొక్క, కేతన-జెండాలయొక్క గరిమన్ - అతిశయముచేత. మహిత వృత్తి - ఇష్టవ్యాపారముగలది, నాగన్ - అనునట్లుగా, సత...రథుండు. సత - ఎల్లప్పుడును, సత్రిదశరథుండు - దేవతల రథములగు విమానములతో గూడిన రాజత...వరుండు - రాజత - వెండికానమగు, మహీభృద్వరుండు పర్వత శ్రేష్ఠమగు కైలాసము, ధవళసంగతిన్ - తెలుపుయొక్క కూడికె చేత, మించి - అతిశయించి, తనరున్ - ఒప్పును.

సీత—సారస...నగరిన్ - సారసహితవంశజ - సూర్యవంశమందు బుట్టినవారిచేత, రుచిర - సొగసైన, సాకేతనగరిన్ - అయోధ్యా పట్టణ

మందు, మహితప్రవృత్తి - పూజ్యమగు వ్యాపారముగలవాఁడు, సతతసత్త్రి - ఎల్లపుడును యజ్ఞములుగలవాఁడు. దశరథుండు - దశరథుఁడను పేరుగల, మహీభృద్వరుండు - రాజశ్రేష్ఠుఁడు - ధవలసంగతిన్ - కీర్తిచేత నయిన తెలుపుయొక్క కూడికచేత, నాగరాజతన్ - శేషత్వమును, మించి - అతిశయించి, తనరున్ - ఒప్పును.

క కమలధరుకరణి విలసిలు
కొమరుల దగు నాధరేంద్రు ♦ గుణగణ గణనం
బమరులతలపై విలసిలు
సుమనో రాజులమహాళి ♦ సూక్తులు దెలుపున్॥ 4

పా — కమలధరుకరణిన్ = చంద్రునివలె, విలసిలు - ప్రకాశించునట్టి కొమరులన్ - సొగసులచేత, తగు = ఒప్పునట్టి, అధరేంద్రు - ఆపర్వత (శ్రేష్ఠమగు కైలాసముయొక్క, గుణగణగణనంబు — గుణసముదాయము యొక్క లెక్కను, అపరు - ఒప్పునట్టి, లతలపైన్ - తీగలమీఁద, విలసిలు ప్రకాశించునట్టి, సుమనోరాజుల - పుష్పశ్రేష్ఠులయొక్క, మహాళిసూక్తులు - మహత్ - గొప్పలగు, అళి - తుమ్మెదలయొక్క, సూక్తులు - మంచివాక్యములు, (ఝుంకారములనుట) తెలుపున్ - ప్రకటించును.

సీత — కమలధరుకరణిన్ - విష్ణువువలె, విలసిలు - ప్రకాశించునట్టి, కొమరులన్ = పుత్త్రికలనుగూర్చి, తగు - తగియున్న, అధరేంద్రు - ఆరాజు యొక్క, గుణగణగణనంబు - గుణసముదాయముయొక్క లెక్కను, అమరుల తలపైన్ = దేవతలశిఖరముపై, విలసిలు = ప్రకాశించునట్టి, (దేవతలకంటె పైవారని యర్థము) సుమనోరాజుల- విద్వచ్ఛ్రేష్ఠులయొక్క, మహాళి, మహాత్ = గొప్పదియగు, అళి = పఙ్క్తియొక్క, సూక్తులు = మంచిమాటలు, తెలుపున్ = తెలియఁజేయును.

క. అందొప్పు రాజకళ మీ
రం దివ్య మహా యశోభి ♦ రాముఁ డనంగా
సుందర భుజగమిత గుణా
స్పంద ధనుర్ధరత బరవ ♦ శంకరుఁ డెలమిన్॥ 5

పా—అందున్ = ఆకైలాసమందు, రాజకళ = చంద్రకళ, మీరన్ = అతిశయించఁగా, దివ్య...రాముఁడనంగాన్. దివ్య = ప్రశస్తమైన, మహాత్ = గొప్పదియగు, యశః = కీర్తిచేత, అభిరాముఁడనంగాన్ = మనోహరుఁడనునట్లుగా. (శివునితలపైఁగల చంద్రికాంతి ఆయనయొక్క కీర్తివలెఁ బ్రకాశించుచున్నదని తాత్పర్యము) సుందర...ధరత, సుందర = సొగసైన, భుజగ = పాముచేత, (అనఁగా శేషునిచేత) మిత = కొలవఁబడిన (అనఁగాఁదదూపమైన) గుణ = నారితాటిచేత, అస్పంద = చలించని, ధనుః = వింటికి, ధరత = పూనుట, పరవన్ = వ్యాపించఁగా, శంకరుఁడు = శివుఁడు, ఒప్పున్ = ప్రకాశించును.

సీత— అందున్-ఆదశరథునికొడుకులయందు, రాజకళ-రాజలక్షణము, మీరన్-అతిశయించఁగా, సుందర...ర్ధరతన్, సుందర-సొగసుయిన, భుజ-హస్తములచేత, గమిత-పొందించఁబడిన, గుణ-నారిగల, అస్పంద-నిశ్చలమగు, ధనుః-వింటికి, ధరతన్ - ధరించుటచేత, పర - శత్రువులకు, వశంకరుఁడు-స్వాధీనతఁజేసికొనువాఁడు, ఎలమిన్ - శోభచేత, దివ్య...శోభి, దివ్య - పరిశస్తమయిన, మహాత్-గొప్పదియగు, అయ - శుభావహావిధిచేత, శోభి - పరికాశించువాఁడు, రాముఁడనంగాన్ - రాముఁడనఁగా, ఒప్పున్-ప్రకాశించును.

వ. ఇటులుండ నొక్కచక్కి నక్కజంబై పెక్కుతెరంగులఁ బరిఢవిల్లు నవసరంబున నందొప్పు రాజకళ. 6

తా — ఇటులుండఁగ - ఈప్రకారముగా నుండఁగా, అందొప్పు రాజకళ-ఆశివునియందున్న చంద్రకళ, ఒక్కచక్కిఁగ - ఒకవయిపున, అక్కజంబై-ఆశ్చర్యమై, పెక్కుతెరంగులఁగ-బహురీతుల, పరిఢవిల్లునవసరంబునఁగ-అతిశయించు సమయమందు.

సీత — అందొప్పు రాజకళ - ఆరామునియందున్న విష్ణుకళ, (ఇచట రాజశబ్దమునకు విష్ణ్వర్థకత్వము రూఢిగాకున్నను జెప్పవలయును) విష్ణుకళ యొకటియు నయ్యును రామలక్ష్మణ భరతశత్రుఘ్న రూపముగా నున్నది యని భావము.

సీ. పుంభావ నవకేళి ♦ సంభావిత సువస్తు
సంభార లలితోప ♦ లంభ కలిత
జంభారి కృత పరీ ♦ రంభాది హృదయ ప్రి
యంభావుక క్రియా ♦ రంభ పులక
గుంభావళిత కుంభి ♦ కుంభాయి తోరోజ
కుంభాధి కాభోగ ♦ జృంభమాణ
రంభాదికాప్సర ♦ స్సంభాసి కచ సవి
స్రంభాకకలిత కల్ప ♦ కుంభినీజ
గీ. సంజనిత మంజు మంజరీ ♦ పుంజ గుంజ
దళికుల స్వర్మహీ తరు ♦ త్యాగ రాగ
బుద్ధికృత్పుష్ప సౌగంధ్య ♦ భూషితంబు
భాసురంబయ్యెను వసంత ♦ వాసరంబు. 7

టీ. పుంభావ...భూషితంబు, పుంభావనవకేళి - పురుషాయిత మందు, సంభావిత-ఆదరింపఁబడు, సువస్తుసంభార-మంచి వస్తుసామగ్రియొక్కయు,

(అనఁగాఁ బువ్వుశయ్యాదులయొక్క) లలిత=విలాసములయొక్కయు, ఉప లంభ-పొందుటచేత, కలిత-ఒప్పుచున్న, జంభారి=ఇంద్రునిచేత, కృత-చేయఁ బడిన, పరీరంభాది - ఆలింగనము మొదలుగాఁగల, హృదయ - మనసునకు, ప్రియంభావుక-ఇష్టమయిన, క్రియా-పనులయొక్క, ఆరంభ=ఆరంభమందలి, పులక-గగుర్పాటుయొక్క, గుంభ-కూర్పుచేత, ఆవలిత-క్రమ్మబడిన, కుంభి కుంభాయిత-ఏనుఁగు కుంభస్థలములవలె నాచరించుచున్న, ఉరోజకుంభ-స్తనకుంభములచేత అధిక-విస్తారమగు, ఆభోగ-పరిపూర్ణతచేత, జృంభమాణ-అతిశయించుచున్న, రంభాదిక-రంభ మొదలుగాఁగల, అప్సరః-అప్సరస్త్రీల యొక్క, సంభాసి-ప్రకాశించుచున్న, కచ-వెండ్రుకలయందు, సవిస్రంభ-విశ్వాసముతోఁగూడినట్టియు, ఆకలిత - ప్రకాశించుచున్న, కల్పకుంభినీజ-కల్పవృక్షములయందు, కుంజనిత-పుట్టిన, మంజు-మృదువైన, మంజరీపుంజ-పువ్వులగుత్తుల సమూహమందు, గుంజత్ - రొదఁజేయుచున్న, అళికుల-తుమ్మెదగుంపులుగల, స్వర్మహీ - స్వర్గభూమియందలి, తరు - వృక్షముల యొక్క, త్యాగ - విడిచిపెట్టుటయందు, బుద్ధికృత్ - మనసుఁబుట్టించునట్టి, పుష్ప-పువ్వులయొక్క, సౌగంధ్య-పరిమళముచేత, భూషితంబు-అలంకరించఁ బడిన, వసంత వాసరంబు-వసంతదినము, భాసురంబయ్యెన్-ప్రకాశించెను.

శా. చైత్రుండిచ్చటఁబంచమస్వరముగూర్చంబూనినాఁడింక నా
చిత్రంబొప్పదటంచు గద్దదిక జొచ్చెం బాంధకాంతా గళ
క్షేత్రంబుం గలకంఠ కంఠ కుహార క్షేత్రంబు వర్జించెనా
ధాత్రిన్ మించెనుబంచమంబువినఁగాఁదద్ద్యంబు కాంతాళికిన్.

టీ. చైత్రుండు - వసంతుఁడు ఇచ్చటన్ - ఈ కోవెల కంఠముల -యందు; పంచమస్వరమున్ - పంచమమను ధ్వనిని, కూర్చన్ - సంధానముఁ జేయుటకు, పూనినాఁడు - ఉద్దేశించినాఁడు. ఇకన్ - ఇటుపయిని, నా -చిత్రంబు - నా సొగసు, ఒప్పదు - పనికిరాదు, అటంచున్ - అట్లని, గద్ద

ఢిక - దగ్ధుత్తిక - కల... క్షేత్రంబుల - కలకంఠ - కోవెలలయొక్క, కంఠకుహర - కంఠగంధ్రములనెడు, క్షేత్రింబుల - స్థానమును, వర్జించి - విడచి, పాంథ... క్షేత్రంబుల - పాంథ - మార్గసుల యొక్క, కాంత - స్త్రీల యొక్క, గళక్షేత్రంబుల = కంఠస్థలమును, చొచ్చెను - ప్రవేశించెను, నాన్ - అనునట్లు, ధాత్రిని - భూమియందు, పంచమంబున్ - కోవెలల పంచమస్వరమును, వినన్ - వినఁగా, కాంతాళికిన్ - స్త్రీ సమూహమునకు, గాఢ్ధద్యంబు = దగ్ధుత్తిక, మించెను - అతిశయించెను

సీ. కాసార మత్తల్లి ♦ కా సారస మధూళి
కా సారముల గంధ ♦ గరిమ నలరి
కాంతా రహిత కాము ♦ కాంతా రతిక గ్రామ
కాంతారములఁ గొంత ♦ కలసి మెలసి
సాధారణ వధూర ♦ సాధార నవ సాహ
సాధారకథ నాయ ♦ మవలఁ దోలి
వానీర బహుళ రే ♦ వా నీర శైత్య సే
వా నీరసత నన్ను ♦ వలను గడపి

గీ. నవనవ మధువ్రతార్ద్ర ప ♦ ల్లవ లవాగ్ర
కలిత కలకంఠ కుల కంఠ ♦ గాన తాన
కలన కృత పారవశ్యవై ♦ ఖరిఁ జరించె
మలయగిరి మేఖలా చారు ♦ మారుతములు. 9

టీ. కాసార ... సారములు కాసారమత్తల్లికా - సరశ్శ్రేష్ఠముల యందలి, సారస - పద్మములయందైన, మధూళికా - మకరందములయొక్క ఆసారముల - ధారావర్షముల యొక్క, గంధ - పరిమళము యొక్క, గరి

మన్ - అతిశయముచేత, అలరి - సంతోషించి, కాంతారహిత...కాంతారములన్, కాంతా - స్త్రీలతోడ, రహిత - శూన్యులగు, కాముక - కాముకుల యొక్క, అంతః - అంతఃకరణములను, రతికర - సంతోషమును జేయునట్టి, అమ్రికాంతారములన్ - మామిడి తోటలయందు, కొంత - కొంచెము కలసి మెలసి - కలసి సంచరించి, సాధా...కథ, సాధారణ - సామాన్యులగు (అనఁగా ధైర్యవతులుగాని) వధూరస - స్త్రీ శ్రేష్ఠులయొక్క, అధార అవిచ్ఛిన్నముగాని, నవ—క్రొత్తదియగు, సాహస - ప్రణయకలహ సాహసము, ఆధార - ఆధారముగల, కథ ప్రశంస యొక్క, న్యాయము - న్యాయమును, అవలఁదోలి - అవ్వలికిఁ బోఁగొట్టి, (అనఁగా మలయమారుతము విసరఁగా ధైర్యము తక్కువ గల స్త్రీలు ప్రణయకలహ సాహసము యొక్క మాటనుగూడ విడచు చున్నారని తాత్పర్యము) వానీర.........నీరసతన్, వానీర - ప్రబ్బలిచెట్లచేత, బహుళ - విస్తారమయిన, రేవా - నర్మదానది యొక్క, నీర - ఉదకము యొక్క, శైత్య - చలువయొక్క, సేవా - సేవించుటయందు, నీరసతన్ - ఆసక్తిలేకపోవుటను, అన్నువలన్ - స్త్రీలకు, కడపి పోఁగొట్టి, నవ...వైఖరిన్ - నవ నవ - నూతన ప్రకారమైన మధుద్రవ - మకరందపు తడిచేత, ఆర్ద్ర - తడిసిన, పల్లవాగ్ర - శ్రేష్ఠములగు చిగుళ్ళచేత, కలిత - సంతసింపఁజేయఁబడిన, కలకంఠ - కోకిలల యొక్క, కుల - సమూహము యొక్క, కంఠ = కంఠములయందలి గాన = సంగీతము యొక్క, తాన = తానముల యొక్క, కలన = వినుటచేత కృత - చేయఁబడిన, పారవశ్య - పరవశత్వము యొక్క, వైఖరిన్ - రీతిచేత, (అనఁగా జిగుళ్ళుదిని కఱకెక్కిన కంఠములుగల కోవెలలపాటలను వాయువు తీసికొని రా నవి వినువారు కామపరవశత్వము నొందుచున్నారని తాత్పర్యము) మలయ...మారుతములు- మలయగిరి - మలయపర్వతముయొక్క, మేఖలా- చరులయందలి, చారు - ఇంపైన, మారుతములు- వాయువులు, సంచరించెన్- విసరెను.

సీ. మలయ కటీ పటీరతరు ♦ మంజు కుటీర తటీ నటీకృతి
స్ఖల దహికన్యకా పటల ♦ కాంతముఖాంతర తాంత వీటికా
గ్ర లలితవాసనాభరము ♦ గంధరజోభరముం ధరించుచున్
వలదెస గాలి రాఁగఁజెలు ♦ వ ల్వడినూర్చ్ఛుట నొప్పెఁజి
త్రతన్ 10

టీ. మలయ... భరము-మలయ - మలయపర్వతముయొక్క, కటీ - చరియలయందలి, పటీరతరు - మంచిగంధపు చెట్లయొక్క, మంజు - మృదువైన కుటీర - ఇండ్లయొక్క, తటీ - ప్రదేశమునందు, నటీకృతి - నాట్యముఁజేయుట సవిలాసము చేయుటచేత, స్ఖలత్ - తొట్రుపడుచున్న, అహికన్యకా - నాగకన్యకలయొక్క, పటల - సమూహముయొక్క, కాంత - సుందరములగు, ముఖాంతర - ముఖమధ్యములయందు, తాంత - విస్తారములైన, వీటికా - తాంబూలములయొక్క, అగ్ర - శ్రేష్ఠములైన, లలిత - మనోహరమైన, వాసనాభరము - పరిమళాతిశయమును, గంధరజోభరముఁ - పరిమళించుచున్న పూదూలియొక్క యతిశయమును, ధరింపుచున్ - పూనుచు, వలదెస గాలి - దక్షిణదిక్కుగాలి, రాఁగన్ - రాఁగా, చెలువల్ - స్త్రీలు, వడిన్ - విస్తారముగా, ఊర్చ్ఛుట - నిట్టూర్పించుట, చిత్రతన్ - చిత్రరీతిచేత, ఒప్పెన్ - తగెను.

వ. అట్టి మహోత్కృష్ట ప్రభా భాసురంబగు సమయంబున. 11

టీ. అట్టి - అటువంటి, మహోత్కృష్ట — మిక్కిలి శ్రేష్ఠమైన, ప్రభా — కాంతితో, భాసురంబగు - ప్రకాశించుచున్నదగు సమయంబున.

చ. సరళముగాన యజ్ఞవిధి ♦ సంధిలయానమునంది యుగ్రమా
త్రక రచన శాలి శీలి జడ ♦ దారియు నల్లనగాధిరాజశే
12

ఖరభవమానికుంజములఁ ♦ గన్పడునై జగృహంబు వీడి శం
కరయజనంబవిఘ్నగతి ♦ గాఁ దసరించ దలంచి మించుచున్. 12

పా— సరళిముగాన్ = తిన్నగా, ఆయజ్ఞ = శుభావహావిధినెఱిఁగిన విధి=కార్యము సంధిలన్ = సంధానమగుటకు, యానము = శివునివాహనా మైనట్టియు, అగ్రిమసూక్తరచనశాలి = శ్రేష్ఠములైన ముత్తెపుగుంపులరచనచే నొప్పుచున్నట్టియు, శీలి = యోగ్యవ్యాపారము గల్గినట్టియు, జడదారి యు = జడలను ధరించినట్టియు, నంది = నందీశ్వరుఁడు, అల్ల = ప్రసిద్ధమైన. నగాధిరాజ = హిమవత్పర్వతమునుయొక్క, శేఖర = శిఖరమందు, భవమా = అయినట్టి, నికుంజములన్ = పొదలయందు, కన్పడు = కాన్పించునట్టి, నైజ గృహంబు = తనయిల్లు, వీడి = విడచి, శంకర యజనంబు=శివపూజ, అవిఘ్న గతిగాన్ = నిర్విఘ్నరీతిగా, తసరించఁదలంచి= చేయఁదలంచి, మించుచున్ = అతిశయించుచు.

సీత— అగ్రి ... శాలి, అగ్రి = శ్రేష్ఠమైన, సూక్త = సూక్తిసంబంధ కార్యములయొక్క, రచన = చేయుటచేత, శాలి = ఒప్పుచున్నట్టియు, శీలి= సద్వ్యాపారము గలిగినట్టియు, జడదారియు = జడలను ధరించునట్టియు, గాధిరాజ...మాని = గాధి = గాధియనునట్టి, రాజశేఖర = రాజశ్రేష్ఠుని వలన, భవ = పుట్టిన, మాని = విశ్వామిత్రుఁడు, యానమునంది = ప్రయాణ మునుబొంది, కుంజములన్ = పొదలయందు, కన్పడు = కాన్పించునట్టి, నైజ గృహంబువీడి = తన పర్ణశాలనువిడచి, శంకరయజనంబు = స్వర్గాదిసుఖము లను జేయునట్టి యజ్ఞము, అవిఘ్న గతిగాఁదసరించఁదలంచి మించుచున్ = అర్థము సమము.

చ. తలపఁగ నిట్టియాగమహి ♦ త ప్రవిధానము లెల్ల విఘ్నపు
ష్కలములుగాన నివ్విధి వే♦సం గలయుం బరగంగమించునా

ఫలద యశోభిరాముఁడతి ♦ భవ్యుఁడు భీముఁడురక్షకుండుగా
నలయు నతండె పుణ్యజన-వర్త్మ మెఱుంగు నటంచు నెంచు
చున్॥ 13

పా — తలపఁగన్=ఆలోచింపఁగా, ఇట్టి=ఈప్రకారమయిన, ఆగమ=శాస్త్రములకు, హిత=ఇష్టములగు, ప్రవిధానములెల్లన్-విధులన్నియు, విఘ్నపుమ్ములములు = విఘ్నములచేత నిండినవి, కానన్ = కనుక, ఇవ్విధి = ఈకర్మ, వెసన్ = త్వరగతో, కలయం బరగంగన్ = అనుకూలముగా జరుగుటకు, మించు = అతిశయించునట్టి. ఆ - ప్రసిద్ధుఁడగు ఫల...రాముఁడు = ఫలద - ఫలమునిచ్చునట్టి, యశః = కీర్తిచేత, అభిరాముఁడు - మనోహరుఁడైనట్టియు, అతిభవ్యుఁడు - మిక్కిలి శుభప్రదుఁడగు, భీముఁడు - శివుఁడు, రక్షకుండుగాన్ - సంరక్షించువాఁడుగా, మలయున్ — వర్తించును. అతండె - ఆశివుఁడే, పుణ్యజనమర్త్మ - యోగ్యులమర్త్మమును, ఎఱుంగునటంచు నెంచుచున్ - తెలియునని యాలోచించుచు.

సీత — తలఁపఁగన్ - ఆలోచింపఁగా, ఇట్టి - ఈ ప్రకారమైన, యాగసుహిత ప్రవిధానములెల్లన్ - యాగ = యజ్ఞములయొక్క, సుహిత - పూజింపఁబడునట్టి, ప్రవిధానములెల్లన్ - విధులన్నియును, విఘ్నపుమ్ములగాన నివ్విధివెసంగలయం బరగంగ మించు - ఇంతమట్టుకర్థముసమము, ఆ - ప్రసిద్ధుఁడగు, ఫలదయశోభి - ఫలత్ - సఫలమగుచున్న, అయ — శుభావహావిధిచేత, శోభి - ప్రకాశించుచున్నట్టియు, అతిభవ్యుఁడు - మిక్కిలి శుభములుగల, భీముఁడు = శత్రుభయంకరుఁడగు, రాముఁడు - శ్రీరామమూర్తి, రక్షకుండుగా మలయున్ — సంరక్షించువాఁడుగా వర్తించును. అతండె - అరాముఁడే, పుణ్యజనవర్త్మము - రాక్షసమార్గమును, ఎఱుంగు నటంచు నెంచుచున్ - తెలియునని యాలోచించుచు.

ఉ॥ ఆ పరమర్షి తారకల ♦ నాత్మహితంబుగ నిల్పు మేటివాం
ఛాపరతన్ వెసం జనుచు ♦ సార్థసవార్థమరందబిందు లి

ప్సా పతిత తాళి పాళిఘన ♦ సార వనీరచిత ప్రచార వే
లాపవమానమాణవ వి ♦ లాసవిలీననితాంతతాంతియై॥ 14

పా—ఆ - అట్టి పర...నాత్మన్ - పర - ఉత్కృష్టముగా. మర్షి శాంతి గలిగినట్టియు, తార - తారకమంత్రముయొక్క, కలన - ధ్యానము గల, ఆత్మన్ - అంతఃకరణమును, హితంబుగన్ - యిష్టముచొప్పున, నిల్పు= నిశ్చలముగాఁ జేయునట్టి, మేటి - గొప్పవాఁడగు నందీశ్వరుఁడు. వాంఛా పరతన్ - ఇచ్ఛాప్రధానత్వముచేత, వెసన్ - త్వరచేత, చనుచున్ - వెళ్లు చు, సారస......తాంతియై, సారస - పద్మములయొక్క, వార-సమూహ మందలి, మరందబిందు - మకరంద బిందువులయొక్క, లిప్సా — పొంద నిచ్ఛచేత, పతిత - ప్రసరించుచున్న, అళి - తుమ్మెదలయొక్క, పాళి — పఙ్క్తి - చేత. ఘన - దట్టమైన, సార - శ్రేష్టమైన, వనీ - వనములయందు, రచిత - చేయఁబడిన, ప్రచార - సంచారముగల, వేలా - సముద్రతీరమందలి పవమానమాణవ - పిల్లగాడ్పులయొక్క, విలాస - విహారములచేత, విలీన — అణఁగిన, నితాంతతాంతియై - అత్యంతాయాసముగల వాఁడయి.

సీత—తారకలన్ - నక్షత్రములను, ఆత్మహితంబుగన్ - తనయిష్టము చొప్పున, నిల్పుమేటి = ఉంచినగొప్పవాఁడగు, (విశ్వామిత్రుఁడు ద్వితీయ స్వర్గనిర్మాణముఁ జేయుటకై నక్షత్ర మండలములోని నక్షత్రములను దూరము గానిల్పెనని ప్రసిద్ధి. ఆ - ప్రసిద్ధుఁడగు, పసుర = ఉత్కృష్టుఁడగు, ఋషి = విశ్వామిత్రముని, ఘన = గొప్పదియగు, సారవ = సరయూనదియందలి, నీర = నీటిచేత, చిత = వ్యాప్తసగు, ప్రచార = మార్గముగల, వేలా ఒడ్డునందలి, తక్కినదిసమము.

చ. ఘనతమ సాధునీరచిత ♦ కౌతుకబాలమరాళమాలికా
తనుతరచంచుసంచలిత ♦ తామరసప్రసరత్పరాగవా
సనల మెలంగుభృంగముల ♦ ఝంకరణంబుల వీనులందువిం
దొనరనమోఘ్యశాస్త్రవుల♦కుగ్రపురిన్ననిమేష ముదంబునన్.

టీ—ఘన ... వాసనలన్, ఘనతమ = మిక్కిలి గొప్పదియగు సాధు = సౌభాగ్యమయిన. నీర = నీటియందు, చిత = వ్యాప్తమయిన, కౌతుక = సంతోషముతోఁగూడినట్టియు, బాలమరాళీ = పిల్లహంసల, యొక్క, మాలికా = పఙ్క్తులయొక్క, తనుతర = మిగుల వాడియయిన, చంచు = ముక్కులచేత, సంచలిత = కదలించఁబడిన, తామరస = పద్మముల యందు, ప్రసరత్ = ప్రసరించుచున్న, పరాగ = పూదుమారముయొక్క, వాసనలన్ = పరిమళములయందు, మెలంగు=సంచరించునట్టి, భృంగముల తుమ్మెదలయొక్క, ఝంకరణంబులన్ = ధ్వనులచేత, వీనులందున్ — చెవులయందు. విందు = ఆనందము, ఒనరన్ = ఒప్పగా, శాత్ర వులకున్ = శత్రువులకు, అయోధ్యన్ = యుద్ధముఁజేయ శక్య ముగానట్టి, ఉగ్రపురిన్ = ఈశ్వరుని పట్టణమును, ముదంబునన్ = సంతో షముచేత, కనియెన్ = చూచెను,

సీత—ఘన గొప్పదియగు, తమసా ధునీ = తమసా నదియందు, రచిత = రచింపఁబడిన, కౌతుక = సంతోషము గల, శాత్రవులకున్, శత్రువులకు, ఉగ్రభయంకరమగు, అయోధ్యన్ = అయోధ్యయనునట్టి, పురిన్ = పట్టణమును, శేషము సమము,

క. పరహితుఁ డానందియు నల
సరసుఁడు మది ముదము దనర ♦ సమరహితవిభా
కరకులజరాజమణి భా
సురమగు నజతనయ పురము ♦ సొచ్చెను రక్తిన్॥ 16

టీ—వరహితుఁడు = శ్రేష్ఠులకిష్టుఁడగునట్టియు, అలసరసుఁడు = మందులయందు దయారసముగల, ఆ నందియు = ఆ నందీశ్వరుఁడును, మదిన్ = మనస్సునందు, ముదము = సంతోషము, తనరన్ - ఒప్పఁగా, సమ...భాసురము, సమరహిత - ఉపమానశూన్యమగు, విభా = కాంతికి, ఆకర = స్థానమగు, కులజ = వంచి జాతియందు బుట్టిన, రాజమణి =

చంద్రకాంతమణులచేత, భాసురమగు = ప్రకాశించుచున్న, అజతనయ పురము = బ్రహ్మపుత్రుఁడగు నీశ్వరుని పట్టణమును, (త్రిమూర్తుల నొకరి నొకర పుట్టించిన వారినిగాఁ జెప్పుట ప్రసిద్ధము) లేక = పులస్త్య బ్రహ్మ పుత్రుఁడగు కుబేరుని పట్టణము, (అలకాపట్టణము కైలాసమందున్నది గావున నట్లు చెప్పవచ్చును.) రక్తిన్ = అనురాగముచేత, చొచ్చెన్ - ప్రవేశించెను.

సీత — వరహితుఁడు = శ్రేష్ఠుల కిష్టుఁడైనట్టియు, ఆనందియు = ఆనందము గలిగినట్టియు, అల = అట్టి, సరసుఁడు = బ్రహ్మానందరసముతోఁ గూడిన విశ్వామిత్రుఁడు, మది ముదముదనరన్ = మనసున్న సంతోష మొప్పఁగా, సమర...భాసురము, సమర - యుద్ధములయందు, హిత = ఇష్టులగు, విభాకరకులజ = సూర్యవంశమందుఁ బుట్టిన, రాజమణి = రాజ శ్రేష్ఠులచేత, భాసురమగు = ప్రకాశించుచున్న, అజ తనయపురము = అజ మహారాజు కొమారుఁడగు దశరథుని పట్టణమగు నయోధ్యను, అనురక్తిన్ = ప్రీతిచేత, చొచ్చెన్ = ప్రవేశించెను.

చ. మహిత రసాలసాల కృత♦మాల తమాల సుమాలతీ లతా
సహిత నికుంజ పుంజ వన ♦ సంజవనోచిత భోగ భోగినీ
బహుతరగానతానముల ♦ భాసిలు నప్పురి నొప్పురాజభూ
ర్వహుతల వాకిటన్ మనసు ♦ పట్టియుతండువసింప నంతలోన్

టీ — మహి...తానములన్. మహిత - శ్రేష్ఠము లయిన, రసాల సాల = మామిడి చెట్లచేత, కృత = చేయఁబడిన, మాల = పఙ్క్తిగల, తమాల = తాపింఛ వృక్షముతోడను, సుమాలతీలతా = మంచి మాలతీతీగల తోడను, సహిత = కూడిన, నికుంజ = పొదలయొక్క, పుంజ = సమూహముగల, వన = వనమండలి, సంజవన = గృహవిశేషములకు, ఉచిత = తగినట్టి, భోగ = భోగములు గల, భోగినీ = నాఁకన్యకల యొక్క, బహు తర = మిక్కిలి విస్తారమగు, గాన = సంగీతముల యొక్క, తానములన్ = తానములచేత, భాసిలు = ప్రకాశించునట్టి, అప్పురిన్ = ఆ పట్టణమందు,

ఒప్పు = కన్నట్టి, రాజపూర్వపాలు = చంద్రశేఖరుఁడగు శివుని యొక్క, తల
వాకిటన్ = ప్రాంగణమునందు, అతండు = అనందీశ్వరుఁడు, మనసు
పట్టి, మనస్సు నిబ్బరముఁ జేసికొని, వసింపన్ = ఉండగా, అంతలోన్ =
అంతటిలో.

సీత—భోగినీ = భోగినీ స్త్రీల యొక్క, రాజశ్రేష్ఠుఁడగు దశ
రథుని యొక్క శేషము సమము.

క. రాజశిరోమణి యానతి
రాజనియల వామదేవు ♦ రసికు వశిష్ఠున్
బూజార్హునిఁ దగు విధమునఁ
బూజించియునమ్మహా ప్ర ♦ భుని యానతిచేన్॥ 18

పా— రాజశిరోమణి=చంద్రశేఖరుఁడగు శివునియొక్క. ఆనతి =
సెలవు, రాన్=రాగా, చని=వెళ్ళి, రసికున్ = బ్రహ్మానందము గలిగినట్టియు,
వశిష్ఠున్=ఇంద్రియనిగ్రహము గలిగినట్టియు, పూజార్హున్ = పూజకుఁ దగి
నట్టియు, అలవామదేవున్ = ఆశివుని, తగువిధమునన్ = అనుకూలరీతిచేత,
పూజించియున్ - పూజఁజేసియును, అమ్మహాప్రభుని = ఆగొప్ప తేజస్సుగల,
శివునియొక్క, ఆనతిచేన్=సెలవుచేత.

క. ప్రమ దారావాహిత వి
భ్రమ వృత్తి దలిర్ప నొక్క ♦ భర్మాసన మం
దమరి యతండు వివక్షో
ద్యమ మొప్పఁగ సన్నుతించె ♦ నయ్యీశ్వరునిన్॥ 19

పా— అతండు=ఆనందీశ్వరుఁడు, ఒక్కభర్మాసనమందున్=ఒక్క
బంగారుపీఠమందు, అమరి=కూర్చుండి, ప్రమ...వృత్తి, ప్రమద = సంతోష
కరమగు, ఆరావ = ధ్వనిచేత, ఆహిత=తీసికొనిరాఁబడిన, విభ్రమవృత్తి =
విలాసవ్యాపారము, తలిర్పన్ = ఒప్పునట్లుగా, వివక్షోద్యమము, వివక్షా =

చెప్పనిచ్ఛయందలి, ఉద్యమము = ప్రయత్నము, ఒప్పఁగన్ = ఒప్పునట్లు. అయ్యీశ్వరునిన్ = ఆశివుని, సన్నుతించెన్=స్తోత్రము చేసెను.

సీత— అతండు = ఆవిశ్వామిత్రుడు, ఆయీశ్వరునిన్ = ఆ దశరథ రాజును, శేషము సమము.

చ. సతతము రంగపుంగవుని ♦ సద్గుణమూర్తి భజించి కాంచన
క్షితిధర పాటవంబు విల ♦ సిల్లెడి విల్గొని నీవనీ ప్రకో
ష్ఠ తలము దట్టవైరిపుర ♦ సద్వనితాజనతా ప్రకోష్ఠ సం
గతవలయంబులుం బగులు ♦ గా సమరస్థలి రాజశేఖరా॥

పా— రాజశేఖరా=చంద్రుఁడు శిరోభూషణముగల యో శివుఁడా, సమరస్థలిన్ = యుద్ధభూమియందు, నీవ = నీవే, సతతము=ఎల్లప్పుడును, ఈరంగపుంగవున్=సర్వశ్రేష్ఠుఁడగు శేషుని, సద్గుణమూర్తిన్, సత్=మంచిది యగు, గుణ = అల్లెత్రాటియొక్క, మూర్తిన్=స్వరూపముచేత, భజించి= పొంది, కాంచనక్షితిధరపాటవంబు = మేరుపర్వతముయొక్క పటుత్వము, విలసిల్లెడి = ప్రకాశించునట్టి, విల్గొని = ధనస్సుబుచ్చుకొని, (అనగా మేరువునే ధనస్సుగాఁజేకొని) నీప్రకోష్ఠతలమున్=నీముంజేతిని, దట్టన్ = తగులు నట్టుజేయఁగా, వైరి...వలయంబులున్, వైరి = శత్రువులైన రాక్షసుల యొక్క, పుర=త్రిపురములయందలి, సత్ = పతివ్రతలగు, వనితాజనతా = స్త్రీజనసమూహముయొక్క, ప్రకోష్ఠ=ముఁజేతులయందు, సంగత = కలసి యున్న, వలయంబులున్ = గాజులును, పగులుగా = బద్దలైపోవునట్లుగదా, (ఈశ్వరుఁడు త్రిపురాసంహారముఁ జేయఁగా వారి భార్యలు విధవలౌటచేత గాజులు బద్దలుగొట్టికొనిరని తాత్పర్యము) శివుని ముంజేతికి వారి దెబ్బ దగులఁగా రాక్షసస్త్రీల ముంజేతుల గాజులు బద్దలైనవి గావునఁ గార్యకారణ ములు వేరువేరుచోటుల నుండుటచే నసంగత్యలంకారము.

సీ— రాజశేఖరా = రాజశ్రేష్ఠుఁడవగు నో దశరథుఁడా, సతతము= ఎల్లపుడును, సద్గుణమూర్తిన్ - సద్గుణస్వరూపుఁడగు, రంగపుంగవునిన్ =

శ్రీరంగనాయకుని, భజించి = సేవించి, (శ్రీరంగనాయకుఁ డిక్ష్వాకువంశ మందు గృహదేవతార్చనయందలి దేవుఁడనియును, ఆ దేవతార్చన శ్రీరామ మూర్తి విభీషణునకు కిచ్చుఁగా నాఁటఁ డుభయకావేరీమధ్యమం దుంచె ననియుఁ బ్రసిద్ధి) కాంచ...విల్గాని=మేరువుతో సమానబలముగల ధనస్సును పట్టికొని, శేషము సరము.

క. ప్రతికూలవ్రత భీమ దక్షయజన ♦ ప్రక్షోభ దీక్షాసము
ద్ధతిసీవద్భుతయుద్ధపద్ధతి సము ♦ ద్యద్రోషకాషాయక
ద్యుతిభృల్లోచనధాళధళ్యగరిమం ♦ దోట్రిల్లరౌద్రాద్భుతో
ద్యత వృత్తింవగు వీరభద్రమహిమల్ ♦ దర్కింప శక్యంబు లే.

టీ.—నీవు-నీవు, ప్రతికూల...ద్ధతిఁ- ప్రతికూలవ్రత-వ్యతిరేకప్రధానుఁడగు, భీమ-భయంకరుఁడగు, దక్ష - దక్షునియొక్క, యజన - యజ్ఞము యొక్క, ప్రక్షోభ = చెడగొట్టుటయందలి, దీక్షా = పట్టుదలయొక్క, సము ద్ధతిఁ = అతిశయముచేత, అద్భుత...గరిమఁ. అద్భుత = ఆశ్చర్యమగు, యుద్ధపద్ధతి = యుద్ధరీతిచేత, సముద్యత్=పుట్టుచున్న, రోష = కోపము వలన, కాషాయక = ఎఱ్ఱనయిన, ద్యుతి = కాంతిని, భృత్= భరించుచున్న, లోచన = నేత్రములయొక్క. ధాళధళ్య = తళతళయొక్క, గరిమఁ - అతిశయముచేత, తోట్రిల్లఁ- తొట్రుపడఁగా, రౌద్రా...వృత్తిఁ, రౌద్ర- రౌద్రరసమువలనను, అద్భుత - అద్భుతరసమువలనను, ఉద్యత - పుట్టిన, వృత్తిఁ - వ్యాపారముచేత, తగు - ఒప్పునట్టి, వీరభద్ర మహిమఁ - వీర భద్రుని మహత్త్వములు, తర్కింపఁ ఊహించుటకు, శక్యంబు లే = శక్య మగునా ?

సీ.—ప్రతికూల...సముద్ధతిఁ. ప్రతికూలవ్రత - విరోధమందును, భీ - భయమందును, (అనఁగా భయమును బుట్టించుటయని తాత్పర్యము.) మద క్షయ - మదమును నశింపఁజేయుటయందును, జనప్రక్షోభ - మనుష్యు

లను జీకారు సేయుటయందును, దీక్షా = పట్టుదలయొక్క, సముద్ధతిన్ = అతిశయమువలన, వీరభద్రమహిమన్ - వీర = వీర రసముయొక్క, భద్ర - శుభకరములగు, మహిమల్ - మహత్వములు. శేషము సమము.

క. సురధుని నినుఁ జెంది గదా
పరగును బవమాన భక్తి ♦ పరిణతి దగ నా
సురరాజులు నిన్నే నుతిం
తురు సంగరహిత మహావి ♦ నోద మహేశా. 22

పా___సురధుని-గంగానది, నినుఁజెంది నిన్నుఁబొంది పవమా...దగన్ పవమాన - పవిత్రమైన, భక్తి - రచనయొక్క, పరిణతి-పరిపాకము, తగన్-తగునట్లు, పరగునుకదా - ఒప్పునుగదా, సంగ...నోద. సంగ - సంసార-సంగముతోడ, రహిత - శూన్యములయినవారియందు, మహావినోద - గొప్ప వేడుకగల, మహేశా = ఓశివా, ఆసురరాజులు = ప్రసిద్ధులగు దేవతా శ్రేష్ఠులు, నిన్నె నుతింతురు - నిన్నే పొగడుదురు.

సీత___సురధునిన్ = మంచిరథముగల. (అనఁగా గొప్ప రథికుఁడౌ నగు) నినున్ = నిన్ను, చెంది = పొంది, పవ= (దేవతలకు విరోధులపైఁగల) విరోధము. మానన్ = తీరఁగా, భక్తి = (దేవతలకు నీపైఁగల) గౌరవము. పరిణతిదగన్ = పరిపాక మొప్పునట్టుగా, పరగునుగదా = ఒప్పునుగదా-సంగ...నోద, సంగర = యుద్ధమందు, హిత = ఇష్టమైన, మహావినోద = గొప్ప వేడుకగల, మహేశా = గొప్పరాజవగు నోదశరథుఁడా, శేషము = సమము. (ఇచట సురధనిఅనునది ప్రథమార్థమున వర్గచతుర్థము గలదిగానూ, ద్వితీయార్థమున వర్గద్వితీయము గలదిగానున్నది. ఇందుకుఁ గారణము దెలి యదు,)

వ. రాజచూడామణీ మాయాజ్ఞాధారణాద్యాచరణంబు భవత్ప్ర రస్కరణంబునం గాక సాంగంబు గానేరదు. దురితవల్లికోప ఘ్నంబులగు విఘ్నంబులు నివారింప నపారంబగు నీపెన్గొ

మరుకృపారసంబొక్కటియె కోరెదను నిఖిల ధర్మనిర్మాణ ని ర్మలచిత్తవృత్తియగు నీ వెఱుంగని యర్థంబు లేదనుటయు నయ్యాశుం డంగీకార తరంగి తాంతరంగుండై యను మతించె నంత.

పా — రాజచూడామణీ - చంద్రశేఖరుఁడవగు నోశివా, మా = మా యొక్క, ఆజ్ఞా... చరణంబు, ఆజ్ఞా = సెలవుయొక్క, ధారణాది = నిర్వ హించుట మొదలగు, ఆచరణంబు - రచన, భవత్పురస్కారణంబునంగాక = నీపురస్కారము కలఁగాని, సాంగంబుగా నేరదు - పూర్తిగా నేరదు, దురితవల్లి కోపఘ్నంబులగు=దోషములనుతీఁగలకు నాధారములగు విఘ్నం బులు = అంతరాయములు, నివారింపక = పోఁగొట్టుటకు, నీపెన్గోమరు-నీ గొప్పప్పునగు, కృపారసంబు = దయారసము, ఒక్కటియె కోరెదను-ఒక టియేకోరుచుంటిని, నిఖిల...యగు, నిఖిలధర్మ = సమస్త ధర్మములయొక్క, నిర్మాణ = కలిగించుటయందు, నిర్మల=స్వచ్ఛమగు, చిత్తవృత్తియగు, మనో వ్యాపారముగల, నీవెఱుంగని యర్థంబు లేదనుటయుక = నీ వెఱుంగవి కార్యములేదనఁగా, అయ్యాశుండు - ఆశివుఁడు, అంగి...రంగుండై, అంగీ కార=ఒప్పుదలచేత, తరంగిత = అలలుగల, అంతరంగుండై = చిత్తముగలవాఁ డయి, అనుమతించెక=ఒప్పుకొనెను, అంత-అంతట.

సీ — రాజచూడామణీ=రాజశ్రేష్ఠుఁడవగు నో దశరథుఁడా, మా = మాయొక్క, యాజ్ఞ = యజ్ఞసంబంధియగు, ఆధారణాది = నిర్వహించుట మొదలగు, నీ పెన్గోమరు - నీ పెద్దకోమరునియొక్క, అయ్యాశుండు - ఆ రాజు, శేషము సమము.

గీ. రాజ శిశుమాళి యాగమా ♦ రాధనైక
యోగ మార్గానుగతిలేక ♦ యొంటి నిర్వ

వాదముగ సాగవలసె నం ♦ చాదిఁ గొంత
తలఁచి సత్యాప్తియందె చి ♦ త్తంబు నిలపి. 24

టీ— రాజశిశుమౌళి - పిల్లచంద్రుఁడు శిరోభూషణముగల యీశ్వరుఁడు, ఆగమారాధనైకయోగము, ఆగమ-శాస్త్రవిహితమైన, ఆరాధన - పూజలయొక్క, ఏకయోగము - ముఖ్యసంబంధము, ఆర్యానుగతి, ఆర్యా - పార్వతీదేవియొక్క, అనుగతి - అనుసరణము, లేక = లేకుండ, ఒంటి - ఒక్కఁడుగా, నిర్వివాదముగన్ - విరోధము లేకుండఁగా, సాగవలసె నంచున్ - జరుగవలసినదని, ఆదిన్ - మొదటియందు, కొంత దలఁచి = కొంచెమాలోచించి, సత్యాప్తియందు - సతీదేవియొక్క, లేక స్త్రీయొక్క, పొందుటయందే, చిత్తంబునిలపి - మనసుంచి.

సీ— రాజశిశుమౌళి-రాజకుమారులలో శ్రేష్ఠుఁడగు శ్రీరామమూర్తి, యాగ...యోగము, యాగ - యజ్ఞముయొక్క, మా - సంపదయొక్క, ఆరాధన-ఆరాధించుటయొక్క, ఏకయోగము-ముఖ్యోపాయము, ఆర్యానుగతి-పూజ్యుఁడగుదశరథునియొక్క యనుసరణము, సత్యాప్తియందె-సత్యముయొక్క పొందుటయందే, శేషము సమము.

క. ఆనంది చేత నాత్తా
నూన సపర్యుండు నగుచు ♦ నొక్క మనస్సం
ధానమున సత్యసంగా
ధీనత దాశరథి పరమ ♦ ధృతి దగఁ జనియెన్. 25

టీ— ఆనందిచేతన్ = ఆనందీశ్వరునిచేత, ఆత్తానూనసపర్యుండున్ - ఆత్త - పొందబడిన, అనూన = విస్తారమగు, సపర్యుండున్ - పూజగలవాఁడును, అగుచున్ - ఔచు, ఒక్కమనస్సంధానమునన్ - ఒకానొక మనోనైశ్చల్యముచేత, సత్యసంగాధీనతన్, సతీ-సతీదేవియొక్క, అసంగ-విరహామునను, ఆధీనతన్ - ఆయత్తత్వముచేత, తాన్ - తాను, శరధిపరమధృతి.

శరధి - సముద్రమువలె, పరమ - ఉత్కృష్టమగు, ధృతి - ధైర్యము, తగన్ - ఒప్పునట్లు, చనియెన్ - వెళ్ళెను.

సీ— ఆనంది — సంతోషముగలవాఁడును, చేత... పద్యాంతము, చేతనా - చిత్తమందు, ఆత్త - పొందఁబడిన. సపర్యుండును - (తంత్రియందుగాని లేక విశ్వామిత్రునియందు గాని) గౌరవముగలవాఁడును, అగుచున్ - ఔచు, సత్యసంగాధీనతన్ - సత్యము యొక్క సాంగత్యమున కధీనత్వముచేత, దాశరధి - శ్రీరామమూర్తి, శేషము సమము. (ఇచట మొదటి యర్థమున శరధి యను నది వర్గచతుర్థమును రెండవయర్థమున దాశరధి యను నదివర్గద్వితీయమును అయియున్నది. ఇందుకు కవియే ప్రమాణము.

ఉ. రాజకుమారశేఖరుఁడు ♦ రమ్యతనందిప యిన్ వినోదముల్
రాజిలనార్యసంగతి య ♦ నంతసుఖాశ్రయమంచు నెంచుచుం
దాఁ జనుదెంచెఁ దాపసహి ♦ తస్థితి నవ్వల నివ్వల న్వనీ
రాజుల నుల్లసిల్లు మృగ ♦ రాజులు తన్గని విస్మయం పడన్.

పా—రాజకుమారశేఖరుఁడు - బాలచంద్రశిరోభూషణుఁడగు నీశ్వరుఁడు, రమ్యతన్-సొగసుచేత, వినోదముల్ - కాలయాపనలు, రాజిలన్ - రంజిల్లఁగా, ఆర్యసంగతి-పార్వతియొక్క కలయిక, (తెనుఁగు షష్ఠీసమాసము) అనంత సుఖాశ్రయమంచున్ = అపరిమిత సౌఖ్యాధారమనుచు, ఎంచుచున్ = తలఁచుచు, తాపసహిత స్థితిన్=తాపసహిత = తాపముతో గూడిన, స్థితిన్ = ఉనికిచేత, అవ్వల నివ్వలన్ = అటు నటు, వనీరాజులన్ = వనపఙ్క్తులయందు, ఉల్లసిల్లు - ప్రకాశించునట్టి, మృగరాజులు = మృగశ్రేష్ఠములు, తన్గని = తన్నుఁ జూచి, విస్మయంపడన్ = ఆశ్చర్యపడగా, నందిపయిన్ = నంది నెక్కి, తాన్ = తాను, చనుదెంచెన్ = వెళ్ళెను.

సీత— రాజకుమారశేఖరుఁడు = రాజశిఖశ్రేష్ఠుఁడగు శ్రీరామమూర్తి, రమ్యతన్ - మనోహరత్వమును, అంది = పొంది, పయిన్ = అనంతర

మందు, ఆర్యసంగతి పూజ్యుఁడగు విశ్వామిత్రునితోఁ గలసియుండుట.
తాపసహిత స్థితిన్ = తాపస = విశ్వామిత్రునికి, హిత = ఇష్టమగు, స్థితిన్
ఉనికిచేత, శేషము సమము.

సీ. శైలాగ్ర విచల ద్ర ♦ సాలామితఫలచ్ఛి
దాలాలస త్కీర ♦ ధర్షణములు
మాలాయిత మిళ త్త ♦ మా లా త్త జలద స్పృ
హాలాలస మయూర ♦ హర్షణములు
నేలా లతా వ్యాజ ♦ డోలాఢ్య వనదేవ
బాలా రచిత దివ్య ♦ భాషణములు
హాలా వివశ భృంగ ♦ బాలా కలిత రమ్య,
కోలాహలజమైక ♦ ఘోషణములు,
గీ. కలిత కలకంఠ కులకంఠ ♦ లలిత గాన
తానములు వీనులకు విందు ♦ గా నెలర్పఁ
జనుచు శీతల నగకూట ♦ మునఁ దనర్చు
సుందరమణీ ప్రపంచంబు ♦ సూచె నంత. 27

టీ—శైలా......ధర్షణములు శైలాగ్ర = పర్వతాగ్రములయందు
విచలత్ - చలించుచున్న, రసాల - తియ్యమామిడి చెట్లయొక్క, అమిత -
మితిలేని, ఫల - పండ్లయొక్క, భిదా = ఛేదించుటయందు, లాలసత్ -
ఆసక్తములగుచున్న, కీర - చిలుకలయొక్క, ధర్షణములు - ప్రగల్భతలు,
మాలా...హర్షణములు - మాలాయిత - వరుసలు గట్టిన, మిళత్ - ధ్వని
చేయుచున్న, తమాల - తాపింఛ వృక్షములయందు, ఆత్త - పొందఁబడిన,
జలద మేఘములను నట్టి, స్పృహా - ఇచ్ఛచేత, లాలస - ఆసక్తములగు -
మయూర - నెమిళ్ళయొక్క, హర్షణములు - సంతోషములును, ఏలా....

భూషణములు - ఏలాలతా - ఏలకి తీఁగలనెడు, వ్యాజ - మిషము గల డోలా - ఉయ్యెలలయందు - ఆఢ్య - కూడిన, వనదేవ = వనదేవతల యొక్క బాలా - కన్యకలచేత, రచిత - చేయఁబడిన, దివ్యభూషణములు - ప్రశస్తవాక్యములును, హాలా ... ఘోషణములు - హాలా - మద్యముచేత (అనఁగా మకరందపానముచేత ననిలాక్షణికార్థము) వివశ = పరవశము లైన, భృంగబాలా = తుమ్మెదకన్నెలచేత, కలిత = చేయఁబడిన రమ్య - సుందరము లైన, కోలాహల - పెద్దధ్వనుల నెడి, జయ - జయమందు, ఏక ముఖ్యములగు, ఘోషణములు - ధ్వనులును, కలిత...తానములు - కలిత - వ్యాప్తమైన, కలకంఠ - కోకిలల యొక్క, కుల - సమూహముయొక్క, కంఠ - కంఠముల యొక్క, లలిత - సుందరము లైన, గానతానములు - పాటలయందలితానములు, వీనులకున్ - చెవులకు విందుగాన్ - ఆనందముగా, ఒనర్పన్ చేయఁగా, చనుచున్ - వెళ్ళుచు, శీత.....కూటమునన్ - శీతల - నగ - హిమవత్పర్వతము యొక్క, కూటమునన్ - శిఖరమందు, తనర్చు - ఒప్పునట్టి, సుందరమణీ ప్రపంచంబు - సుందర - సొగసైన, మణీ - మాణిక్యముల యొక్క, ప్రపంచంబు - విస్తారము, చూచెన్ = వీక్షించెను, అంత - అంతట.

సీత-శీత... కూటమునన్ - శీతల - చల్లనైన, నగ - వృక్షములయొక్క కూటమునన్ - పోగుచేత, తనర్చు - ఒప్పునట్టి, సుంద - సుందునియొక్క రమణీ - భార్యయగు తాటకయొక్క, ప్రపంచంబు - నివాసమును.

క. లలితాత్ముఁ డతఁడును ద
త్స్థలి దాటకగని సమగ్ర ♦ శరముల ఖండిం
చి లతాశతావృత వన
స్థలి నిలచె మహాతపంబు ♦ దగఁ దనరింపన్. 28

ప్ర — లలితాత్ముఁడు = సుందరరూపుఁడగు, అతఁడును = ఆశివుఁడును, తత్స్థలి = ఆచోటును, దాటక = అతిక్రమించక, కని = చూచి, లతాశతావృత వనస్థలిన్ = లతా = తీగలచేత, ఆవృత = క్రమ్మఁబడిన, వనస్థలిన్ =

వనప్రదేశమునందు, సమగ్రశరములన్ = పొడవైనరెల్లు పుట్టలను, ఖండించి = నఱికివేసి, మహాతపంబు = గొప్పతపస్సును, తగన్ = ఒప్పునట్లు, తనరింపన్ = చేయుటకు, నిలచెన్ = ఉండెను.

సీత—అతఁడును = ఆ శ్రీరామమూర్తియు, తత్స్థలిక = ఆచోటు, తాటకన్ = తాటకయను రాక్షసస్త్రీని, కని = చూచి, సమగ్రశరములన్ = గొప్పబాణములచేత, ఖండించి = దానిని, ద్రెగవేసి, లతాశతావృత వనస్థలియందు, మహాతపంబు=మహాత్=గొప్పదియగు, ఆతపంబు = ఎండ, దగఁదనరింపన్ = దప్పిగలుగఁజేయఁగా, నిలచెన్.

క. విశ్వామిత్ర సమర్ధిత
శాశ్వతి కాస్త్ర ప్రచార • చాతుర్యుఁ డతం
డాశ్విత శీతనగాంత
ర్విశ్వంభరుఁడగుచు సత్య • పీక్షార్త మతిన్. 29

పా—విశ్వా......చాతుర్యుఁడు. విశ్వ = ప్రపంచమునకు, అమిత్ర = శత్రువులగు రాక్షసులయందు, సమర్థిత = నిర్వహింపఁబడిన, శాశ్వతిక = నిరంతరములగు, అస్త్ర = ఆయుధములయొక్క, ప్రచార = సంచారమునందు, చాతుర్యుఁడు = నేర్పుగల = అతండు = అశివుఁడు, ఆశ్విత ... భరుఁడు = ఆశు = శీఘ్రముగా, ఇత = పొందఁబడిన, శీతనగ, హిమవత్పర్వతముయొక్క అంతః = మధ్యమందలి, విశ్వంభరుఁడగుచున్ = భూమిగలవాఁడౌచు, సత్యమతిన్ = సతీ = సతీదేవియొక్క, అపీక్షా = చూడకపోవుటచేత, ఆర్త = బాధఁజెందుచున్న, మతిన్ = బుద్ధిచేత.

సీత—విశ్వా ... చాతుర్యుఁడు = విశ్వామిత్ర = విశ్వామిత్ర మహర్షిచేత, సమర్థిత = సమర్థింపఁబడిన (అనఁగానియ్యబడిన) శాశ్వతికాస్త్రప్రచారచాతుర్యుఁడు, అతండు = ఆ శ్రీరామమూర్తి, అశ్విత...భరుఁడు, ఆశు = శీఘ్రముగా, ఇత = పొందఁబడిన, శీత = చల్లనైన, నగ = వృక్షముల

యొక్క, అంతర్విశ్వంభరుఁడగుచు, సత్యవీక్షార్తమతిన్ = సత్య = సత్యముయొక్క, వీక్షా = దృష్టియందు, ఆర్త-తొందరపడుచున్న, మతిన్ = బుద్ధిచేత.

వ. సమయ ప్రబుద్ధ ముకుళంబు లగు వకుళంబులు నసమ రస ఫలప్రదాన గరిమ విజిత సురసాలంబులగు రసాలంబులును, వనాంచల సంచరణ చంచుపుళింద మిళిందసుంద రాలకా బృంద చరణారవింద సందర్భసద్య స్సముద్య దసదు కుసుమ మంజులమ్ములగు వంజులమ్ములును వన్యా కన్యా కేశ పాశసమాన శీలమ్ములగు తమాలమ్ములును కిన్నరీ బృందకుచ కలశ ముద్రికా ముద్రిణోద్రిక్త కోరకమ్ములగు కురవకమ్ములును, వనితా జనతాఘన కటాక్షవీక్షణోన్ని ద్ర ప్రసవ కపట పులకమ్ములగు తిలకమ్ములును, ప్లవమాన పవమాన మాణవ చలిత కర్పూరపూర వాసనా సమా సాదిత హాళహాళికలగు కనకకదళికలును చంచరీక సంచయ ప్రపంచా నుపాదేయమ్ములగు చాంపేయమ్ములును, మొద లగు వసంతసమయ సముజ్జృంభిత కుసు మోపలంభంబు లగు నఖిలకుంభినీజ సంరంభంబుల విలసిల్లు నతిపావనంబగు తపోవనంబుఁ బ్రవేశించె నంత. 30

టీ. సమ......ముకుళంబులగు = సమయ = కాలమందు, ప్రబుద్ధ= వికసించిన, ముకుళంబులగు = మొగ్గలుగల, వకుళంబులును = పొగడచెట్లును అసమ...సాలంబులగు, అసమ = తుల్యములేని, రస = రుచిగల; ఫల = పండ్లయొక్క, ప్రదాన = యిచ్చుటయందలి, గరిమ = గౌరవముచేత, విజిత-

జయింపఁబడిన, సురసాలంబులగు = కల్పవృక్షములుగల, రసాలంబులును = తియ్య మామిడిచెట్లును, వనాం...మంజులమ్ములగు, వనాంచల=వనప్రా మందు, సంచరణ = సంచారముతోఁగూడిన, చంచుపుళింద మిళింద సుం రాలకా = చెంచుపొలంతులయొక్క, బృంద = సమూహముయొక్క, చ ణారవింద - పాదపద్మములయొక్క, సుదర్భ = కూడికచేత. సద్య సన్న ద్యత్ - తత్కాలమందుదయించుచున్న, అసమ- సమానములేని, కుసుమ పుష్పములచేత, మంజులమ్ములగు - మృదువైన, వంజులమ్ములును - అశో వృక్షములును, వన్యా...శీలమ్ములగు- వన్యా - వనసమూహమనెడి, కన్యా స్త్రీలయొక్క, కేశపాశ - కొప్పుతోఁడ, సమానశీలమ్ములగు - తుల్యస్వభ వముగల, తమాలమ్ములును - తాపింఛవృక్షములును, కిన్నరీ...కోరకమ్ములగు కిన్నరీ - కిన్నరస్త్రీలయొక్క, బృంద = సమూహముయొక్క, కుచకలశ కలశములవంటి కుచములనెడు, ముద్రికా - సీళ్ళచేత, ముద్రణ=ముద్రించుట చేత, ఉద్రిక్త - అతిశయించిన, కోరకమ్ములగు - మొగ్గలుగల, కురవకమ్ము లును = గోరంటచెట్లును, వనితా...పులకమ్ములగు = వనితాజనతా - స్త్రీ జనసమూహముయొక్క, ఘన - గొప్పదియగు, కటాక్షవీక్షణ = క్రేఁగంటి చూపుచేత, ఉన్నిద్ర - వికసించిన, ప్రసవ - పువ్వులనెడి, కపట-మిష గల, పులకమ్ములగు = గగుర్పాటుగల, తిలకమ్ములును - బొట్టుగుచెట్లును ప్లవ...హాళికలగు - ప్లవమాన - తూలుచున్న, పవమానమాణవ - పిల్లగా చేత, చలిత-కదలించఁబడిన, కర్పూరపూర - కర్పూరసమూహములయొక్క వాసనా - పరిమళముచేత, సమాసాదిత - పొందఁబడిన, హాళిహాళికలగు త్వరగల, కనక కదళికలును-బంగారపుటనటిచెట్లును, చంచ...పేయమ్ములగు చంచరీక సంచయ - తుమ్మెద గుంపులయొక్క, ప్రపంచ - విస్తారమునకు అనుపాదేయమ్ములగు - స్వీకరించఁదగని, చాంపేయమ్ములును - సంపం చెట్లును, మొదలగు - మొదలుగాఁగల, వసంత...లంభంబులగు, వసంత మయ - వసంత కాలమందు, సముజ్జృంభిత - అతిశయించుచున్న, కుసుమ పువ్వులయొక్క, ఉపలంభంబులగు - లాభముగల, నిఖిల...రంభంబుల

ఖిల - సమస్తము లైన, కుంభినీజ - వృక్షములయొక్క, సంరంభంబులన్ - టోపములచేత, విలసిల్లు - ప్రకాశించునట్టి, అతిపావనంబగు - మిక్కిలి పవిత్రమైన, తపోవనంబున్ - తపోవనమును, ప్రవేశించెన్ - సొచ్చెను, అంత - అంతట,

క. అల్ల నగాధేయుఁడు నృప
వల్లభుఁడును దీక్షితుఁడయి ♦ వ్రత విధ్యుచితా
త్యుల్లసిత వస్తు విరచన
సల్లలిత విచార సరణి ♦ చక్కఁగఁ జేసెన్. 31

పా— అల్లనగాధేయుఁడు. అల్ల - ప్రసిద్ధుఁడగు, నగ - పర్వతము నకు, అధేయుఁడు - పైనుండు నీశ్వరుఁడును, నృపవల్లభుఁడును - సంరేశ్వరుఁడును, దీక్షితుఁడయి - దీక్షగలవాఁడై, వ్రత...సరణి. వ్రతనిధి - నియమ మేకి, ఉచిత - తగిన, అత్యుల్లసిత - మిక్కిలి ప్రకాశించుచున్న, వస్తు-వస్తువులయొక్క, విరచన - రచించుటయందు, సల్లలిత - మిక్కిలి బాగైన, విచారసరణి - ఆలోచనమార్గము, చక్కఁగఁజేసెన్ - బాగుగాఁజేసెను.

సీత—అల్లనన్ - మెల్లగా, నృపవల్లభుఁడు, నృప - పుణ్యము, వల్లభుఁడు - ఇష్టముగాఁగల, గాధేయుఁడు-విశ్వామిత్రుఁడు, శేషము సమము.

మా. ఖ్యాతుండాతఁడుదారసంగరసభా ♦ వాప్తిందురంతంబుగాఁ
జేతోవృత్తిఁ దలంచి లక్ష్యపద సం ♦ సిద్ధిం బ్రసిద్ధాశుగా
ఘాతోద్ఘాత నిరోధ సాధన విధిం ♦ గల్పించి యుద్యోగ సం
ప్రీతింజేయుచునుండు నాశ్రమమునన్ - మిన్నాతపం
బేర్పడన్.. 32

పా—ఖ్యాతుండు - ప్రసిద్ధుడగు, అతఁడు - ఆశివుఁడు, దార... ప్తిన్. దార - భార్యయొక్క, సంగ - కలయికచేతనైన, రస - రుచి

యొక్కయును, భావ-సాత్త్వికాదులయొక్కయును, ఆప్తిన్-పొందుటను, దురంతంబుగాన్ - కష్టమైనదానింగా, చేతోవృత్తిన్ - మనోవ్యాపారముచేత, తలంచి - ఎంచి, లక్ష్యపదసంసిద్ధిన్, లక్ష్య - చూడఁదగిన, పద - వస్తువుయొక్క, (పరమాత్మయొక్క) సంసిద్ధిన్ - సిద్ధిని, ప్రసి...విధిన్, ప్రసిద్ధ - లోకప్రసిద్ధములైన, ఆశుగ-ప్రాణవాయువులయొక్క, ఆఘాతోద్ఘాత - ప్రవేశనిర్గమములయొక్క, నిరోధ-అడ్డుటకు, సాధన-సాధనమైన, విధిన్ - వ్యాపారమును, కల్పించి-సంధానపరచి, ఉద్యోగసంప్రీతిన్, ఉత్-ఉన్నత-ఉన్నతమైన, యోగ-యోగమందు, సంప్రీతిన్-సంతోషమును, ఆశ్రమమునన్-ఆశ్రమమందు, మిన్నాతపంబు-శ్రేష్ఠతపస్సు, ఏర్పడన్ - ఏర్పడునట్లుగా, ఉండున్-నివసించును.

సీ— ఖ్యాతుండాతఁడు - ప్రసిద్ధుండగు నా శ్రీరామమూర్తిన్, ఉదా...వాప్తిన్, ఉదార-గొప్పదియగు, సంగనసభా-యుద్ధవాటికయొక్క, ఆవాప్తిన్ - పొందుటను, దురంతంబుగాన్ - కష్టమయినదానినిగా, చేతోవృత్తిన్-మనోవ్యాపారమున, తలంచి ఎంచి, లక్ష్యపదసంసిద్ధిన్, లక్ష్య-గురియొక్క, పద-స్థానముయొక్క, సంసిద్ధిన్-సిద్ధియందు, ప్రసి...విధిన్, ప్రసిద్ధ-అతిశయముచే సిద్ధించియున్న, ఆశుగ-బాణములయొక్క, ఆఘాతోద్ఘాత-ప్రయోగసంహారములయందును, నిరోధ-అడ్డగించుటయందును, సాధన-సాధనక్రియను, కల్పించి-చేసి, ఉద్యోగసంప్రీతిన్-ప్రయత్నమందు సంతోషమును, చేయుచున్-రచించుచు, ఆశ్రమమునన్-విశ్వామిత్రాశ్రమమందు, మిన్న-ఆకాశము, ఆతపంబేర్పడన్-(తనపరాక్రమముచేత) యెండగాయగా, ఉండున్-ఉండును.

శా. ఆచా రార్చిత లాజ రాజి చరణా ♦ ర్ధాయాస్య దేశంబులన్
ప్రాచీన ప్రవణ ప్రదేశముల సో ♦ పప్రస్త రాస్తారముల్
సాచి ప్రస్తుతసామగానమునిరా ♦ ట్సర్వస్వరారావముల్
వాచాతీత గతిం బొసంగెడు నన ♦ ర్వాచీన వీచి స్వనిన్. ౨౩౬

టీ. ఆచా .. దేణంబులన్, ఆచార-ఆచారములచేత, అర్పిత - ఉంచఁబడిన, లాజరాజి-పేలాలగ్రోవు యొక్క, చరణార్ఘ=తినుటకై, ఆ యాశ్యత్-రాఁగల, ఏణంబులన్-లేళ్ళుగల, ప్రాచీ...దేశములన్, ప్రాచీనప్రవణ-ప్రాక్ప్రవణాస్థిగల, ప్రదేశములన్ - వేదికాదిస్థలములయందు, సోప...స్తార ములన్ - సోపపరిస్తర-పైఁబరచినదర్భలతోఁగూడిన, ఆస్తార - పరచిన దర్భలును, సాచి - రావముల్, సాచి-తిర్యఙ్ముఖముగా, ప్రస్తుత-ఆరంభింపఁబడిన, సామ-సామవేదము యొక్క, గాన-పాటగల, మునిరాట్-మునిశ్రేష్ఠుల యొక్క, సర్వ-సమస్తములయిన, స్వాన-స్వనముల యొక్క, ఆరావముల్-ధ్వనులును, వాచాతీతగతిన్=చెప్పశక్యముగానిరీతిచేత, పొసంగెను - ఒప్పునట్టి, అనర్వాచీనవీచిన్, అనర్వాచీన-తక్కువగాని, వీచిన్-అవకాశముగల, వనిన్-అరణ్యమందు.

శా. సారంగోత్తమ చర్మ మంగమున నాచ్ఛాదించి సత్యైకర
స్యారూఢ స్థితి నాశ్రమంబలర నార్యాధీశుఁడాదీక్షతో
ఘోరంబౌ తపమాచరింపఁగ నసంఖ్యుల్ కర్మ నిష్ఠాతిర
స్కారార్థంబు తపోవనంబునుయదృచ్ఛంజూచిరత్యుద్ధతిన్.

పా — సారంగోత్తమచర్మము-గజశ్రేష్ఠముయొక్కతోలును, అంగమునన్-దేహమందు, ఆచ్ఛాదించి-కప్పి, సత్యైక...స్థితిన్, సతీ-సతీదేవియందలి, ఐకరస్య - ముఖ్యానురాగము గలుగుటను, ఆరూఢ - పొందినట్టి, స్థితిన్-ఉనికిచేత, ఆర్యాధీశుఁడు, ఆర్యా సతీదేవియొక్క, అధీశుఁడు-పెనిమిటియగు నీశ్వరుఁడు, ఆదీక్షతోన్-చెప్పియున్న దీక్షతోడ, ఘోరంబౌ-భయంకరమయిన, తపము-తపస్సు, ఆచరింపగన్-చేయఁగా, అసంఖ్యుల్ - లెక్కలేనివారు, (అనఁగాఁ బలుమంది) కర్మ...స్కారార్థంబు, కర్మ-తపఃకర్మ యొక్క, నిష్ఠా-నిశ్చలత్వముయొక్క, తిరస్కారార్థంబు - తిరస్కరించుటకొరకు, తపోవనంబును - శివుని తపోవనమును, యదృచ్ఛన్ - స్వేచ్ఛచేత, అత్యుద్ధతిన్-మిక్కిలి దురుసుతనముచేత, చూచిరి-వీక్షించిరి.

సీత—సారంగ = లేడియొక్క ఉత్తమ - శ్రేష్ఠునకు, సత్యైక... స్థితిః - సత్య = సత్యస్వరూపమగు పరబ్రహ్మమందు, ఐకరస్య - ప్రధాన రసము గలుగుటచేతను, ఆరూఢ = ప్రసిద్ధమగు, స్థితిః = ఉనికిచేత, ఆర్యాధీశుఁడు - ఆర్య = పూజ్యులకు, అధీశుఁడు = అధిపతియగు నావిశ్వామిత్రుఁడు, అసంఖ్యుల్ = యుద్ధము లేనివారు, (అనఁగా మాయనేకాని యుద్ధము సెయుంగని వాండ్రగు రాక్షసులు.)

సీ. ఘన కుంతల తలమ్ములును ♦ పిలును శాలతదగు,
బిరుదులు మఱి సుర ♦ భీకృతి ప్ర
శస్తమ్ములగు చాప ♦ హాస్తమ్ములును బట్టి,
సహిత సజ్జఘనాఢ్య ♦ చక్రిములును
విమలార్ధ చంద్రఫా ♦ లములు నుల్లసిత సుం,
దరమణీ జాత వి ♦ స్ఫురణ దనరఁ
దరులలో విరుల పం ♦ దిరులలోపలఁ జొచ్చి,
యతుల మహర్షుల ♦ నరచఁ జెరచి
గీ. మానవతులాపఁగలసద్వి - ధానమునకు
దామసులుగామరతులునా ♦ రామనికట
సీమభీమ వ్రతవిభంగ ♦ భూములగుచు
వర్తిలిరిమత్తిలుచుదుష్ట ♦ వర్తనముల. 35

పా— ఘనకుంతల తలమ్ములు, ఘన - మేఘములవంటి, కుంతల - ముంగురుల యొక్క, తలమ్ములు = ప్రదేశములును, విశాలతదగు = వైశాల్యము చేత నొప్పునట్టి, పిరుదలు = జఘనములును, మఱి = మఱియు, సురభీకృతి ప్రశస్తమ్ములగు - సురభీకృతి - పరిమళింపఁ జేయుటయందు, ప్రశస్తమ్ములగు = మేలైన, చాపహాస్తమ్ములును - చాప - కపటప్రధానములగు

(విలాసాదులచే వంచించుటయందు నేర్పుగలవి) హస్తమ్ములను = చేతులను పట్టి - అవలంబించి, సహిత ... చక్రములును - సహిత = సమానములగు, (ఇది సంహితశబ్దమునకు రూపాంతరము) సత్ - సౌభాగ్యములగు, జఘనాఢ్య చక్రములును, ప్రశస్తచక్రములవంటి కటిపురోభాగములును, విమల...లములును విమల - నిర్మలములగు, అర్ధచంద్ర - సగము చంద్రునిబోలు - ఫాలములును లలాటములును, ఉల్లసిత...స్ఫురణ - ఉల్లసిత - ప్రకాశించుచున్నట్టియు, సుందర - సొగసైనట్టియు, మణీజాత - రత్నసమూహముల యొక్క, విస్ఫురణ=ప్రకాశము, తనరన్ - ఒప్పునట్లుగా, తెరువలలోన్ - చెట్లలోను, విరుల పందిరులలోపలన్ - పువ్వుల పందిరులలోపలను, చొచ్చి - ప్రవేశించి, యతులన్ - నియమముగలవారిని, మహర్షులన్-గొప్ప మునులను, అరచన్ - అరచునట్లుగా, చెరచి - నియమ భంగముఁ జేసి, మానవతులు - స్త్రీలు, ఆ పగలన్ - అట్టి యకారణవిరోధములచేత, సద్విధానములకున్ - యోగ్య క్రియలకు, తామసులు =తమోగుణముతోఁ గూడినవారును, కామరతులు కామ మందాసక్తి గలవారును, ఆరామ...... భూములు - ఆరామ = ఉద్యానము యొక్క, నికట - సమీపమందున్న, భీమ = శివునియొక్క, వ్రత - నియమము యొక్క, విభంగ - భంగపెట్టుటయందు, భూములు - బాహుళ్యము గలవారును, ఆగుచు - ఔచు, మత్తిలుచు - మత్తతగలవారౌచు, దుష్టవర్తనములన్ - దుర్వ్యాపారములచేత, వర్తిలిరి - ప్రవర్తించిరి.

సీ.—ఘనకుంతలతలు - గొప్పవియగు తీగలవంటి యీటెలు, అమ్ములును - బాణములును - విశాలతదగు - వైశాల్యముచేత నొప్పు, బిరుదులు - బిరుదాంకములును, సుర......శస్త్రమ్ములగు, సుర - దేవతలకు, భీకృతి - భయమును జేయుటయందు, ప్రశస్తమ్ములగు - గొప్పవియైన - చాప హస్తమ్ములను - ధనుస్సులతోఁ గూడిన చేతులను, పట్టిస ...... చక్రములును- పట్టిస-ఆయుధవిశేషములును, హిత-ఇష్టములై, సజ్జ-సిద్ధములైన, ఘన - గొప్పవియు, ఆఢ్య-సమర్థములునైన, చక్రములును - చక్రాయుధములును, విమలా ... ఫాలములును, విమల—నిర్మలములైన, అర్ధచంద్ర -

అర్ధచంద్ర బాణములను, ఫాలములును — కత్తి వంటి ఆయుధము లును, ఉల్లసిత ... స్ఫురణ — ఉల్లసిత — ప్రకాశించుచున్న, సుంద = సుందుని యొక్క, రమణీ — భార్యయగు తాటకవలన, జాత — పుట్టిన సుబాహురాక్షసుని యొక్క, విస్ఫురణ - అతిశయము, తనరన్ - ఒప్పనట్లు తరులలోవిరుల పందిరులలోపలఁజొచ్చి, అతులమహర్షులన్ - సామ్యములేని గొప్పమునులను, అరచన్ - అరచుచుండఁగా, చెరచి - చెడఁగొట్టి, మానవ ధానమునకున్ - మానవ - మనుష్యులయొక్క, తులా, సామ్యమును, అపగ దాటిపోయిన, లసత్ = ప్రకాశించుచున్న, విధానమునకున్ - క్రియకు తామసులు గామరతులు, ఆరామ... సీమన్ - ఆ - అట్టి, రాముని తటసీ మన్ - శ్రీరామమూర్తియొక్క సమీపప్రదేశమందు, భీమవ్రతవిభంగ భూ మలు - భయంకరమగు నియమమును భంగపెట్టుటయందు బాహుళ్యము గలవారు, శేషము సమానము.

సీ. వన లుప్పతిల నొప్పు ♦ నును గొప్పులను విప్పు
మరు దాళి దగ రంభ ♦ బరఁగె నొకటఁ
గన నళ్కుచును బెళ్కు ♦ చును కళ్కు కడకంటి
గరిమ మించఁగ నిల్చె ♦ హారిణి యొకట
నసమాన లసమాన ♦ మగు గానముల తాన
ముల మించి భ్రమరిక ♦ బొలిచె నొకట
బలు నీటులు చొకాట ♦ ములు తేట పసు పాట
లను మించి వాసంతి ♦ దనరె నొకట
ఆ. నిటుల మరుని యతుల ♦ వృత్తి వర్తిలు తపో
వనము నందు నాస ♦ వమ్ము లల్కఁ
బట్టి చెరచికొనుచు ♦ బాధించి రపుడు దు
రాశ రమణులెల్ల ♦ వైశసమున.

పా—ననలుప్పతిలన్ - పువ్వులు విజృంభించఁగా, ఒప్పు - తగు నట్టి, నునుగొప్పులను - నున్ననికేశబంధములను, విప్పు-విడఁదీయుటట్టి, మరుత్ - వాయువులయొక్క, ఆళి - పఙ్క్తి, తగన్ - ఒప్పునట్లు, రంభ - రంభయను నప్సరస, ఒకటన్ - ఒకవైపున, పరఁగెన్ - ఒప్పెను, కనన్ - చూచు టకు, ఆళ్కుచును - భయపడుచు, బెళ్కుచును - చలించుచు, కళ్కు - కాంతిగల, కడగంటికరిమ - నేత్రాంతముయొక్క యతిశయము, మించన్ - హెచ్చఁగా, ఒకటన్ - ఒకవైపున, హారిణి - హారిణియను నప్సరస, నిల్చె న్ - ఉంచెను. అసమాన లసమానమగు - సామ్యము లేక ప్రకాశించునట్టి గానముల తానములన్ - పాటలయొక్క తానములచేత, మించి - అతిశ యించి, ఒకటన్ - ఒకవైపున, భ్రిమరికయను నప్సరస, పొలిచెన్ - ప్రకా శించెను. పలునీటులు - పెక్కువిలాసములును, చొకాటములు - సొగసు లును, తేటపడు - స్పష్టమగునట్టి, పాటలను - గానములచేత, మించి - అతి శయించి, ఒకటన్ - ఒకవైపున, వాసంతి - వాసంతియను నప్సరస, తన రెన్ - ఒప్పెను, ఇటుల - ఈప్రకారము, మరుని - మన్మథునియొక్క, అ తుల - సామ్యములేని, వృత్తిన్ - వ్యాపారముచేత, వర్తిలు - ప్రవర్తించు నట్టి, తపోవనమునందున్ - తపోవనమందు, ఆసవమ్ములు - మద్యములు, అల్కన్ - కోపముచేత, పట్టి - పట్టుకొని, చెరచికొనుచున్ - చెడఁగొట్టు కొనుచు, అపుడు - ఆసమయమందు, దురాశన్ - పెద్దఆశచేత, రమణు లెల్లన్ - స్త్రీలందరును, వైశసమునన్ - క్రూరకర్మముచేత, బాధించిరి - బాధచేసిరి.

సీత—కొప్పులను - వృక్షాగ్రములయందు, రంభ — అరటిచెట్టు, హారిణి - లేడి, భ్రిమరిక - ఆడుతుమ్మెద, పాటలను - కలిగొట్టుచెట్టువందు వాసంతి బండికురివింద, ఇటులు - ఈప్రకారము, అమరు - ఒప్పునట్టి, నియతుల - నియమముగలవారియొక్క వృత్తిన్ - ప్రవర్తించుటచేత,• ఆసవ మ్ముల - ఆయజ్ఞములు. దురాశరమణులు - దుష్టరాక్షసశ్రేష్ఠులు, శేషము సమము.

చ. సుమహితచాపరోపగుణ♦శోభిసుబాహుఁడుమారుఁడంబ
బమలత నొప్పఁగాఁ గలియ ♦ నత్తరి బాలక రాజమౌళిక
న్బొమలు నటింపఁగానల♦పుంజముఁ గ్రక్కెడి యంబకంబునన్
గ్రమమున భస్మసాత్కృతుని♦గా నొనరించెను దుర్ధరోద్ధతిన్.

పా— సుమ...బాహుఁడు, సుమ = పుష్పములచేత, హిత-కూర్పఁబ చాప — ధనుస్సుచేతను, రోప— బాణముచేతను, గుణ — నారిచేత శోభి - ప్రకాశించుచున్న, సుబాహుఁడు- మంచిభుజములుగల, మారుఁడ మన్మథుఁడు, అంబరంబు - వస్త్రము, అమలతన్ - నిర్మలత్వముచేత, ఒప్ప గాన్ - ప్రకాశించఁగా, కలియన్ - ఆక్రమించఁగా, అత్తరిన్ - ఆస మయమందు, బాలక రాజమౌళి - బాలచంద్ర కిరీటుఁడగు శివుఁడు, కన మలు - భ్రూలతలు, నటింపఁగాన్ - కదలఁగా, అనలపుంజము గ్రక్కె— అగ్నికణసమూహమును వెడలించునట్టి, అంబకంబునన్ - కంటిచేత, క్రమ నన్ - వరుసగా, సుదుర్ధరోద్ధతిన్ - మిక్కిలి యాపశక్యముగాని యౌద్ధత్య ము చేత, భస్మసాత్కృతునిఁగాన్ - భస్మీభూతుఁడై చేయఁబడిన వానిఁగా ఒనరించెన్ - చేసెను,

సీత— సుమ...శోభి, సుమహిత - మిక్కిలి పూజితమగు, చాపరో గుణశోభి-ధనుస్సుచేతను, బాణములచేతను నారిచేతను ప్రకాశించుచున్న సుబాహుఁడు - సుబాహుఁడను పేరుగల, మారుఁడు - చంపువాఁడగు క్షసుఁడు. అంబరంబు - ఆకాశము, బాలక రాజమౌళి - పిల్లవాఁడగు రా శ్రేష్ఠుఁడైన రామమూర్తి, అంబకంబునన్ - బాణముచేత,

క. అపరిమిత పావనార్చి రు
పపన్నము తదంబకంబు ♦ పైనఁ గుమారా
చపలా దేశ విలాసము
లుపశమితములుగ నొనర్చె ♦ నుద్ధతి మీరన్.

పా—అపరిమిత•• ప్రపన్నము అపరిమిత - అమితములగు, పావన - పవిత్రములగు, అర్చిః - జ్వాలలతోడ, ఉపపన్నము - కూడుకొనిన, తదంబకం ఆ యీశ్వరుని నేత్రము, పైన్ - మన్మథుని సంహరించిన తరువాత, అగు - అయినట్టి, మారీచ... విలాసములు - మారీచ- మారీచుఁడను పేరుగల, పలాద మాంసముఁ దిను రాక్షసులకు. ఈశ - అధిపతియగు వాని యొక్క. విలాసములు - చేష్టలు, ఉద్ధతిమీరన్ - ఔద్ధత్యమతిశయించునట్లుగా, ఉపశమింతములుగన్ - శాంతిబొందునట్లు, ఒనర్చెన్ - చేసెను.

సీత—అపరి•••పపన్నము. అపరిమిత- మితములేని, పావన—వాయు సంబంధియగు, అర్చిః — తేజస్సుతోడ, ఉపపన్నము — కూడిన, తదంబకంబు—ఆశ్రీరామమూర్తియొక్క బాణము, పైన — సుబాహుని జంపిన తరువాత, కుమారీ...విలాసములు, కుమారీ—అప్సరస్త్రీలయొక్క, చపల — చంచలములగు, ఆదేశ — ఆజ్ఞలును, విలాసములు — శృంగారచేష్టలు శేషము తుల్యము.

క. కలయం గన విన మతి కిం
పులు వెలయమిఁ నదరి పారి - పోవుచు నలు ది
క్కుల గొందరు గుహలను వన
ములఁ గొందరు డాగిరపుడు - మోహిత మతులై. 39

టీ. కలయన్- అంతటవ్యాపించునటుల, కన విన మతికిన్—కోపించిన మనస్సునకు, ఇంపులు — ఇష్టములు, వెలయమిన్ — పుట్టకుండుటచేత, అదరి - జడిసి, పారిపోవుచున్ - పరుగువెట్టుచు, నలుదిక్కులన్ - నాల్గు దిక్కులయందును, కొందరు - కొంతమంది, గుహలను - పర్వతరంధ్రముల యందును, కొందరు - కొఁతమంది, వనములన్ - అడవులయందును, మోహితమతులై - మోహపెట్టబడిన వారై, అపుడు - ఆసమయమందు, డాఁగిరి - డాఁగియుండిరి.

క. ఈగతి నుదుటున మించు మ
హాగరి మాంబక సముజ్జ్వ ♦ లానల సత్వ
శ్రీ గగనమంటగను జే
జే గరితలు భోరటంచుఁ ♦ జెప్పిరి వేగన్. 40

పా. ఈగతిన్ - ఈరీతిచేత. ఉదుటునన్ ఔద్ధత్యముచేత, మించు అతిశయించునట్టి మహా...శ్రీ - మహత్ - గొప్పదియగు, గరిమ - గురుత్వముగల, అంబక - నేత్రమందు, సముజ్జ్వల - ప్రజ్వలించుచున్న అనల - అగ్నియొక్క, సత్వ - బలముయొక్క శ్రీ - శోభ, గగనమంటగను-ఆకాశమంటగా. జేజేగరితలు - దేవతాస్త్రీలు, భోరటంచున్ - భోరు మనుచు, వేగన్-త్వరచేత, చెప్పిరి-చెప్పికొనిరి.

సీత — మహా...శ్రీ, మహాగరిమ-మిక్కిలి గొప్పతనముగల, అంబక — బాణముయొక్క, సముజ్జ్వల - ప్రకాశించుచున్న, అనలసత్వ - చురుకుదనముయొక్క, శ్రీ-సంపద, శేషము సమము.

క. గడగడ వడఁకెను దెసల
ప్పుడు పుడమియు జడిమ నడరె ♦ బుడిబుడి నడకన్
గడలుకొనె మెకము లెడనెడ
నడుగడుగున భయము పడుచు ♦ నడవుల నడుమన్ 41

టీ. అప్పుడు-ఆసమయమందు, దెసలు-దిక్కులు, గడగడ వడఁకెను - గడగడఁ జంచలించెను, పుడమియు-భూమియును, జడిమన్ - స్తబ్ధత్వముచేత, అడరెన్-ఒప్పెను, అడవుల నడుమన్ - వనమధ్యమందు, మెకములు - మృగములు, ఎడనెడన్-అన్నిచోటుల, అడుగడుగునన్ - ప్రతిపాదమందును, భయపడుచున్ - వెరచుచు, బుడిబుడినడకన్ - తొట్రుపడునట్టి నడకను, కడలుకొనెన్-ఆరంభించెను.

వ. అట్టి మహోన్నత ఘోర విరామంబగు నారామంబున న
య్యవసరంబున. 42

టీ. అట్టి-ఆప్రకారమయిన, మహో... రామంబగు, మహోన్నత - మిక్కిలి గొప్పదియగు, ఘోర=భయంకరవ్యాపారములే, విరామంబు-పర్యవసానము గలది, అగు, నారామంబునన్ - అయిన వనమందు, అయ్యవసరంబునన్ - ఆ సమయమునందు,

సీ. కంచుమించుగ మించు ♦ నంచ నెంచఁగ సంచ
రించుపలుకులకల్కి ♦ రేని తపము,
జన్నమన్నముగాఁగ ♦ మన్న మన్నెల వాక
వెన్నంటిరాఁ జన్న ♦ విభు తపంబు
గట్టుపట్టినిఁ జెట్టఁ ♦ బట్టె చట్టుప లేలి
నట్టి జెట్టిని గ్రోలు ♦ దట్ట తపము
నక్కదిక్కున నగ్గి ♦ పెక్కు గ్రక్కు నజాస్త్ర
మక్కజంబుగ మెక్కు ♦ యమి తపంబు
గీ. తన తపంబున కెనయంచు ♦ మునులు బొగడ
కలయ నల్లనగాధేయ ♦ ఘన తపస్వి
మించు నారామ సవిధ భూ ♦ మికిని వచ్చె
సుమహిత మతి ప్రేమవిధి న ♦ చ్యుతుఁడునగుచు. 43

తా—కంచుమించుగన్ - నిరాటంకముగా, మించు - శోభించునట్టి, అంచన్ - హంసచేతను, ఎంచగన్ = స్తోత్రము జేయునట్లుగా, సంచరించు - తిరుగునట్టి, పలుకులకల్కి - సరస్వతియొక్క, రేని - పెనిమిటి యగు బ్రహ్మయొక్క, తపము - తపస్సును, జన్నము - యజ్ఞము, అన్నముగాఁగన్ - ఆహారముగా, మన్న - జీవించిన, మన్నెలప్రభువులనఁగా దేవ

తలయొక్క, వాక - నది, (అనఁగాగంగ) వెన్నంటిరాన్ - వెనుక రాఁగా, చన్న - నడచిన, విభు - రాజుయొక్క, (అనఁగా భగీరథునియొక్క) తపంబు - తపస్సు, గట్టుపట్టిని - హిమవత్పర్వత పుత్త్రికగు మైనాకుని, చెట్టబట్టి - స్వీకరించి, చట్టుపలు = రెక్కలు, ఏలి నట్టిజెట్టిని - ఆపినసముద్రుని, కొల్లినట్టి దిట్ట - త్రాగిన అగస్త్యునియొక్క, తపము - తపస్సును, దిక్కుదిక్కునన్ - ప్రతిదిక్కునందును, అగ్గి = అగ్నిని, పెక్కు - విస్తారముగా, క్రక్కు - వ్యాపింపజేయునట్టి, అజాస్త్రము-బ్రహ్మాస్త్రమును, అక్కజంబుగ - ఆశ్చర్యముగా, మెక్కు — మ్రింగిన, యమి — వసిష్ఠముని యొక్క, తపంబు - తపస్సును, తన తపంబునకున్ - తనతపస్సునకు, ఎనయంచున్ - సమానమని, మునులుబొగడఁగ-మునులుసన్నుతింపఁగా, కలయఁగ = వ్యాప్తమగునట్లు అల్ల = ప్రసిద్ధుఁడయిన నగాధేయ = పర్వతముపైనుండు నీశ్వరుఁడనెడు, ఘనత పస్వి = గొప్ప తాపసి, మించు, ఒప్పునట్టి ఆరామసవిధభూమికిని = వనమందలి సమీపభూమికి, సుమహితమతి = మిక్కిలి పూజ్యమగు బుద్ధిగల, అచ్యుతుండు = విష్ణుమూర్తి, నగుచుఁ = నవ్వుచు, ప్రేమవిధిఁ = ప్రేమయొక్క చేయుటచేత వచ్చెఁ = ఏతెంచెను.

సీత। ప్రేమవిధిఁ = ప్రేమవిధిచేత, అచ్యుతుండు— జారనట్టి, గాధేయ ఘనతపస్వి = విశ్వామిత్రుఁడను గొప్పతాపసి. అల్లనన్ - మెల్లగా, మించు - అతిశయించునట్టి, రామ సవిధభూమికిని — శ్రీరాముని సమీపభూమికి. శేషము సమము.

చ. ఆరుదు దలిర్ప నప్పు డస♦మాంబకుఁ డాకలితాపవారణున్
దురితవిభేదినాముసు నె♦దుర్కొనియంఘ్రిసరోరుహమ్ములం
దురుతర భక్తివార్లి ముద♦మొప్పఁగ ముంగల నిల్చెనంజలి
స్ఫురదురుపాణిపంకజ వి♦భూషణశాలి వినమ్రమౌళియై. 44

ఫా— ఆరుదుదలిర్పన్ = ఆశ్చర్యమొప్పునట్లు, అప్పుడు - ఆసమయమునందు, అసమాంబకుఁడు - శివుఁడు. ఆ-అట్టి, కలితాపవారణున్. కలి

శోషముచేసినయైన, తాప - బాధలను, వారణున్ - నివారించునట్టి, దురిత విభేది - పాపములనుబోఁగొట్టునట్టి, నామునిన్ - పేరుగల విష్ణువును, ఎదుర్కొని - ఎదురుగావెళ్ళి, అంఘ్రిసరోరుహమ్ములందున్ - పాదమ్ముల యందు, ఉరుతరభక్తిన్ - మిక్కిలి గొప్ప భక్తిచేత, వ్రాలి - నమస్కరించినవాఁడై, ముదమొప్పఁగన్ - సంతోషమొప్పునట్లు, అంజలి......శాలియై అంజలి - దోసిలిచేత, స్ఫురత్ - ప్రకాశించుచున్న, ఉరు గొప్పదియగు పాణిపంకజ - హస్తపద్మమనెడు, విభూషణ - అలంకారముచేత, శాలి - ఒప్పుచున్న, వినమ్రి—వంగిన, మౌళియై - శిఖగలవాఁడయి, నిల్చెన్ - నిలువఁబడెను.

సీత—అసమాంబకుఁడు-సమానరహితములగు బాణములగలరాముఁడు ఆకలితాపవారణున్, ఆకలిత - తెలియఁబడిన, అపవారణున్ = అంతర్ధానము గలిగినట్టివాఁడు, దురితవిభేదిన్—పాపములను బోఁగొట్టునట్టివాఁడు, ఆమునిన్—ఆవిశ్వామిత్రుని, శేషము తుల్యము.

ఉ. బత్తిని నిల్చు నాతని న ♦ పార కృపారస లోచ నాంచలా
సత్తినను గ్రహించి యల ♦ సత్వ మయుండనె నీదు సేవకుం
జిత్తము విస్మయంపడియెఁ ♦ జెప్పెద నీకొక కామితంబు ని
ర్వృత్తముగాఁదలంపుము స♦మీహితసిద్ధిని యోకళాధరా.

టీ—బత్తిని - భక్తిచేత, నిల్చు - నిల్చిన ఆతనిన్ - ఆశివుని, అపార...సత్తిన్ - అపార - హద్దులేని, కృపారస - దయారసముగల, లోచనాంచల - కొనగంటిచూపులయొక్క ఆసత్తిన్ - సామీప్యముచేత, అనుగ్రహించి - దయచేసి, అల - అట్టి, సత్త్వమయుండు - సత్త్వగుణముయొక్క యవతారమగు నావిష్ణువు అనెన్ - ఇటుచెప్పెను. ఓకళాధరా - చంద్రకళాధారివగు నోశివుఁడా నీదుసేవకున్ - నీవుజేసెడు పరిచర్యకు, చిత్తము-మనసు, విస్మయంపడియెన్ - ఆశ్చర్యపడెను. నీకు, ఒక కామితంబు =

ఒకకోరికము, చెప్పెదన్ - చెప్పఁగలను. సమీహితసిద్ధిని - కోరికయొక్క సిద్ధిని, నిర్వృత్తముగాన్ - జరిగినదిగా, తలంపుము - ఆలోచించుమా.

సీత — ఆతనిన్ - ఆ శ్రీరామమూర్తిని, సత్త్వమయయుండు - సత్త్వ గుణ ప్రధానుఁడగు విశ్వామిత్రుఁడు, ఓకళాధరా — శాస్త్రములను ధరించిన (అనఁగా శాస్త్రవేత్తవగు) ఓ శ్రీరామమూర్తి.

సీ. కడుఁ బ్రౌఢిమహిమవం ♦ తుఁడని లోకములెల్లఁ
బొగడ మించు ధరేంద్రుఁ ♦ డ గణనీయ
సంపత్తి జనకుండు ♦ నింపారు నాతని
కన్య యనన్య సా ♦ మాన్య యగుచు
నాచలుకలకొల్కి ♦ యతికోమల ప్రభా
వ సతియందులశంక ♦ పొసఁగ దయ్యు
కానఁ గోకిల కంఠి ♦ చాన మానిత వృత్తి
నెన్నఁజేపట్టు సం ♦ దియము లేదు
గీ. వేగ మనమెల్ల ననురాగ ♦ వృత్తిదనరఁ
బోవలయునంచు నమ్మహా ♦ భూతి చిహ్న
శాలియగు రాజమౌళి నా ♦ సర్వమాని
మాననీయుం డనెఁ బ్రమాణ ♦ మహిమదనర. 46

తా — హిమవంతుఁడని లోకములెల్లఁ బొగడఁగన్ — హిమవంతుఁడని పేరుచేత జగములన్నియు స్తోత్రముజేయఁగా, ధరేంద్రుఁడు=పర్వతరాజయినవాఁడును, అగణ...జనకుండు. అగణనీయ = లెక్కించ శక్యముగాని, సంపత్తి— ఐశ్వర్యముజకు, జనకుండును — పుట్టించువాఁడును, కడున్ — మిక్కిలి, ప్రౌఢిమన్ — పౌఢత్వముచేత, మించున్ — అతిశయించును, ఆతనికన్య — ఆహిమవంతుని కూఁతురు, అనన్యసామాన్యయగుచున్ — ఇత

ములతో సామ్యములేనిదౌచు, ఇంపారన్ - శోభించుచు, అ చిలుకలకొల్కి = ఆ చిన్నది, అతికోమలప్రభావ = మిక్కిలి మృదువగు సామర్థ్యము గల, సతి, = సతీదేవి, అందులశంక = ఆవిషయమైన సంశయము, వలదు = కూడదు. కానన్ = కనుక, కోకిలకంఠి = కోవెల కంఠస్వరమువంటి స్వరము గల, చాన = చిన్నది, నిన్నుచేపట్టుట = నిన్ను వివాహామగుట సందియములేదు = సంశయములేదు, వేగన్ - త్వరచేత, మనమెల్ల - మన మంతయుం, అనురాగవృత్తిఁదనరన్ - అనురాగవ్యాపారముచేత, నొప్పఁగా, పోవలయున్ - నీవు వెళ్ళవలయును, అనుచున్ - అంచు, ఆ - అట్టి, మహావిభూతి చిహ్నశాలియగు - గొప్పవియగు, అష్టైశ్వర్యచిహ్నములచే, నొప్పుచున్నవాఁడయిన, రాజమౌళిన్-చంద్రశేఖరుఁడగు నీశ్వరుని, ఆ - అట్టి, సర్వమౌనిమాననీయుండు- ఎల్లమునులకును గౌరవించఁదగు నా విష్ణువు పరిమాణమహిమదనరన్ — యాథార్థ్యమహాత్త్వమొప్పునట్లు అనెన్ — చెప్పెను.

సీత — కడుఁబ్రౌఢిన్ - మిక్కిలి ప్రౌఢత్వముచేత, మహిమవంతుఁడని — మహాత్త్వముగలవాఁడని, లోకములెల్లఁ బొగడమించు ధరేంద్రుఁడు- రాజైనట్టి, అగణనీయ సంపత్తి - వర్ణించశక్యముగాని యైశ్వర్యముగల, జన కుఁడు - జనకుడను వాడు. అతి...వసతి - అతి కోమల — మిక్కిలి క్రొత్త. దిగు. ప్రభా — కాంతికి, వసతి — స్థానమైనది, మనమెల్లన్ - మనమందర మును. భూతిచిహ్నశాలియగు. ఐశ్వర్యచిహ్నములచే నొప్పుచున్నవాడయిన, రాజమౌళిన్ — రాజశ్రేష్టుఁడగు శ్రీరామమూర్తిని సర్వమౌని మాననీయుఁ డు — అందరు మునులచేతను గౌరవించఁదగు విశ్వామిత్రుఁడు. శేషము సమము.

క. సన్యాతతి సన్యాదృశ
సన్యాస పవిత్రులైన ♦ సన్మునులు వచో
విన్యాసమున నుతింపఁగ
మున్యావళి సేవ్యుఁ డతడు ♦ ముదమునఁ జనియెన్. 47

పా— వన్యాతతిన్, వన్యా = వనసమూహముయొక్క, తతిన్ = విస్తారమందు, అన్యా...పవిత్రులైన, అన్యాదృశ-అపూర్వమగు, సన్న్యాస-సంసారత్యాగముచేత, పవిత్రులైన = పుణ్యులైనట్టి, సన్మునులు = మంచి ఋషులు. వచోవిన్యాసమునన్ = వాక్యోపన్యాసములచేత, నుతింపఁగన్ = స్తోత్రముచేయఁగా, మున్యావళిసేవ్యుండు = మునిపంక్తికి సేవించఁదగిన, అతఁడు = ఆవిష్ణుమూర్తి, ముదమున జనియెన్ = సంతోషముచేత, వెడలెను.

సీత— ఆతఁడు = ఆ శ్రీరామమూర్తి.

క. రాజశిశుమౌళి సన్ముని
రాజాన్వితుఁడగుచు నంత ♦ రమణీయ కృపా
రాజిత సదచ్యుత మనో
రాజీవానుగతి మీర ♦ రాజిలు సరణిన్. 48

పా—రాజశిశుమౌళి - బాలచంద్రశేఖరుఁడగు శంభుఁడు, సన్ముని రాజాన్వితుఁడగుచున్ - యోగ్యులగు మునిశ్రేష్ఠులతోఁ గూడినవాడౌచు. అంత - అంతట. రమణీయ...నుగతి. రమణీయ - మంచిదియగు కృపా - దయచేత, రాజిత - ప్రకాశింపఁజేయఁబడిన సత్ - యోగ్యమగు. అచ్యుత విష్ణువుయొక్క మనోరాజీవ - చిత్తపద్మముయొక్క, అనుగతి - అనుసరించుట. మీరన్ - ఒప్పునట్లు, రాజిలుసరణిన్ - ప్రకాశించు రీతియందు.

సీత—రాజశిశుమౌళి - రాజకుమారశ్రేష్ఠుఁడగు శ్రీరామమూర్తి, సన్మునిరాజాన్వితుఁడగుచున్ - యోగ్యమునిశ్రేష్ఠుఁడగు విశ్వామిత్రునితోఁ గూడినవాఁడౌచు. అచ్యుత - జారనట్టి, సరణిన్ - త్రోవయందు.

చ. స్వన లసమాన నేత్రపద♦శాప హతాఖిల ధైర్యవృత్తియై
వనములలో నహల్యబడి ♦ వన్య దృషత్ప్రతిమాకృతిం దగం
గనురతిఁజూచి మేల్వోలయఁ ♦ గామునిగోమలచిత్తవృత్తిగా
నొనరిచి కూర్చి తద్వరచి ♦ తోచితపూజ నతండుగైకొనెన్.

పా—అతండు - ఆయీశ్వరుఁడు - స్వనలసన, స్వన = ధ్వనిచేతను, (ఆగ్నిధ్వనిచేతననుట) లసమాన - ఒప్పుచున్నట్టియు, నేత్ర...వృత్తియై - నేత్ర - నాయకుఁడైన మన్మథునియొక్క. అపదశా - దుర్దశచేత. అపహృత - కొట్టఁబడిన, అఖిల - సమస్తమైన. ధైర్యవృత్తియై - ధైర్యవ్యాపారము గలదియునై, వనములలోన - అడవులలో, హాల్యన్ - దుక్కినేలయందు పడి - పడినదియై. వన్య... కృతిన్ - వన్య - వనమండలి. దృషత్ - రాతితో ప్రతిమ - సామ్యముగల అకృతిన్ - రూపముచేత - (రాత్రివలె నిశ్చేష్టయనుట) తగఁగను - తగియుండఁగా రతిన్ - రతీదేవిని. చూచి - వీక్షించి, మేల్వోలయన్ - ఉపకారమొప్పునట్లుగా, కామునిన్ = మన్మథుని, కోమలచిత్తవృత్తిగాన్, కోమల = మృదువగు, చిత్త - మనస్సునందు వృత్తిగాన్ = ప్రవర్తించువానిగా, ఒనరిచి = చేసి, కూర్చి=ఇద్దరింగూర్చి, తద్వి... పూజన్, తత్ = ఆరతీదేవిచేత, విరచిత - చేయఁబడిన, ఉచిత = తగినట్టి, పూజన్ అర్చను, గైకొనెన్ = అంగీకరించెను.

సీత—అతండు=ఆశ్రీరామమూర్తి, స్వన...వృత్తియై, సు=మిక్కిలి అనలసమాన = అగ్నితుల్యమగు, నేత్రపద = నేత్రము పాదమందుగల గౌతమునియొక్క, శాప = శాపముచేత, హృత = కొట్టబడిన, అఖిలధైర్యవృత్తియై- సమస్తధైర్యవ్యాపారముగలదియై, అహల్య = గౌతమునిభార్య, వనములలోఁబడి, వన్య...కృతిన్, వన్య = వనమండలి, దృషత్ప్రతిమా = రాతిబొమ్మయొక్క, ఆకృతిన్ = ఆకారముచేత, తగన్ = ఒప్పఁగా, కనుగతిన్ = నేత్రప్రీతిచేత, చూచిమునిన్ = గౌతముని, కోమలచిత్తవృత్తిగా నొనరిచి కూర్చి = భార్యతోఁగూర్చి, తద్విరచిత = ఆ అహల్యచేతఁ జేయఁబడిన, శేషము తుల్యము.

శా. శుంభత్ప్రక్రియఁ బద్మబాంధవమహా♦చూడామణీమోషణో
త్తుంభద్రోషయుత ప్రదోషమిషన♦క్తంచారి సంచూర్ణనా
రంభ భ్రశ్యదహర్నృపాలతను ని♦ర్యద్రక్త శైవాలినీ
సంభారంబన సంజకెంజిగి వికా♦సంబొప్పెఁ బ్రత్యగ్దిశన్.

టీ. శుంభత్ప్రక్రియన్ - ప్రకాశించుచున్నరీతిచేత, పద్మబాంధవ-సూర్యుఁడనెడు, మహాచూడామణీ = గొప్పశిరోరత్నముయొక్క, మోషణ-దొంగిలించుటచేత, ఉత్తుంభత్ - గట్టుకొనుచున్న, రోష - కోపముతోడ యుత - కూడిన, ప్రదోషమిష = సాయంకాలమను మిషముగల, నక్తంచారి రాక్షసునిచేతనైన, సంచూర్ణన = నలిపివేయుటయొక్క, ఆరంభ - ఆరంభమందు, భ్రశ్యత్ - జారుచున్న, అహః. దినమనెడినృపాల-రాజుయొక్క తను = శరీరమువలన. నిర్యత్ = బయలుదేరుచున్న, రక్తశైవాలినీ = రక్తనదియొక్క, సంభారంబన = ప్రోవనునట్లు, సంజకెంజిగి వికాసంబు = సంధ్యారాగ వికసనము, ప్రత్యగ్దిశన్ = పడమరదిక్కున, ఒప్పెన్ = ప్రకాశించెను.

వ. అనిన విని హర్షోత్కర్ష తరంగితాంతరంగుండగుచుఁ దదనంతర వృత్తాంతం బెఱింగింపుమనుట

క. శరణాగత జన భరణా
భరణాయుత లసదపాంగ♦ పలితం కరణా
కరణాతిగ సంచరణా
చరణాంభః కలిత గర్భ♦ జడిమ విశరణా.

టీ. శరణా...కరణా. శరణ = రక్షణమునుగూర్చి, ఆగత = వచ్చిన, జన = జనసమూహముయొక్క, భరణ = భరించుటయనెడు, ఆభరణ = అలంకారముచేత, లసత్ = ప్రకాశించుచున్న, అపాంగ = నేత్రప్రాంతమందు,

ఫలితఁకరణా = వరపుసేయువాఁడా. కరణాతిగసంచరణా, కరణాతిగ = ఇంద్రియగోచరముగాని, సంచరణా = సంచారము గలవాఁడా, చరణాం... విశరణా, చరణ = పాదమందలి, అంభః = ఉదకముచేత, కలిత = చేయఁబడిన, గర్భ = కుక్షియందలి, జడిమ = మాంద్యము యొక్క, విశరణా = సంహారముగలవాఁడా.

గద్య.

ఇది సర్వతంత్రస్వతంత్ర సకలభాషావిశేష కవితా ధురంధర ప్రతిదిన ప్రబంధ
పరమేశ్వర శ్లేషయమకచక్రవర్తి బిరుదాంక తిరుమల బుక్కపట్టణ
శ్రీనివాసతాతాచార్యతనయ శ్రీమదణ్ణయాచార్యదీక్షితసుతపితృవ్య
శ్రీనివాసాచార్య కృపాకటాక్షలబ్ధ సకలపాండిత్యతర్కాలంకార
వాగీశ్వరబిరుదాంక వేంకటాచార్య ప్రణీతంబైనయచలాత్మజా
పరిణయంబను శ్లేష ప్రబంధంబునందుఁ దృతీయాశ్వాసము
సర్వంబును సంపూర్ణము.

శ్రీ శ్రీ శ్రీ.

---